శ్రీః

# అచ్చతెలుఁగుకోశము

## తృతీయ సంపుటము




'వ్యాకరణవిద్యాప్రవీణ' 'ఉభయభాషాప్రవీణ'

'సాహిత్యాలఙ్కార' 'సహస్రావధాని'

పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

తెనాలి

# వర్గసూచిక (తృతీయసంపుటమునకు)

## తృ తీ య కా ం డ ము





# అచ్చ తెలుఁగు కోశము

# తృతీయ కాండము

## విశేష్యనిఘ్నవర్గము

క. శ్రీ తరుణీశతజనకీ
భూతాక్ష ! తురంగితోక్ష ! మురభిత్ప్రముఖో
ద్గీతరణా ! ఖ్యాతగుణా !
భూతగణాధీశ ! మాతృభూతమహేశా ! 1

మూఁడవకాండ మారంభించుచుఁ దదారంభమును గృతిస్వామికి వినుచు చున్నాఁడు గ్రంధకర్త.

అర్థ:—శ్రీతరుణీశతజనకీభూతాక్ష-లక్ష్మీకాంతలను జాలమందినిఁ గలిగించెడి (అణి మాదిమహైశ్వర్యములఁ జేకూర్చెడి యనుట) కన్నులు గలవాఁడా ! (చూచిన మాత్రినే ఐశ్వర్యవంతులఁ గాఁ జేయుపరమేశ్వరుఁడా-యనుట). తురఙ్గిత + ఉక్ష-గుఱ్ఱము గా (వాహనము గా) ఒనర్పఁబడినవృషభము (ఎద్దు) గలవాఁడా! (నందివాహనా ! యనుట). మురభిత్ + ప్రముఖ + ఉద్గీతరణా-విష్ణువు-మొద లగువారిచే (దేవతాప్రముఖుఁచే అనుట) బిగ్గర గాఁ బాడఁబడినయుద్ధములు (త్రిపురసంహారాదులు) గలవాఁడా! (ఇందువలన వందిమాగధులట్లు విష్ణ్వాదులు కైవారము చేయుట వచింపఁబడి యీస్వామి సర్వాధికుఁ డగుపరమేశ్వరుఁ డగుట వచింపఁబడిన దనవచ్చును). ఖ్యాతగుణా !-ప్రసిద్ధి గాంచినసుగుణములు (గరళభక్షణాదులవలనియార్తరక్షణపరాయణతాదులు) గలవాఁడా!. భూతగణ + అధీశ-పిశాచసంఘమునకు నాయకుఁడా! (లేదా) భూతములకు-ప్రమథగణములకు

నాయకుఁడా ! అని యర్థము. మాతృభూతమహేశా(మాతృభూతేశ్వరా! వినుము అనుట).

శ్రీతరుణీ .. క్ష:—'సంపల్లక్ష్మ్యై శ్రైక్యమ్'అని దేవేశుఁడు. బ్రహ్మ యొకమహాలక్ష్మిని సృష్టింప, నట్టి తరుణులను వేనవేలఁగా సృజించి, బ్రహ్మను మించ మున్నవి యీస్వామిపీక్షణము లనుట తెలుపఁబడు చున్నది. కేతన శివుని వర్ణించుచు-'నీహారకరాపరంసుఁ డణిమాదిగుణ ప్రదవీక్షణుండు'(దశ. పీ. 2ప.) అనినాఁడు.

తురగ్గితోక్ష:—తురజ్గితము 'త త్కరోతి త దాచష్టే'ణిజ న్త మగు'తురంగ'శబ్దమునకుం బెఁగర్మార్థక'క్త'ప్రత్యయము. ఇట వాహనవిశేషవాచక మగు తురంగశబ్దము లక్షణచే వాహన మాత్రవాచకము.

మురభిత్ . రణా:—'ముజ్జకేశీ మురరిపుః'అని విష్ణునామములయందు చదువుచుము. 'మురుఁ' డనువాఁ డొకరాక్షసుఁడు. నరకునియనుయాయి, నరకాసురసంహారసమయమున విష్ణునిచే నాఁడు సంహరింపఁ బడినాఁడు (చూ. భాగ.). కాళిదాసు పార్వతిని వివాహమాడఁ బోవుచున్న మహేశ్వరుని విట్లు వర్ణించినాఁడు— 'విశ్వావసుప్రాగ్రహరైః ప్రవీణైః సంగీయమానత్రిపురావదానః । అధ్వాన మధ్వాన్త వికారలజ్ఘ్యై స్తతార తారాధిపఖణ్డధారీ' (కు.సం.7స.48శ్లో.).

భూత. ధీశా:—'భూతా శ్శివస్య పార్షద్యాః పార్షదాః'అని ( సంసారావ ర్తము ) (చూ. [illegible]). 'బూచులదొర'అని శివనామప్రస్తావమున (ఆం.భా.సాంబ.మొ.). 'భూతం క్ష్మాదౌ పిశాచాదౌ.... దేవయోన్య న్తరే తు నా'అని (మేదిని). గణశబ్దము ప్రమథగణవాచకము, సమూహార్థకము గూడ. 'సంఘాతే ప్రమథే గణః' అని (అమ.).

ఆ. చను విశేష్యనిఘ్నసంకీర్ణనానార్థ
కావ్యయక్రియాఖ్య లమరువర్గ
ములు తృతీయకాండమునను గ్రమంబు గా;
మహితగుణసమేత ! మాతృభూత ! 2

అర్థ:—విశేష్యనిఘ్నవర్గము, సంకీర్ణవర్గము, నానార్థవర్గము, అవ్యయవర్గము, క్రియావర్గము-అనునవి క్రమము గా ఈతృతీయకాండమునందు చెప్పఁబడును.

విశేష్యనిఘ్నవర్గము:—విశేష్యమునుబట్టి వచనాదులు విశేషణముల కేర్పడును.అట్టి విశేషణములగుఱించి వచించునది.

సంకీర్ణవర్గము:—పర్యాయములనుగూర్చియేకాక, వేఱువే అర్థములు గల నానాజాతీయము లగు వేఱువేఱుపదములనుగూర్చి తెలుపునది

నానార్థవర్గము.—అనేకార్థములు గలపదిపములను ఆయాయర్థములతో వివరించునది.

అవ్యయవర్గము:—విభక్తివచనాదులు లేనిపదములయొక్క అర్థములను, అట్టిపదముల పర్యాయములను ఎఱిఁగించునది.

క్రియావర్గము·—క్రియలయొక్క అర్థములను వానిప్రయోగమును (సంగ్రహముగ) తెలుపునది.

వర్గములు.—'విశేష్యనిఘ్నము'మొదలు గా నాలుగువర్గములు, అమరమున తృతీయకాండమునందు, ఇట్లే వరుస గా కలవు. ఇఁక ఐదవది గా 'లిఙ్గాదిసంగ్రహవర్గము' అమరమున ఉన్నది. ఇందు 'క్రియావర్గము' ఐదవది గా ఐనది.ఇది విశేషము.

సీ. మను మేలువాఁ, డనఁగను శుభకరిసంజ్ఞ;
మంచివాఁ,డనఁగ శోభించు సుకృతి;
వటర,యం చనఁగ నేర్పరి,యన రవ,రన
దంట,నా జాణ,నాఁ దగు సమర్థుఁ;
డలరు జూ,టనఁగ జిత్తులవాఁ,డనంగ వం
చకుఁ;డీఎకాఁడు,నాఁ జనును దాత;
తెలివికాఁ,డనఁగను వెలయు చుండు నభిజ్ఞుఁ;
డాఢ్యుఁడు విలసిల్లు నాస్తికాఁడు,

గీ. నాఁగఁ గలవాఁడు,నాఁగను నచ్చుకుప్ప,
యనఁగ విడిముడి గలవాఁ, డటన్నఁ; దిండి
పో,తనఁగ భక్షకాఖ్య యై పొలుపుఁ గాంచుఁ;
బుంగవతురంగ! శ్రీమాతృభూతలింగ!

మేలువాఁడు—ఇది శుభకరునకు (శుభము కలిగించువానికి;క్షేమము చేకూర్చువానికి; శివంకరునకు) పేరు.

మంచివాఁడు—ఇది సుకృతికి (పుణ్యవంతునకు;అదృష్టశాలికి;ధన్యునకు) పేరు.

వటర,నేర్పరి,రవర,దంట,జాణ—ఇవి సమర్థునకు (చతురునకు; కార్యము నెఱవేర్చుటయందు నేర్పు గలవానికి; ప్రోడకు) పేర్లు.

జూటు,జిత్తులవాఁడు—ఇవి వంచకునకు (ధూర్తునకు;మోసగానికి, ఇతరులను వంచించు (మోసగించు) స్వభావము గలవానికి) పేరు.

ఈవికాఁడు—ఇది దాతకు (త్యాగికి; ఈగికానికి;దానము చేయువానికి) పేరు.

తెలివికాఁడు—ఇది అభిజ్ఞునకు (వివేకికి;తెలిసినవానికి) పేరు.

ఆస్తికాఁడు,కలవాఁడు,అచ్చుకుప్ప,విడిముడి గలవాఁడు—ఇవి ఆఢ్యునకు (ధనవంతునకు,ధనికి,బహుధనము గలవానికి;సంపన్నునకు) పేర్లు.

తిండిపోతు—ఇది భక్షకునకు (ఊరక తినునట్టిస్వభావము గలవానికి; తిండికానికి; అమితభక్షకునకు) పేరు.

వటర:—'వతర'అని (శ.ర.). 'రవర'కు (రూపాం.) అనుచు ప్రయోగ మిట్లిచ్చినది-'వరర వై కొంచెపువారిపైఁ జూపు। 'నటన మాముందఱ నడవ దెల్లపుడు' (భాగ. 5స్కం.). 'వటగ' గ్రహించి 'సమర్థుఁడు' అని అర్థ మిచ్చినది. (ఆం.భా.ప్రాఁత.పా.) గూడ 'వటగ' (చూ.సూ.ని.వటర.) ప్రౌ.పా.గూడ 'వటగ' అనియే। (చూ.అను.).

నేర్పరి:—' ..జతురుపే ళ్లగు దిట్ట జాణ దంట వలంతి, వెరవరి ప్రోడ నేర్పరి యనంగఁ... (సాంబ. మాన. 5.).

వంచకుఁడు:—'ధూర్త స్తు వఞ్చకః'అని (అమ.). ఇట-'పరప్రతారకస్వభావస్య'అని (సుధ.).

ఆఢ్యుఁడు:—'ఇభ్య ఆఢ్యో ధనీ' అని (అమ.).

తెలివికాఁడు:—వివేకము గలవాఁడు, ప్రాజ్ఞుఁడు-అని (శ. ర.) మొ.' చెలువము విద్దెయుం గొనముఁ జేవయుఁ బ్రోడతనంబుఁ దెల్వియుః' (నీలా.1.92.) (చూ.సూ.ని.).

అభిజ్ఞుఁడు:—'ప్రవీణే నిపుణాభిజ్ఞ విజ్ఞ నిష్ణాత శిక్షితాః । వైజ్ఞానికః కృతముఖః కృతీ కుశల ఇత్యపి' అని (అమ.). 'అభిజ్ఞనిపుణాదిశబ్దములను ఏకార్థకములఁగానే వచించినది.

విడిముడి:—'విడిముడి యన రొక్క మనఁగ విత్తంబునకుం । బుడమిని నామము లగు' (ఆం. సం. స్థా. 30.).

గీ. పరఁగుఁ దాశీకుఁ,డనఁగఁ దీర్పరి,యనంగఁ
గార్యకర్తకుఁ బేరు గా,ఖ్యాతసంజ్ఞ
యగును బేరైనవాఁడు,వాసైనవాఁడు,
మంతు కెక్కినవాఁడు,నా;మాతృభూత ! 4

తాశీకుఁడు,తీర్పరి—ఇవి కార్యకర్తకు (కార్యములు చక్కఁబెట్టువానికి;పనులు నెఱవేర్చువానికి) పేర్లు.

పేరైనవాఁడు,వాసైనవాఁడు,మంతు కెక్కినవాఁడు—ఇవి ఖ్యాతునకు (విఖ్యాతునకు; ప్రసిద్ధి కెక్కినవానికి;ప్రఖ్యాతునకు) పేర్లు.

ఖ్యాతుఁడు:—'ప్రతీతే ప్రథిత ఖ్యాత విత్త విజ్ఞాత విశ్రుతాః' (అమ.).

తీర్పరి.—'రా జుగ్రసేనుఁ డై రాజిల్లఁ దాను దీ,ర్పరితనం బెంతయుఁ బ్రభుతతోడ । నడపువాఁ డయ్యె ' (హరి. ఉ. 2.178.) (చూ.సూ.ని.). ['పరఁగుఁ దాశీకుఁ డనఁగ దీర్పరి'(వావి. అపముద్రి.)].

గీ. తనరు నడ్డము లేనివాఁ,డనఁగ నిచ్చ
నుండువాఁ,డన నిరవగ్రహుఁడు; చాలు
మాసి,పనుపరి,యనఁగను భాసిలుఁ బర
తంత్రనామంబు;మాతృభూతాభిధాన ! 5

అడ్డము లేనివాఁడు,ఇచ్చ నుండువాఁడు—ఇవి నిరవగ్రహునకు(స్వచ్ఛందవర్తునకు; స్వతంత్రునకు) పేర్లు.

చాలుమాసి,పనుపరి—ఇవి పరతంత్రునకు (పరాధీనునకు:ఒకరికి లోఁబడి వర్తించువానికి;పరతంత్రునకు ) పేర్లు.

నిరవగ్రహుఁడు:—'స్వతన్త్రో ఉపావృత స్స్వైరీ స్వచ్ఛన్దో నిరవగ్రహః' అని (అమ.).

చాలుమాసి:—ఇతరుల కనుకూలుఁడు గ వర్తించు మనుష్యుఁడు. (మాసి) మానిసియొక్క (రూపాం.) (చూ.శ.ర.). (చాలు-అనుకూలపడు.) (వానికి శని చాలదు. మొ.వ్యవ.).' చాలు మానిసి' దీనికి పర్యాయ మని (బ్రౌ.) దశావతారచరిత్రప్రయోగము నొకదానిని ఇట్లుదాహ రించినది.'తనయులును దాము రావలె ననుచుఁ జాలు। మాన(ను?) సులు దశరథరాజమౌళి తోడఁ । దెలుపవలె ననుపక్కఁణ గలిగినట్టి' (అని).

పరతంత్రుఁడు:—పరతన్త్రః పరాధీనః పరవా న్నాథవా నపి' (అమ.).

సీ. మదట,తొండొరు,తొండు,మదల,మాలుగుఁబోతు,
  చండి,సోమరి,నలితిండికాఁడు,
దుండుబలి,యనంగఁ దోఁచుఁ బ్రాల్మాలిన
  వానిపేరై;పనివాఁ,డనంగఁ
గర్మకారుం జొప్పుఁ;గర్మదక్షుఁడు వితత
  మరి, హర్వుకాఁ,డనఁ బరఁగు చుండు;
వఱలు జాల్మఁడు చెఱపనచేట,యనఁగను;
  బలలాశి కౌచుమేపరి,యనఁ దగు;

గీ. ననద,యనఁగ ననాధుండు దీనరుఁ;బొట్ట
పోసికొనువాఁ,డనంగను బొట్టసాఁకు
వాఁ,డనఁగ వెలయు నుదరంభరిసమాఖ్య;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ ! 6

మదట,తొండొరు, తొండు,మదల, మాలుగుఁబోతు, చండి, సోమరి, నలితిండికాఁడు, దుండుబలి—ఇవి ప్రాల్మాలినవానికి (అలసునకు,పాలుమాలినవానికి;బద్ధకించువానికి) పేర్లు.

పనివాఁడు—ఇది కర్మకారునకు (వేతనము(కూలి) తీసికొనక పని చేయువానికి;దాసు నకు) పేరు.

వితమరి,హర్వుకాఁడు—ఇవి కర్మదక్షునకు (కార్యశూరునకు;కర్మఠునకు;ఆరంభించిన పని వదలక నెఱవేర్చువానికి) పేర్లు.

చెఱపనచేట—ఇది జాల్మునకు (అసమీక్ష్యకారికి;ఆలోచింపక పని చేయువానికి;అవిమృశ్యకారికి) పేరు.

కౌచుమేపరి—ఇది పలలాశికి (కవుచుమేపరికి;ఆమిషభోజికి; మాంసము తినువానికి) పేరు.

అనద—ఇది అనాథునకు (దిక్కులేనివానికి;దిక్కుమాలినవానికి;గతి లేనివానికి)పేరు.

పొట్టపోసికొనువాఁడు,పొట్టసాఁకువాఁడు- ఇవి ఉదరంభరికి (కుక్షింభరికి; ఆత్మంభరికి; స్వోదరమాత్రపూరకునకు;దేవతలు అతిథులు మొదలగువారికి పెట్టక తానుమాత్రము భుజించువానికి) పేర్లు.

మదట:—'మదట గాలిపయాళి మాంతమా యని కుమారికలు పుష్పోడు లావరించుకొనిరి.... ' (వేం.పం.4.129.) - ఈ ఆం.భా.కు ఉదాహరణముగా ఈప్రయోగ మిచ్చినది (బ్రౌ.) (చూ.అను.). (సూ.ని.) దీనికి మదించినది, మత్తుఁడు-అర్ధ మిచ్చి, పై ప్రయోగమును నుదాహరించినది. (బ్రౌ) చెప్పినయర్థమే పరిశీలింపఁగా ఇట సముచిత మనిపించుచు చున్నది. మదట-ప్రాల్మాలిక గలవాఁడు; సోమరి. మాంద్యము కలవాఁడు; మెల్లమెల్లగా వీచువాఁడు (గాలి) మందమారుతము-అని (అర్థాం.) స్ఫూర్తి). (ఆం.భా.)కు లక్ష్య మనఁ దగినదే యిది.

మాలుగుఁబోతు:—['మూలుగుఁబోతు' (వావి.పా.అపపా.)] 'కూలికి వచ్చి యీడ వరిఁ గోయుచుఁ గూరుకు చెంద వచ్చెనే। మాలుగుఁబోతు వీని కనుమానము లేదిఁకఁ జేనిపెద్దచేఁ । దోలుఁడి యీదినంబు మనతో సరి గాఁ బడి ముట్టఁబోదు.' (చెన్న.3.417.).

పనివాఁడు:—భృత్యుఁడు,కింకరుఁడు-అని (శ.ర.). భృత్యుఁడు,సేవకుఁడు-అని (సూ.ని.). మంచి పనివాఁడు-అని (బ్రౌ.).

కర్మకారుఁడు:—'కర్మకర,కర్మకార' శబ్దములకు (అమ.) భేదమును ఇట్లు వచించినది 'భరణ్యభుక్కర్మకరః కర్మకార స్తు తత్క్రియః' (అని). (సుధ) ఈ భేదమును ఇట్లు వివరించినది- '(కర్మకరః)-మూల్యేన కర్మ కుర్వతః (కర్మకారః) -యో వేతనేనవినా కర్మ కరోతి

త్ఖణ్డలవణే ఖల ధుత్తూరయో రపి' (విశ్వ.).ఆం.భా.) లోనియిచ్చటి 'ధూ_ర్త' శబ్దము'ఖల' పర్యాయ మనిపించు చున్నది. 'శఠ-వంచక' శబ్దములకు వేఱు గా అర్థము వచించు చున్నది (అమ.) 'నికృత _స్త్వనృజు శ్శఠః' 'ధూ_ర్త స్తు వఞ్చకః' (అని.). (ఆం.భా.) వంచకునిఁగూర్చి శఠునిఁగూర్చి, ఖలునిఁ గూర్చి వేఱుగా వచించినది (చూ.3.3.13.). ఖలవిశేష మిచ్చటి 'ధూ_ర్త' శబ్దమునకు అర్థ మని తోఁచినది.

అడిగొట్టు:—ఇట 'అడిగంటు' అని ((బ్రౌ.ఆం.భా.పా.) (చూ.అను.).

కుచ్చితుఁడు:—(సం కుత్సితుఁడు) '.. కుపూయ కుత్సి తావద్య ఖేట గర్హ్యాణకాః స్సమాః' అని (అమ.). ఇట( గురు.) - 'జాత్యాచారాదులచే నిందితుఁ డైనవానిపేళ్లు' అని వ్యాఖ్యానించినది.

గీ. మొరసు,మోటు,పిసాళి,నా మూఢుఁ దొప్పుఁ;
దనరు శాలీనసంజ్ఞ మేదకుఁ,డనంగ;
నెసఁగు చుండును బ్రియవాది యిచ్చకాల
మారి, యనఁ వైశ్యకన్యకామాతృభూత ! 8

మొరసు,మోటు,పిసాళి—ఇవి మూఢునకు (అజ్ఞునకు;మోఱకునకు;తాను పట్టిన కుందేటికి మూఁడే కాళ్లు-అనెడి 'అవివేకి'కి) పేర్లు.

మేదకుఁడు—ఇది శాలీనునకు (దిట్టతనము లేనివానికి;పనులయందు చొరవ లేనివానికి) పేరు.

ఇచ్చకాలమారి—ఇది ప్రియవాదికి (పి్రియంవదునకు; ఇచ్చకపుమాట లాడువానికి: ముఖప్రీతికై 'ఇష్టము' అని అసత్యవచనము లైనను పలుకువానికి; ఇచ్చగొండికి) పేరు.

మూఢుఁడు:—'అజ్ఞే మూఢ యథాజాత మూర్ఖ వైధేయ బాలిశాః' (అమ.). మూఢుని (మూర్ఖుని) స్వరూపమును భర్తృహరి ఇట్లు వచించినాఁడు-'అజ్ఞ స్సుఖ మారాధ్య। స్సుఖతర మారాధ్యతే విశేషజ్ఞః। జ్ఞానలవదుర్విదగ్ధం। బ్రహ్మా ఽపి నరం న రఞ్జయతి' (సుభా.నీతి.2.).

శాలీనుఁడు:—'స్యా దధృష్టే తు శాలీనః' (అమ.) 'ద్వే సలజ్జస్య' అని (సుధ.). 'దిట్టతనము లేనివానికి'-అని (గురు.).

ప్రియవాదీ:—'శ్లక్ష్ణః ప్రియంవదే' అని (అమ.). ఈప్రియంవదుఁడే ప్రియవాది అనిపించును. ప్రియోక్తి సనాతనధర్మ మని మను విట్లు వచించినాఁడు-'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయా న్న బ్రూయా త్సత్య మప్రియమ్। ప్రియం తు నా ఽనృతం బ్రూయా దేష ధర్మ స్సనాతనః' (అని.).ఈప్రియవాది మనువు వచించు 'ప్రియవాది' కాఁ డనిపించును।(ఆం.భా.) ఇచ్చకము-ఇష్టోక్తి-అనినది (1 117). 'ఇచ్చకము' నకు 'ముఖప్రీతివచనము' అనుఅర్థము సుప్రసిద్ధము తెలుఁగువారివ్యవహారమున. ఒకప్రయోగ మి ట్లున్నది-' నిర్భయత నాప్తుల కిచ్చక మాడ వచ్చునే' (కలా.7.250.).మొ. 'ప్రియ మపి తథ్య మాహ' అని (అభి.శా.4అం.). ఇందులకే మనువు వచించినప్రియము, ఈప్రియము వే అనిపించినది.ఆం.భా. అందులకే 'ప్రియవాది' ని 'ఇచ్చకాలమారి' అని స్పష్టము గా వచించినది. పై(అమ.)ను ఆం.భా. విశదపఱచిన దనవచ్చును. 'శక్లః ప్రియంవదే' అని (సుధా.అమ.పా.). 'శ్లక్ష్ణవా క్తు ప్రియంవదః । శక్లో మధురవా (క్సొఽథ.)' (అని) (వైజ.సామా.అర్థ.).

సీ. అలరుఁ దంటలమారి,యన నవినీతుండు;
　　　భయశీలుఁ డౌ వెఱపరి,యశుకరి,
కోశె,నాఁగను వెఱఁగుపడువాఁ,డనఁగను
　　　విస్మయాన్వితసంజ్ఞ వెలయు చుండుఁ;
గాందిశీకుఁ డగు దిక్కుమొకం,బనఁగను;
　　　బ్రౌఢుండు ప్రోఢ,నాఁ బరఁగు చుండుఁ;
దీయువాఁ,డనఁగను దెలియ నౌ గ్రహయాళు:
　　　పతయాళు వగుఁ బడువాఁ,డనంగ;

గీ. ప్రొక్కువాఁ,డన వందారు వొలుచు చుండు;
ఘాతకుఁడు నొంచువాఁ,డనఁగాఁ జెలంగు;
నుబుకువాఁ,డన వర్ధిష్ణుఁ డొప్పు చుండు;
భూరిభవభంగ ! శ్రీమాతృభూతలింగ !

దాఁటువాఁడు—ఇది లంఘికి (దుముకుచు పోవువానికి) పేరు.

నిసువాసి—ఇది విశ్వాసికి (నమ్మువానికి; నమ్మకము గలవానికి) పేరు

సిగ్గరి—ఇది హ్రీమంతునకు (సిగ్గుపడువానికి; లజ్జాశీలునకు) పేరు.

హౌసుకాఁడు—ఇది భోగికి (సుఖవంతునకు; అనుభవము గలవానికి) పేరు.

గుమ్మఁడు, చికిలికాఁడు, సొగసుకాఁడు, వన్నెకాఁడు, నీటుకాఁడు—ఇవి అలంకారికి (అలంకరిష్ణునకు; అలంకరించుకొనెడివానికి) పేర్లు.

ఉండువాఁడు—ఇది వర్తిష్ణువునకు (వర్తనశీలునకు; నిలుకడ గా ఉండువానికి) పేరు.

తోపరి—ఇది త్రోయువానికి (త్రోపరికి, గెంటెడివానికి; నెట్టెడివానికి) పేరు.

మినమిననివాఁడు, గరగరనివాఁడు—ఇవి మేదురునకు (చిక్కనై (వృషమై) నున్ననైనమేను గలవానికి) పేర్లు.

హ్రీమంతుఁడు:—ఈసందర్భమున 'లజ్జాశీలో ఽపత్రపిష్ణుః' అని (అమ.). (అతిశయితార్థమున ఇట మతుప్పు.)

నీటుకాఁడు:—దీనికి (సూ.ని.) 'అందగాఁడు' అను-అర్థ మిచ్చి ఈ (ఆం.భా.) ప్రమాణ మను చున్నది. 'అలంకరిష్ణు స్తు మణ్డనః' అని (అమ.). 'శృంగారించుస్వభావము గలవాని పేళ్లు' అని (గురు.). (సూ.ని.) ఇట ఇట్లనియు, 'గుమ్మఁడు' అనుదానికి ఈ(ఆం.భా.)ప్రమాణ మిచ్చి 'అలంకరించుకొనువాఁడు, అలంకారి' అను చున్నది 'చికిలికాఁడు' దీనికి 'పర్యాయ' మను చున్నది (ఆం.భా.). ఒకప్రయోగ మి ట్లున్నది-'చిఱుతప్రాయంబు గలవాఁడు చికిలికాఁడు। సొగసుచిన్నెలవాఁడు కోరఁ గలవాఁడు। నందముల కెల్ల నొకయంద మైనవాఁడు। చారుతర మూర్తి గోపాలచక్రవర్తి' (సుదంతా.1.88.) (చూ.సూ.ని.). (సాంబ.) శృంగారికి పే ర్లని వీనియందు కొన్నిటిని ఇ ట్లుదాహరించు చున్నది.-' ...నందగాఁడు। వగకాఁ డమరువాఁడు వన్నెకాఁ డెమ్మెకాఁ, డౌసుకాఁ డన సొగ సైనవాఁడు। నీటుకాఁ డనఁగ రాణించు శృంగారికి' (మాన.8.). 'శృంగారి'-అనుట 'అలంకారి' అనుటయే। 'శృఙ్గారీ తు సువేషే స్యాత్' అని (విశ్వ). (హౌసుకాఁడు-రూపాం. ఔసుకాఁడు).

మేదురుఁడు:—'సాన్ద్రః స్నిగ్ధ స్తు మేదురః' (అమ.).

మినమిననివాఁడు:—(మినమిన) 'తళతళ' అనుకాంతివిశేషము. 'మినమిన- లీనెడు నునుమే। నున '(హంస.4.) (చూ.శ.ర.)

గరగరనివాఁడు:—'చక్కనైనన్నునైనవాఁడు, మేదురుఁడు'అని (సూ.ని.) 'గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు। చూడఁ గలవాఁడు మేలైనసొబగువాఁడు। వావి మేనత్తకొడుకు గావలయు నాకు। నర్జునుండు పరాక్రమోపార్జునుండు' (విజ.వి.2.164)' అను చున్నది. (సూ.ని.) ఉదాహరించిన-ఈప్రయోగమునుబట్టి చూచిన 'చిక్కనైన'అనుట కైనప్రమాదము 'చక్కనైన' అనిపించును. ఇట్లే 'పరాక్రమోపార్జునుండు' అనుటయు '..పార్జనుండు' అనుట కైనప్రమాద మనవచ్చును.

సీ. జట్టికాఁ,డనఁగను జనుఁ గ్రేత;తఱుగరి,
యనఁగను దత్సహాయాఖ్య చెలఁగు;
నగుఁ బ్రధానాభిధ యంకెకాఁ,డనఁగను;
గోపకాఁ,డనఁగను గోపి దనరు;
బలువిడి,యనఁగను బల్లిదుం,డనఁగను
దండివాఁ,డన బలాఢ్యుండు చెలఁగుఁ;
బరఁగును క్షంత యోర్పరి,యనఁ, దాలిమి
కాఁ,డన; జాగరూకాభిధాన
గీ. మలరు మెలఁకువకాఁ,డన;నగును గూర్కు-
వాఁ,డనంగను నిద్రానువర్తి పేరు;
వెలయు మాటలమారి,నాఁ బ్రేలువాఁడు,
నాఁగ వాచాటుఁ డై యొప్పు; నాగభూష! 11

జట్టికాఁడు-ఇది క్రేతకు (వెల యిచ్చి సరకులు కొనెడివానికి;క్రయికునకు) పేరు.

తఱుగరి—ఇది తత్సహాయునకు (క్రేతకు సహాయుఁడు గా ఉండెడివానికి;తఱుగు బేరగానికి; అమ్మెడివానికి కొనెడివానికి వెల కుదిర్చి,అందులకై ప్రతిఫలము గా (నూటి కింత యని) ద్రవ్యము పుచ్చుకొనెడివానికి) పేరు.

అంకెకాఁడు—ఇది ప్రధానునకు (ముఖ్యుఁడైనవానికి) పేరు.

కోపకాఁడు—ఇదికోపికి (క్రోధనునకు; కోపపడుస్వభావముకలవానికి) పేరు.

బలువిడి,బల్లిదుఁడు,దండివాఁడు—ఇవి బలాఢ్యునకు (మిక్కిలి బలముగలవానికి; అధికసత్త్వునకు, బలవంతునకు) పేర్లు.

ఓర్పరి,తాలిమికాఁడు—ఇవి క్షంతకు (సహిష్ణువునకు;ఓరుపరికి;ఓర్పు గలవానికి; సహనశీలునకు) పేర్లు.

మెలఁకువకాఁడు -ఇది జాగరూకునకు (జాగరూకత కలవానికి; మేలుకొని యుండు స్వభావము గలవానికి) పేరు.

కూర్కువాఁడు—ఇది నిద్రానువర్తికి (నిద్రాళువునకు; నిదురపోతునకు; ఎపుడు నిద్దురపోవు చుండెడివానికి) పేరు.

మాటలమారి,ప్రేలువాఁడు—ఇవి వాచాటునకు (ప్రేలరికి; వదరుఁబోతునకు;జల్పాకునకు;చెడ్డమాటలు పెక్కులు పలుకువానికి) పేర్లు.

జట్టికాఁడు:—'జట్టి। విలువ రో వెల యనఁ గ్రయాఖ్యలు తనర్చు' (సాంబ.సూ.35.).

ప్రధానుఁడు:—క్రేతలలో ముఖ్యుఁడు-అని ఒకనిఘంటుకర్త.(సూ.ని.శ.ర.బ) దీనిని గ్రహింప లేదు.

కోపకాఁడు:—ఇదియే (బ్రౌ.అం,భా.పా. . (శ.ర.)'కోపగాఁడు'అనియే అనుచున్నది. కోపగాఁడు-అని (సూ.ని.). నిర్ధారకము లేదు. ('కోపీ' ఆవశ్యకార్థమున ణిని ప్రత్యయము.) 'క్రోధనో ఽమర్షణః కోపీ'అని (అమ.).

బలువిడి:—(బలువు-'ఇడి స్వార్థమున'-అని(సూ.ని.) ఈయర్థమున ఈపదమును (శ.ర.బ్రౌ.బ). గ్రహింప లేదు.

జాగరూకుఁడు:—'జాగరూకో జాగరితా', అమ.).

మెలఁకువకాఁడు:—పదిలుఁడు-అని ఒకనిఘంటుకారుఁడు ఇది తరువాత ఏర్పడినలాక్షణికార్థ మనఁ దగినది.

వాచాటుఁడు:—'స్యా జ్జల్పాక స్తు వాచాలో వాచాటో బహుగర్హ్యవాక్'అని (అమ.). 'ఆలజాటచౌ బహుభాషిణి' (5.2.125సూ.). 'కుత్సాయా మితి వాచ్యమ్'అని (వార్తి).

సీ. పొలుచు నసత్యుందు బొంకరి,యన రజ్జు
లాఁ,డనంగను జల్లికాఁ,డనంగ;
మ్రోసెడిది,యనంగ ముఖరాఖ్య తగు;న_త్తి
వాఁ,డన లోహలవాచక మగు;
వ్యర్థభాషుఁడు వశావశికాఁ,డనం దగు;
గెలివివాఁ,డనఁగను జెలఁగు రవణుఁ;
డజ్ఞుందు తగు దమ్మఁ,డంబ,_స్తనంగను;
గరినాత్ముఁ డొప్పును గడుసరి,యన;

గీ. వెలయు నగ్నుంతు దిసమొల, బి_త్తలి,యనఁ;
దనరు వెలిఁబడ్డవాఁ,డనఁగను బహిష్కృ
తుఁడు;బరికాయ,కొంటె,నాఁ దోఁచు భ్రష్టుఁ;
డాతతదయారసోపేత ! మాతృభూత ! 12

బొంకరి,రజ్జులాఁడు,జల్లికాఁడు—ఇవి అసత్యునకు (అసత్యవాదికి; అనృతములు (అబద్ధములు) పలుకువానికి) పేర్లు.

మ్రోసెడిది—ఇది ముఖరమునకు (మ్రోఁగెడిదానికి; ధ్వనించెడి అందె-మొద లగు దానికి) పేరు.

న_త్తివాఁడు—ఇది లోహలునకు (అస్ఫుటవాక్కునకు; వ్యక్తము గాకుండ మాట లాడువానికి; నంగినంగిమాట లాడువానికి) పేరు.

వశావశికాఁడు—ఇది వ్యర్థభాషునకు (ఊరక వ్యర్థము లైనమాట లాడువానికి) పేరు.

గెలివివాఁడు—ఇది రవణునకు (గోల చేయువానికి) పేరు.

దమ్మఁడు,అంబస్తు—ఇవి అజ్ఞునకు (జడునకు; జడమతికి; తెలివి లేనివానికి; సుఖ దుఃఖము లెఱుఁగనివానికి) పేర్లు.

గడుసరి—ఇది కఠినాత్మునకు (కఠినునకు; గట్టిమనస్సు కలవానికి) పేరు.

దిసమొలి,బిత్తలి—ఇవి నగ్నునకు (దిస్సమొల గలవానికి; దెసమొలవానికి; దిగంబరునకు; వస్త్రము లేనివానికి) పేర్లు.

వెలిఁబడ్డవాఁడు – ఇది బహిష్కృతునకు (సంఘాదులనుండి వెడలఁగొట్టఁబడినవానికి) పేరు.

బరికాయ,కొంటె—ఇవి భ్రష్టునకు (చెడ్డవానికి; గుణహీనునకు; అకార్యము లొనర్చువానికి) పేర్లు.

ముఖరుఁడు :- ఈసందర్భమున —(అమ.) 'దుర్ముఖే ముఖ రాబద్ధముఖౌ' అని అప్రియవాదినిఁ బేర్కొను చున్నది.

నత్తివాఁడు:— 'నత్తి-మాట లాడునపుడు మొదటియక్షరములు పలుమాఱు లుచ్చరించుటయు, ఆఁగి ఆఁగి కష్టముమీఁద మాట లాడుటయు మొద లగులక్షణములు గలజిహ్వాదోషము)నత్తి కలవాఁడు, లోహలుఁడు'-అని(సూ.ని.). 'లోహల స్స్యా దస్ఫుటవాక్' అని(అమ.).(శ.ర.) 'నత్తివాఁడు-నత్తి గలవాఁడు,ఆక్షేపకుఁడు-అని,లోహలుఁడు-స్ఫుటము గానిమాటలు కలవాఁడు' అని ఈరెండు శబ్దములు వేఱు వే అర్థములు గల వనునట్లు వచించు చున్నది. అప్పుడు నత్తివాఁడు అనుదానికి లోహలుఁడు,ఆక్షేపకుఁడు-అనురెం డర్థములును గల వనవలసివచ్చు చున్నది.

అజ్ఞుఁడు:—'జడో ఽజ్ఞః' అని (అమ.). ఇచ్చటి'జడ'శబ్దము వ్యాఖ్యాతలచే ఇట్లు నిర్వచింపఁబడినది-'ఇష్టం వా ఽనిష్టం వా।సుఖ మితర ద్వా న వేత్తి యో మోహాత్। తూష్ణీకః పరవశగ। స్స భవతి జడసంజ్ఞకః పురుషః'అని 'ఇష్టానిష్టసుఖదుఃఖములను ఎఱుఁగక పరవశుఁడై ఊర కుండువాఁడు'-అని ఇచ్చటిదీనివివరణము. (చూ.గురు.).బ్రౌ. దమ్మ్కుఁడు-అనుదానికి 'ఎడ్డె'అనెడి'అర్థ'మిచ్చినది (చూ.అమ.). కాని-ఇదివఱకే 'మూర్ఖ' పర్యాయములు వేఱు గా (ఆం.భా.) అమ.తోపాటు వచించినది (చూ.3.7.).కావున,వే అర్థము అమరముతోపాటు దీనికి వచించుటయే సముచితము.

['దమ్మ్కఁ డంభ స్తనంగ' అని (వావి.అపముద్రి.) 'అంబస్తు-' ఇది గ్రహింపఁబడలేదు (శ.ర.సూ.ని. మొ.వానిచేత.) ]

దిసమొల: —(దిసమొల-అ.)'ఉత్వ మిత్త్వం తథై వాత్త్వం సమాసే మతుబర్థకమ్'అని (అథర్వణుఁడు.).

బహిష్కృతుఁడు:—'నిష్కాసితో ఽవకృష్ట స్స్యాత్' అని ఈసందర్భమున (అమ.).

రవణుఁడు:—'రవణ శ్శబ్దనః' అని (అమ.). "క్రోయుస్వభావము గలవానిపేళ్లు" అని (గురు.). 'శబ్దకరణశీలస్య' అని (సుధ.).

సీ. కొండెకాఁ,డనఁగను గొండెగీఁ,డనఁగను
గొండియుఁ,డనఁ బిశునుండు వెలయుఁ;
చిట్లుకట్టె,యనంగఁ జెలఁగును శఠుఁడు; సం
కరుఁడు రాజిలును బల్గాకి,యనఁగ;
కొద్దికాఁ,డనఁగను క్షుద్రుండు తగు; ఖలుం
డొప్పు వాట్లీఁ,డన నులిపికట్టె,
యనఁగను బాట్లని,యనఁ జెట్లకొఱవి, నాఁ;
దగు ననర్హాభిధ తగనివాఁ,డ

గీ. నంగ;స్త్రీభాషి దోఁచు నాఁడంగి,యనఁగ;
నాగడీఁ, డనఁ బరిహాసకాఖ్య చెల్లు;
నలరు నొప్పనివాఁడు,నా నప్రకాశ్యుఁ;
డొప్పు మిడిమేల,యన దుస్సహుఁడు;మహేశ! 13

కొండెకాఁడు,కొండెగీఁడు,కొండియుఁడు—ఇవి పిశునునకు(కర్ణేజపునకు;సూచకునకు; ఇతరులపై లేనిపోనిదోషములు (చాడీలు) చెప్పెడివానికి) పేర్లు.

చిట్లుకట్టె—ఇది శఠునకు (అనృజువునకు; రహస్యముగా (తెలియకుండ ద్రోహము చేయువానికి) పేరు.

పల్గాకి—ఇది సంకరునకు (సంకరజాతివానికి; పలుగాకికి) పేరు.

కొద్దికాఁడు—ఇది క్షుద్రునకు (అల్పునికి; తక్కువవానికి) పేరు.

వాట్లీఁడు,ఉలిపికట్టె,పాట్లని, చెట్లకొఱవి—ఇవి ఖలునకు (చెడ్డవానికి;ఇతరులకు బాధ కలిగించువానికి) పేర్లు.

తగనివాఁడు—ఇది అనర్హునకు (అయోగ్యునకు) పేరు.

ఆఁడంగి—ఇది స్త్రీభాషికి (ఆఁడుదానివలె మాట లాడుపురుషునకు) పేరు.

.అగడీఁడు—ఇది పరిహాసకునకు (గేలి సేయువానికి; పరియాచకము చేయువానికి; వెక్కిరించువానికి) పేరు.

ఒప్పనివాఁడు—ఇది అప్రకాశ్యునకు (మఱుఁగుపడి ఉండువానికి; చెడ్డనడవడికచే నలుగురిలో సంచరింప వీలు కానివానికి) పేరు.

మిడిమేలము—ఇది దుస్సహునకు (ఓర్చుకొన వీలు గానివానికి; మిక్కిలి సంతాపము గలిగించు తీక్ష్ణప్రవర్తనము కలవానికి) పేరు.

కొండెకాఁడు .— ఇట - 'కర్ణేజప స్సూచక స్స్యాత్ పిశునః'అని (గురు సా.). 'పిశునో దుర్జనః ఖలః' అని (సుధాపా.) ఈసుధాపారమునందును పిశునశబ్దమునకు అర్థాంతరము గా'సూచకుఁడు' అనెడియర్థము నిఘంటుప్రసిద్ధము 'పిశునం కుఙ్కుమేపి చ । కపివక్త్రే చ కాకే నా సూచకక్రూరయో స్త్రిషు'అని (విశ్వమేదినులు) (చూ.సుధ.'పిశున'శబ్దము).

శఠుఁడు :— 'గూఢవిప్రియకృ చ్ఛఠః'అని ఆలంకారికులు. 'నికృత స్త్వనృజు శ్శఠః' అని (అమ.).

చిట్టుకట్టె :— చిటచిట రవలు లేచుకట్టెవంటివాఁడు; అనుకొన కుండ(అకస్మికము గా)బాధ కలిగించువాఁడు - అని అర్థము.

పోట్లీఁడు :— దెబ్బలాడువాఁడు, కొట్లాడువాఁడు-అని (సూ.ని.శ.ర.లు).

ఉలిపికట్టె :— 'ఊరందఱిది యొకదారి ఉలిపికట్టె దొకదారి'అని లోకోక్తి.

'చెట్లకొఱవి :— చెట్లకొఱివి (ఖలుఁడు)అని (బ్రౌ.). చిట్లుకొఱవి-చిటపట లాడెడుకొఱవి, తాపకారి. బాధకుఁడు - అని(సూ.ని.). (శ.ర.) దీనిని గ్రహింప లేదు. (చూ.వివరణమునకై 'తొలిపలుకు').

ఆఁడంగి :— ఆఁడుదానిస్వభావము గలపురుషుఁడు - అని(శ.ర.). ఆణంగి - అంతా ఆడుదానిరీతి గా ఉండేమొగ్గమువాఁడు - అని (బ్రౌ.) (చూ.అను.).

అగడీఁడు :— 'అకార్యము చేయువాఁడు'అని (శ.ర.మొ.) 'అగడీ లెగఁద్రోయ నగ్రజులను హాస్యభావంబు నెఱపి దుర్భాష లాడు' (భల్లా.శిల.) (చూ.శ.ర.)

సీ. వశ్యక్రియావేది వఱలు మందులమారి,
　　యన; వేఁడువాఁ,డన యాచకుఁ డగు;
సగచాట్లమారి,నాఁ దగును గష్టాత్ముండు;
　　వెలయు దరిద్రుండు పేద,యన బి
కారి,యం చనఁ బరికట్టె,నా; నతిదరి
　　ద్రుఁడు నిఱుపేద,నా నడరు చుండు;
రవణము,చొక్కము,రకము,చొకాటము,
　　రాణ,చొక్కాటము,నాణెము,చొక,

గీ. గొనబు,తియ్యంబు,జాను,తిన్ననిది,బాగు,
చొక్కటం,బన వెలయు మంజులసమాఖ్య;
యలరు వలచినది,యనఁగఁ బ్రియంబు పేరు;
భూషితభుజంగ! శ్రీమాతృభూతలింగ!　　14

మందులమారి—ఇది వశ్యక్రియావేదికి (వశక్రియావేత్తకు; మణిమంత్రౌషధాదులచే వశము చేసికొనుట బాగుగా తెలిసికొనినవానికి) పేరు.

వేఁడువాఁడు—ఇది యాచకునకు (అర్థికి 'దేహి' అని ధనాదులను అడుగువానికి; యాచకునకు) పేరు.

అగచాట్లమారి—ఇది కష్టాత్మునకు (కష్టశీలునకు; ఆపదలు అనుభవించుటయే స్వభావము గా కలవానికి) పేరు.

పేద, బికారి, పరికట్టె—ఇవి దరిద్రునకు (దుర్గతునకు; నిస్స్వనకు; దీనునకు; బీద వానికి) పేర్లు

నిఱుపేద—ఇది అతిదరిద్రునకు (అకించనునకు; మిక్కిలి బీదవానికి) పేరు.

రవణము, చొక్కము, రకము, చొకాటము, రాణ, చొక్కాటము, నాణెము, చొక, గొనబు, తియ్యము, జాను, తిన్ననిది, బాగు, చొక్కటము—ఇవి మంజులమునకు (మనోహరమునకు; సుందరమునకు; చక్కనిదానికి; అంద మైనదానికి) పేర్లు.

వలచినది—ఇది ప్రియమునకు (పొంద ఇష్టపడినదానికి; మనస్సునకు ఇష్ట మైన దానికి) పేరు.

వశ్యక్రియావేది :— 'వశక్రియా సంవననమ్'అని(అమ.). దీనినే— (ఆం.భా.) 'వశ్యక్రియ' అని నది. వశ్యునిఁ గా(అధీనునిఁ గా: తనకు లోఁబడినవానిఁ గా) ఒనర్చుకొనుపని, 'వశీకరణ' మనుట. ఇదియే వశక్రియ. వ్యుత్పత్తిభేదమేకాని - రెండు ఒకేయర్థము కలవియే!

మందులమారి :— మర్లుమందు పెట్టువాఁడు-అని (శ.ర.).

అగచాట్లమారి :— 'ఆపన్న ఆపత్ప్రాప్త స్స్యాత్'అని. ఈసందర్భమున (అమ.).

'కష్టాత్ముఁడు :— ఇచటి 'ఆత్మన్' శబ్దము స్వభావార్థకము. 'ఆత్మా కలేవరే యత్నే స్వభావే పరమాత్మని। చిత్తే ధృతౌ చ బుద్ధౌ చ పరవ్యావర్తనే ఒపి చ'అని (ధరణి) (చూ.ఆత్మన్ శబ్దము. సుధ). దుఃఖశీలుఁడు - అని అర్థము.

పరికట్టె :— దీనిని సూ.ని.శ.ర.లు) గ్రహింప లేదు. (బ్రౌ.) గ్రహించినది (చూ.అను.).

రవణము :— 'రమణ' కు (రూపాం.) అని (శ.ర.)- 'అమరపతిఖాండవమునకు। రమణను వైశ్రవణునిచైత్రరథమునకు సమా। నము గా దీనిని భూభా। గమునకు రచియించెనొక్కొ- కమలజుఁడు దయన్' (భార.ఆది.4ఆ.) (చూ.శ.ర.).

సీ. మక్కు, మాసినది, నా మలినంబు విలసిల్లు;
సుద్ద, మం చనఁగను శుద్ధమొప్పు;
నిచ్చలం, బనఁగను నిర్మలం బై తోఁచు;
రుత్త, లొటారంబు, రిత్త బీడు,
సొళ్లు, నా రిక్తాఖ్య శోభిల్లుఁ; గన్నాకు,
మేల్బంతి, నికరము, మేటి, మేలు,
తర, మాణి, యం చనఁ దనరు శ్రేష్ఠము; సింగ,
మనఁ బందమామ, యం చనఁగ మిన

గీ. యనఁగ బెబ్బులి, యన మదహత్తి, యనఁగఁ
బైకడను నిల్చి శ్రేష్ఠ మై పరఁగు చుండు;
హసదు, నాఁగను దొడ్డవాఁ, డనుట కొప్పు;
భూషితభుజంగ! శ్రీమాతృభూతలింగ! 15

మక్కు, మాసినది—ఇది మలినమునకు (మలదూషితమునకు; మలీమసమునకు; మాసినదానికి; ముఱికితో కూడినదానికి) పేరు.

సుద్దము—ఇది శుద్ధమునకు (నిర్దోషమునకు; జలాదులచే కడుగఁబడి స్వచ్ఛ మైన దానికి; శోధితమునకు) పేరు.

నిచ్చలము—ఇది నిర్మలమునకు (స్వభావముచే శుద్ధ మైనదానికి; స్ఫటికము మొద లగుదానికి) పేరు.

రుత్త, లొటారము, రిత్త, బీడు, చొళ్లు—ఇవి శూన్యమునకు (ఉత్తదానికి; వట్టి దానికి; ఏమియు లేనిగృహము మొద లగుదానికి) పేర్లు.

కన్నాకు, మేల్బంతి, నికరము, మేటి, మేలు, తరము, ఆణి—ఇవి శ్రేష్ఠమునకు (మిక్కిలి ప్రశస్త మైనదానికి) పేర్లు.

సింగము, చందమామ, మిన్న, బెబ్బులి, మదహత్తి— ఇవి (ఉత్తరపదము లై) పూర్వపదార్థముయొక్క శ్రేష్ఠతకు రాచసింగము-ఇత్యాదులలో రాజాదులయొక్క ప్రాశస్త్యమునకు (గొప్పతనమునకు) వాచకములు.

హసదు—ఇది దొడ్డవానికి (సమధికునకు; అత్యధికునకు; చాలగొప్పవానికి) పేరు.

మలినము :— 'మలీమసం తు మలినం కచ్చరం మలదూషితమ్' (అమ.).

సొళ్లు :— 'రుత్త ... సొళ్లు'అని (సూ.ని.) (చూ.బీడు.). ఇట్లు పార మిచ్చియు పదము గ్రహింప లేదు. (సూ.ని.). శ.ర.బ్రౌ. గూడ ఈపదమును ఈయర్థమున గ్రహింప లేదు. ఒకనిఘంటుకర్త - 'సోళు' అనియే ఇచ్చటిపార మని ఈపదమును ఈయర్థమున గ్రహించి నాఁడు. ఇది 'చొల్లు' అయి (రూపాం.) 'చొళ్లు' అయి ఉండు ననిపించినని. 'చొల్లుమాటలు' మొద లగువానికి 'రిత్తమాటలు' - 'ప్రయోజనము లేనిమాటలు' అని నిఘంటువులు అర్థమును ఒసఁగు చున్నవి.

నికరము :— నిగరము - (రూపాం.). 'పగడపుఁ గ్రొత్తడంబుజిగి పాకవిరోధిశరాసనంబు గా। నిగరపుఁగెంపుఁగొమ్మనునునిగ్గుమెఱుంగు మెఱుంగుచాలు గాఁ దగు. ..' (చంద్రా. 1. 9.).

మదహత్తి :— (సం. మదహస్తి. ప్రా. మదహత్థి.). ('ప్రాణగొడ్డము' వంటి) వై.విణ. అని (శ.ర.).

పైకడను నిల్చి శ్రేష్ఠ మై పరఁగుచుండు :— 'స్యు రుత్తరపదే వ్యాఘ్ర పుఙ్గ వర్షభ కుఞ్జరాః ।
సింహ శార్దూల నా గాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః' అనినది (అమ.). అట్లే (ఆం. భా.)-

దొడ్డవాఁడు:—'అతిరిక్త స్సమధికః'అని (అమ.).

సీ. బహుత నన్యులఁ దెల్పుపట్ల హేమాహేము,
లనఁబల్కు- పూజ్యార్థ మగుచు నుండ,
నుపసర్జనాఖ్య యై యొప్పును సందడి
కాండ్రు, నాఁ జిల్లరవాండ్రు. నాగఁ;
బెద్ద, యచాటము, పెను, పేరు, బలు, దొడ్డు,
దొడ్డ, వలుఁద, నాఁగఁ దోఁచుఁ బృథువు;
నైకంబు, కొంచెము, సన్నంబు, తోడెము,
చిఱు, కిము, డసదు, లే, చిఱుత, లేఁత,

గీ. కొద్ది, యన్నువ, యనఁగను గొఱలు నల్ప;
మలరు సాంద్రంబు నెగ్గడ, మనఁగ దట్ట,
మనఁగఁ దంపర, యన; వర్తులాఖ్య చెల్లు
బటు, వనఁగ వట్రు, వనఁగను; బార్వతీశ ! 16

హేమాహేములు—ఇది బహుత్వముతో (బహుత్వవివక్షతో బహువచనాంత మై అనుట) ఇతరులను దెలియఁజేసెడియప్పుడు పూజ్యులకు (పూజనీయులకు; ఎక్కువ గా గౌరవింపఁ దగినవారికి; మిక్కిలిఅధికు లగువారికి) పేరు.

సందడికాండ్రు, చిల్లరవాండ్రు—ఇవి ఉపసర్జనులకు (ముఖ్యులు కానివారికి; అప్రధానులకు) పేర్లు.

పెద్ద, అచాటము, పెను, పేరు, బలు, దొడ్డు, దొడ్డ, వలుఁద—ఇవి పృథువునకు (విస్తీర్ణమునకు; విరివి యైనదానికి) పేర్లు.

నైకము, కొంచెము, సన్నము, తోడెము, చిఱు, కిముడు, అసదు, లే, చిఱుత, లేఁత, కొద్ది, అన్నువ—ఇవి అల్పమునకు (సూక్ష్మమునకు; స్వల్పమునకు) పేర్లు.

నెగడము, దట్టము, తంపర—ఇవి సాంద్రమునకు (నిబిడమునకు; తఱచైనదానికి) పేర్లు.

బటువు, వట్రువ—ఇది వర్తులమునకు (వృత్తమునకు; గుండ్రనిదానికి) పేర్లు.

హేమాహేములు :—'హేమాహేమీలు' దే. విణ, (బ.) అధికులు అని (శ.ర.). (రూపాం.) అని (సూ.ని.)

ఉపసర్జనుఁడు :— 'అప్రాగ్యం ద్వయహీనే ద్వే అప్రధానోపసర్జనే' (అమ.).

పెద్దయచాటము :— 'పెద్ద యేచా టుబ్బ'- (వావి. అపపా.) శుద్ధాంధ్రపదపారిజాతము ఈ యర్థమున- 'అచాటము' అనుపదమును ఉదాహరించు చున్నది. దానినిఁబట్టి పరిశీలించి చూచిన 'పెద్ద యచాటము' అని ఇచ్చటిపాఠ మగు ననిపించును. కాని, బ్రౌ. 'అచ్చాళి' 'అచ్చాళు' పదములు గ్రహించి, ఒంటరిగా, ఏకాంతముగా-అనురీతిని అర్థ మను చున్నది ప్రయోగముతోఁ గూడ. (సూ.ని.) వీనికి (క. అచ్చాళు-దృఢుఁడు) అనునది మూల మగుటను ప్రదర్శించినది. ఈ కన్నడపదమునుండి యేర్పడిన 'అచాళి' వంటిదే. 'అచాటు' గూడ కావచ్చును. అప్పుడు 'పెద్ద యచా టుబ్బ పెను పేరు బలు దొడ్డు .' అనునది ఇచ్చటి సాధుపాఠ మనవచ్చును. 'అచ్చాళి'కి (బ్రౌ, సూ. ని.) ప్రదర్శించినప్రయోగ మి ట్లున్నది- 'చారుశీలాముఖ్యజలజలోచ నలఁ। జేరి కౌబంధులఁ జెలుల నీక్షణమె। పగఱకుఁ జొర రాక బహుదుర్గమార్గ। మగు కోహళమహర్షియాశ్రమస్థలినిఁ। జేరిచి మనము నిశ్చింత నేతెంచి। యారూఢబలయుక్తి నచ్చాళి గాఁగ। ననికి సన్నద్ధుల మై యుంద మవల' (పతివ్రతామాహాత్మ్యము). ఇచట అచ్చాళి - జంజాటము లేనివాఁడు, సంసారపు పీఁకులాట లేనివాఁడు - అని అర్థ మనుచున్నవి (బ్రౌ. సూ. ని.). 'నిశ్చింతన్' అనుదానిచే ఇది గతార్థముకావున, బలయుక్తిన్ 'అచ్చాళు'గాఁగ పెద్దగాఁగ (శత్రువుల నడంచుటకు) చాలినంత గాఁగా; అధికము గాఁగా. అనికి సన్నద్ధుల మై యుందము-అని సమన్వయ మనవచ్చును. అప్పుడు 'అచ్చాళి' కైన (రూపాం.) 'అచ్చాళు' 'అచ్చాటు' అగుట స్పష్టము.

లేః— 'లీలఁ బయ్యెదకొంగు లే జాఱ వైచి' (ద్వి. పరమ. 4.274.) (చూ. సూ. ని.).

పృథు: — 'విశఙ్కటం పృథు బృహ ద్విశాలం పృథులం మహత్। రున్ద్రోరు విపులమ్' అని (అమ.). 'విస్తీర్ణస్య' అని (సుధ.).

కొద్ది:— దీనికి 'న్యూనత' అను అర్థ మిచ్చు చున్నది (సాంబ.) 'లొచ్చు కొద కడమ । కుఱుచ యొచ్చెము తగ్గు కొంచెము తక్కువ కుందు కొదవ లోను కొద్ది యనఁగ । మెఱయు న్యూనత పేళ్లు' (మాన. 40.). 'కొద్దిగా ముత్తెంపుగొనబు వజ్రాల । మద్దికాయలడాలు మలయఁ జెక్కళ్లు' (రంగ. రా. బాల. కాం. 20 పొ. 30 పం.). 'ముద్దియమోహ మెంతటిదొ... నిద్ర యొల్ల దీ । కొద్దికిఁ బచ్చవిల్తునిలకోరుల నే మగుచున్నదోకదా ।, (శశాం. 4,106.)' మొ. (కొలఁదికి (రూపాం.) కొద్ది.) '.. గంగాస్నానంబునఁ దొలఁ । గం గలపాతకము చతుర్దశ భువనం । బులుఁ గూడి చేయఁ జాలవు । కొలఁదియె గంగాతిశయము గుణరత్ననిధీ ।' (జాహ్నవీ. 3.72,). 'కొద్ది' కి 'న్యూనత' అనునది (అర్థాం.) అనఁ దగినది.

ఈసందర్భమున (సాంబ.) ఇట్లు వచించుచున్నది.-'సైకము తోడెము సన్న మన్నువ జిల్గు, వలిపెము చిఱు లేఁత కొలఁది యలఁతి । యనదు లే జీ బన నమరు స్వల్పమునకుఁ, బెను గొప్ప బలు పేరు పెద్ద దొడ్డ । గన మన నధికాఖ్య లొనరు దోరము హొమ్మ । గ్రమక మొ మ్మనఁగ స్థూలము చెలంగు.. .' (మాన. 71.).

క. పలపల, యన వెలితి, యనం
బలుచన, యన విరలసంజ్ఞ భాసిల్లును; ని
స్తులతరగుణోత్తరంగా ।
విలసత్కారుణాంతరంగ ! వృషభతురంగా ! 17

పలపల, వెలితి, పలుచన—ఇవి విరలమునకు (పేలవమునకు; దట్టము కానిదానికి; పలుచగా ఉండుదానికి) పేర్లు.

వెలితి:—'వెలితి గానఁగ రానివిమలపూరములఁ । బొలుచుపీచుల రాలుపుప్పొళ్ల జడియు' (రం. రా.116 పొ. 21 పం.).

విరలము:—'పేలవం విరలం తను' అని (అమ.). ఇట (గురు.) 'పలుచనిదానిపేళ్లు' అని వ్యాఖ్యానించినది. 'విరలం తను విశ్లిష్ట మఘనం తలినం (తథా)' అని (వైజ. సామా. అర్థ.).

క. వెడఁద,యన విశాల మగున్;
నిడుద,యనన్ వాసి,యనఁగ నెగడును దీర్ఘం;
బడరును సమున్నతాభిధ
పొడవం చని పల్క; మాతృభూతమహేశా ! 18

వెడఁద— ఇది విశాలమునకు (విరివి యైనదానికి) పేరు.

నిడుద,వాసి— ఇవి దీర్ఘమునకు (నిడుపైనదానికి; ఆయతమునకు (అడ్డపుఁబొడవు) కలదానికి) పేర్లు.

పొడవు— ఇది సమున్నతమునకు (ఉన్నతమునకు; ప్రాంశువునకు; ఎత్తైనదానికి) పేరు.

దీర్ఘము:—'దీర్ఘ మాయతమ్' (అమ.).

సమున్నతము:—'ఉచ్చ ప్రాం శూన్న తోద గ్రోచ్ఛ్రితా స్తుఙ్గే' (అమ.).

పొడవు:—ఇదివఱకు వనౌషధివర్గమునందు 'పొడవు పొడ గన నుచ్ఛ్రాయ మౌ'అని ఉదాహరింపఁ బడినది. అచ్చటి 'పొడవు' నకు 'వృక్షాదులదైర్ఘ్య'మర్థము. 'నగాద్యారోహ ఉచ్ఛ్రాయః' అని (అమ.వనౌ.). అన్మధ్యము గానే ఆం.భా. గ్రహించు చున్నది వీనిని. వివరణమునకై (చూ. 2.36.).

గీ. ఒప్పును సదాటు,నాఁగ వక్రోన్నతంబు;
వంక,రన సొట్ట,యనఁగను వక్ర మెసఁగుఁ;
ఋజువు ఋజునామధేయంబు చక్కని,దన;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 19

సదాటు—ఇది వక్రోన్నతమునకు (వంకర కలిగి ఋజువు గా ఉండక ఎత్తైనదానికి) పేరు.

వంకర, సొట్ట—ఇవి వక్రమునకు (నతమునకు; తిన్నఁగా- అంతయు ఒకేతీరు గా (ఋజువు గా) ఉండనిదానికి) పేర్లు.

చక్కనిది—ఇది ఋజువునకు (సరి గా- సమానము గా- అంతయు ఒకేతీరుది గా- తిన్ననిది గా ఉండుదానికి) పేరు.

సదాటు:— 'కృశోన్నతము'-అర్థ మను చున్నవి (బ్రౌ. శుద్ధాంధ్రపదపారిజాతములు.). దీనినిఁబట్టి '....సదాటు నాఁగఁ గృశోన్నతంబు' అని యిట (బ్రౌ.పా.) అనిపి[illegible] [illegible] ప్రయోగ మొకటి ఇ ట్లున్నది.-'గాటంపువీఁక సదా టైనమేనుల నెలవు[illegible]

మీఱు' (2.17.).(చూ.శ.ర.) ఇట శ.ర,'సదాటు-విణ. దృఢము -అనుచున్నది. (బ్రౌ.) దీనికి వచించిన-అర్థము ఇట సుసంగతమే అనిపించు చున్నది. '. . మేదశ్ఛేదకృశోదరం లఘు భవ త్యుత్థాన యోగ్యం వపుః' (అభి.శా. 2.5.) అని (కాళిదాసు.). వ్యాయామమువలన కృశోదర త్వము గలుగుట దీనివలన తెలియఁబడు చున్నది.

వంకర:—'అరాలం వృజినం జిహ్మ మూర్మిమ త్కుఞ్చితం నతమ్। ఆవిద్ధం కుటిలం భుగ్నం వేల్లితం వక్ర మి త్యపి' (అమ.).

సొట్ట :—ఇది పరుషాది (చొట్ట) అని, (శ.ర.) 'వ్యాధి మొద లగువానిచేత వంక రైనది' అని అర్థ మిచ్చినది. 'సొట్ట, వక్రత, నొక్కు' అని (బ్రౌ.). 'సొట్ట' అనియే (వ్యవ.).

ఋజావు:—'ఋజా వజిహ్మ ప్రగుణౌ' (అమ.).

గీ. ఒమ్మ, గాత్రమ్మ, గమకము, హొమ్మ, నాఁగ
స్థూల మగుఁ; పెక్కు, నాఁగను దోఁచు బహుల;
మగును గణనీయ మౌ నెంచఁ దగినది, యన;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 20

ఒమ్మ, గాత్రము, గమకము, హొమ్మ—ఇవి స్థూలమునకు (బలిసినదానికి; పెద్ద దానికి; లా వైనదానికి) పేళ్లు.

పెక్కు—ఇది బహుళమునకు (సంఖ్యాధిక్యము కలదానికి; అనేకమునకు) పేరు.

ఎంచఁదగినది—ఇది గణనీయమునకు (లెక్కింప నగుదానికి; ఎన్నిక చేయఁబడు దానికి; లెక్క పెట్టుటకు వీ లైనదానికి) పేరు.

గమకము:—దీనికి (బ్రౌ.) ఒక ప్రయోగమును ఇ ట్లిచ్చినది-'....ఉపకాంతుని వల్లవకాంత లేపునన్। గమకముఁజేసి గుబ్బకవఁ గౌఁగిటఁ దార్చి' (హంస. 2.128.) అని.

స్థూలము:— 'పీనపీవ్నీ తు స్థూలపీవరే' (అమ.).

బహులము:—'అదభ్రం బహులం బహు' అని, (అమ.) ఈ సందర్భమున- ప్రచురార్థకములఁ గా బహులాదులను ఉదాహరించినది.

గణనీయము:—'గణనీయే తు గాణేయమ్' అని (అమ.).

గీ. దండ, చేరువ, చెంగట, యండ, సరస,
ప్రాపు, చక్కి, కుఱంగట, పజ్జ, చెంత,
కెలను, దా, పంజ, దగ్గఱ, క్రేవ, పొంత,
యంచ, యొద్ద, నా నికటాఖ్య యగు; మహేశ! 21

దండ, చేరువ, చెంగట, అండ, సరస, ప్రాపు, చక్కి, కుఱంగట, పజ్జ, చెంత, కెలను, దాపు, అంజ, దగ్గఱ, క్రేవ, పొంత, అంచ, ఒద్ద—ఇవి నికటమునకు (సమీపమునకు; అభ్యాశమునకు; సమీపప్రదేశమునకు) పేర్లు.

కుఱంగట:—కుఱఁగలి కైన (పౌప.) ఇది. (సూ.ని.శ.ర.లు). 'కుఱఁగలి' (బౌ.) గ్రహించినవి. (బౌ.). 'కురంగట-కురగట' అనువానినే ప్రదర్శించినది. (ఈ.ప.పా.) 'కుఱఁగట, కుఱఁగలి' అనురెంటినిగ్రహించినది. కుఱఁగలిశబ్దము సమీపార్థక మున్న దని (సాంబ.) ఇట్ల ను చున్నది- '... దండయొద్ద। చెంత కుఱఁగలి డగ్గఱ చేర్వ పొంత దాపు ..' (మాన. 39.). (....అ। క్కుఱఁగట శోకజాశ్రువులుఁ గో యనునేడ్పులు నుప్పతిల్లఁగన్' (జై. భా. 1. 5. 7,) (మొ.) (చూ.సూ.ని.).

ఒద్ద:—'వద్ద'అనియు (సాంబ.) కల దను చున్నది-' సరస కెలను పజ్జ ప్రాపు వద్ద। యండ చక్కి గరికి యన। నమరెనేని సమీపనామములు'- (సాంబ. మాన. 39.). దీనికి (శ.ర.) ద్విపదరామాయణప్రయోగము నిచ్చి 'ఇది యితరపురాతనగ్రంథములందు మృగ్యము' అనినది. (సూ.ని.) (నిర్ధారక) ప్రయోగముఁ గొన్నిటిని ఇట్లు చూపు చున్నది- 'అంత దూషణుఁడు మత్తారిభీషణుండు। వంత నొందుచుఁ దనవద్దియోధులను' (రం. రా. అర. 164పొ. 10 పం.). 'గద్దియ వడి డిగ్గుచుఁ దన। వద్ద సభాసదులు లేచి వారనిభక్తిన్....' (ఉ. హరిశ్చ. 2.8.). వేంకనార్యుఁడుగూడ తన (మల్లుపు)లో 'ఆగతి వజ్రదంతుఁ దెగటార్చినదైవత మల్లు 'వద్దకున్' (3.50.), ఇచ్చట 'మల్లునొద్దకున్' అనినను సరిపడును. 'వానివద్ద' 'వీని వద్ద' అని (వ్య.).

గీ. ఏడుగడ,నా నియంతసం: జ్జెల్ల,యనఁగఁ
దనరు చుండును సర్వాఖ్య; దవ్వు,నాఁగ
దూరనామంబు గాఁగనుఁ దోఁచు చుండు;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 22

ఏడుగడ—ఇది నియంతకు (రక్షితకు; శరణమునకు; రక్షకునకు; కాపాడువానికి) పేరు.

ఎల్ల—ఇది సర్వమునకు (అంతకు; నిఖిలమునకు; సమస్తమునకు) పేరు.

దవ్వు—ఇది దూరమునకు (విప్రకృష్టమునకు; దూర మైనదానికి) పేరు.

ఏడుగడ:—ఏడువిధములు గల రక్షకము-'గురుఁడును దల్లియుఁ దండ్రియుఁ। బురుషుఁడు విద్యయును దైవమును దాతయు నాఁ। బొరి నేడుగడయుఁ దానై। హరి నను రక్షించుఁగాత మనవరతంబున్' (వాసి, 1ఆ.) (చూ.శ.ర.). బ్రౌ. 'ఏడువు+కడ' అనువ్యుత్పత్తి చూపుచున్నది. ఏడ్గడ- (రూపాం.). 'దహనుఁ డేడ్గడయు నుత్తమవర్ణభవులకుఁ, బావకుం డీశుండు బ్రాహ్మణులకు' (కాశీ. 3.205).

సంజ్ఞల్ల.—'శ్రీరంగభర్తంచు' 'గం గనుకాసె'లో నగువానివంటి దిది. 'క్వచిత్ సంస్కృతీయో ఽపి ప్రాణో ఽన్యత్ర చ్యుతో భవేత్' అని (అథర్వణుఁడు).

ఎల్ల:—ఎల్లశబ్దప్రయోగవ్యవస్థనుగూర్చి (బాల.వ్యా.) ఇట్లను చున్నది. 'సర్వపర్యాయం బయిన యెల్ల శబ్దంబు ద్రుతాంతం బయినయవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు' (చూ. సంధి. 24 సూ.).

గీ. గట్టి, కటికి, యనంగఁ గన్పట్టు దృఢము;
క్రొత్త, మిహి, హౌస, యనఁగ మీఱును నవంబు;
ప్రాఁత, యనఁగఁ బురాణాఖ్య పరఁగు చుండు;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 2౹

గట్టి, కటికి—ఇవి దృఢమునకు (కర్కశమునకు; కఠిన మైనదానికి) పేర్లు.

క్రొత్త, మిహి, హౌస—ఇవి నవమునకు (నవీనమునకు; నూత్నమునకు; నూతనమునకు; అభినవమునకు; అప్పటి కప్పుడు ఏర్పడినదానికి) పేర్లు.

ప్రాఁత—ఇది పురాణమునకు (పురాతనమునకు; చిరంతనమునకు; చాలకాలమునాఁటి దానికి) పేర్లు.

హౌస:—'హౌస' ఇచ్చటిపాఠ మని ఒకనిఘంటుకారుఁడు వ్రాయుచున్నాఁడు. 'హౌస-మనోజము' అని (సూ.ని.) 'హౌసతమ్మినూల్వంటి యసదు లేఁగౌనుపై, నోర గాఁగఁ బరుండి

యొరఁగఁ గొంకి' అని (ప్రబం. 750.) (చూ.సూ.ని.). ఇచట-'హొసతమ్మి'-'క్రొందమ్మి'
అనుటయే సముచితము. (శ్రౌ.శ.ర.లు) దీనిని గ్రహింప లేదు.

సీ. మను మెత్తనిది, గోము, మవ్వ, మనంగను
మృదుసంజ్ఞ; ప్రథమ మౌ మొదటిది, యనఁ;
గడపటిది, యనంగ నడరు జఘన్యంబు;
తెల్ల, మనంగ రాజిల్లు స్ఫుటము;
పరఁగు పీసరము, లేబర, మన వ్యర్థంబు;
నెచ్చు, పెల్లదనము, హెచ్చు, మిగత,
మిక్కిలి, యెక్కువ మెం, డగ్గలము, పె, చ్చె
దుగు, నాఁగ నధికంబు దోఁచు చుండుఁ;

దక్కువ, కొఱంత, పొచ్చెము, తగ్గు, కుందు,
కొదవ, లొచ్చు, కొదుక, యనఁ బొదలు న్యూన;
మడరుఁ దక్కటి, యెడ, కడ, కడమ, తక్కు,
వేఱు, పెఱ, యన నితరాఖ్య; మారవైరి ! 24

మెత్తనిది, గోము, మవ్వము—ఇవి మృదువునకు (కోమలమునకు; మృదులము నకు; మార్దవము (మెత్తఁదనము-కలిగినదానికి) పేర్లు.

మొదటిది—ఇది ప్రథమమునకు (ఆదికి; ఆద్యమునకు; మొదట ఉండెడివానికి) పేరు.

కడపటిది—ఇది జఘన్యమునకు (అంతమునకు; చరమమునకు; అంత్యమునకు; చివర ఉండెడుదానికి) పేరు.

తెల్లము—ఇది స్ఫుటమునకు (తెల్లమికి; తేటతెల్లకు; స్పష్ట మైనదానికి) పేరు.

పీసరము, లేబరము—ఇవి వ్యర్థమునకు (నిరర్థకమునకు; ప్రయోజనము లేనివానికి) పేర్లు.

ఎచ్చు, పెల్లు, అదనము, హెచ్చు, మిగత, మిక్కిలి, ఎక్కువ, మెండు, అగ్గలము, పెచ్చు, ఎదుగు—ఇవి అధికమునకు (అతిశయితమునకు, మిక్కుటమునకు; ఆధిక్యము కలదానికి) పేర్లు.

**తక్కువ, కొఱఁత, పొచ్చెము, తగ్గు, కుందు, కొదవ, లొచ్చు, కొదుక—ఇవి న్యూనమునకు (ఊనమునకు; హీనమునకు; కొఱఁతవడినదానికి; అసంపూర్ణమునకు) పేర్లు.**

**తక్కటి, ఎడ, కడ, కడమ, తక్కు, వేఱు, పెఱ—ఇవి ఇతరమునకు (లాతికి; అన్యమునకు; వేఱొకదానికి) పేర్లు.**

[మిగత:—ఇది లాభార్థకము గా పూర్వ ముదాహృతము (చూ.2.267.). 'మిగితి' (వావి.అప ము(ది.) ఇది (ప్రాఁత(ప.పా.) అని (సూ.ని.). 'మిగిలి'-తాళ(ప.పా. (చూ.సూ.ని.).]

[కొదవ:—కొదువ-(వావి,అపపా.). 'ఇదె నాదుముఖభంగ మీక్షింపు నాదు!కొదవ నీకొదవ గాఁ గోర్కి భావింపు' (రం,రా.అర. 169పొ.4పం.) (చూ.సూ.ని).]

న్యూనము:—'హీన న్యూనా వూన గర్హ్యౌ' (అమ.).

ఇతరాఖ్య:—(సాం.ని.) కొన్ని ఇతరాఖ్యల మహద్వివక్షతో ఇ ట్లుదాహరించినది - 'పెఱవారు కడవారు వింతవా రెడవారు, లాఁతివా రన నన్యులకుఁ జెలంగు' (మాన.10.).

సీ. ఒంటి,యనంగను నొప్పు నేకాకి యై;
సగటు, నాఁగను సరాసరి, యనంగ
సామాన్య మెసఁగు; నుచ్చావచంబులు దోఁచుఁ
బలువితంబు, లనఁగఁ; బలువగ, లన
బరిదెగినది, విడివడినది, యనఁగను
వెలయు చుండును విశృంఖలసమాఖ్య;
ప్రతికూలనామ మై పరఁగు నడ్డ, మనంగ;
వామంబు వెలయు డాపల, యనంగ;
వలపల, యనంగ దక్షిణం బలరు చుండు;
నిరుగడలు, సూరె, లిరుపక్కు, లిరుమెయి, లన
నుభయపార్శ్వాభిధానంబు లొనరు చుండు;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ ! 25

**ఒంటి—ఇది ఏకాకికి (ఒంటరికి; ఎక్కటికి; ఏకకమునకు; అసహాయమునకు; సజాతీయసాహాయ్యము గలుగనిదానికి) పేరు.**

సగటు, సరాసరి—ఇవి సామాన్యమునకు (సాధారణమునకు; మొత్తమునకు; సమానము గా పంచి చూడఁగా ఐన సమత్వమునకు) పేర్లు.

పలువితములు, పలువగలు—ఇవి ఉచ్చావచమునకు (అనేకవిధములు-బహుప్రకారములు-చాలభేదములు-కలదానికి) పేర్లు.

బరిదెగినది, విడివడినది—ఇవి విశృంఖలమునకు (హద్దు మీఱినదానికి) పేర్లు.

అడ్డము—ఇది ప్రతికూలమునకు (అనుకూల్యము వదలినదానికి; వాటము తప్పినదానికి; విరుద్ధవర్తనము కలగినదానికి) పేరు.

డాపల—ఇది ఎడమభాగమునకు (వామమునకు; సవ్యమునకు; ఎడమప్రక్కకు, ఎడమచేయి-మొద లగువానికి) పేరు.

వలపల—ఇది దక్షిణభాగమునకు (అపసవ్యమునకు; కుడిప్రక్కకు, కుడిచేయి మొద లగువానికి) పేరు.

ఇరుగడలు, సూరెలు, ఇరుప్రక్కలు, ఇరుమెయులు—ఇవి ఉభయపార్శ్వములకు (రెండుప్రక్కలకు; కుడియెడమప్రక్కలకు రెండిటి-) పేర్లు.

సగటు:—(గ్రా.) అని (శ.ర.). 'వాండ్లను సగటున తిట్టినాఁడు' అని (వ్య) అని (బ్రౌ.).

సామాన్యము:—'సాధారణం తు సామాన్యమ్' (అమ.). 'అనేకసంబన్ధిన ఏకస్య' అని (సుధ.).

ఉచ్చావచము:—'ఉచ్చావచం నైకభేదమ్' (అమ.).

బరిదెగినది.—పరిదెగినది - అని (బ్రౌ.). 'వాఁడు బరిదెగి సంచరించుచున్నాఁడు-అని (వ్యవ.) (చూ.సూ.ని.),

ఇరుగడలు:—'ద్విగో రమిశ్రితాయాం తు ప్రాయ ఏకత్వ మిష్యతే' అని అథర్వణుఁడు. 'ప్రాయోగ్రహణాత్ 'నల్దెసలు' ఇత్యాదౌ బహుత్వ మపి' - అని అహోబలపతి. (కావున) 'అచ్ఛికద్విగువునకును' బహువచనాంతత్వము క్వాచిత్కము గా దుష్టము కాదు; సాధువే!

సీ. ఇఱుకట, మనఁగను బరఁగు సంకటసంజ్ఞ;
గహనంబు జీబు, నాఁగను జెలంగుఁ;
జిన్నారిపొన్నారి, చిన్నారిపొన్నారి,
యనఁగను ముద్దుగుల్కునది తోఁచు;

నకృతలక్ష్యాభిధ యలరును జీరికిఁ
గొననిది, సడ్డ సేయనిది, యనఁగఁ;
జలపాది, యనఁగను సంకల్పసాధి యౌఁ;
బొలుచును మల, తన మురిగొనునది;
యగును బిరుదాఢ్యుఁ డన బిరుదాయ, త్తనఁగఁ;
గ్రక్కసం బగు బిరుదులు గలుగు నాతఁ
డుల్లఅపుబిరు, దై విరాజిల్లు చుండు;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 26

ఇఱుకటము—ఇది సంకటమునకు (సంబాధమునకు; ఇఱుకైనచోటికి) పేరు.

జీబు—ఇది గహనమునకు (దుష్ప్రవేశమునకు; చొర రానిదానికి; దురవగాహమునకు) పేరు.

చిన్నరిపొన్నరి, చిన్నారిపొన్నారి—ఇవి ముద్దులు గుల్కుదానికి (ముద్దు లొలుకుదానికి; అంద మైనదానికి) పేర్లు.

చీరికిఁ గొననిది, సడ్డ సేయనిది—ఇవి అకృతలక్ష్యమునకు (లక్ష్యము చేయనిదానికి; కొంచె మైనను లెక్క చేయనిదానికి; సరకుగొననిదానికి) పేర్లు.

చలపాది—ఇది సంకల్పసాధికి (పట్టినపట్టు నెఱవేర్చువానికి; అనుకొనినపని అనుకొనినట్లు చేసి తీరెడివానికి) పేరు.

మలత—ఇది మురిగొనినదానికి (గర్వించినదానికి; గరువము చూపుదానికి) పేరు.

బిరుదాయత్తు—ఇది బిరుదాఢ్యునకు (బిరుదము గలవానికి) పేరు.

ఉల్లఅపుబిరుదు—ఇది క్రక్కసము లగుబిరుదులు గలుగునాతనికి(భయంకరము లగు బిరుదులు గలవానికి; ఘనబిరుదాఢ్యునకు) పేరు.

ఇఱుకటము:—ఇఱుకాటము (రూపాం.) అని (శ.ర.). ఇఅకటము-అనియు (బ్రౌ.). 'ఆలి మర్కటము ఇల్లు ఇఱుకాటము' అని లోకోక్తి.

సంకటము:—'సంకటం నా తు సంబాధః' (అమ.).

గహనము:—'కలిలం గహనం సమే' (అమ.).

మలత:—'మలంత'- అనియు (బ్రౌ.). (శ.ర.) దీనిని గ్రహింప లేదు.

బిరుదాయత్తు:—'బిరుదాడి'అని (వావి.అపపా.). బిరుదాధ్యుష్కైన పైకృ. ఇది పైనాపాఠము ప్రాఁతవ్రాఁతపా. (చూ.సూ.వి.).

[బిరు దై:—బిరు దైనరాజిల్లు- (వావి.అపపా.).]

సీ. అప్రయోజకసంజ్ఞ యలరు చుండును గొఱ
గానివాఁ, డనఁగఁ గిగ్గాడి, యనఁగ;
బారెఁడు, మూరెఁడు, పట్టెఁడు, జేనెఁడు,
దుత్తెఁడు, పుడిసెఁడు, బెత్తెఁ, డనెడి
యివి మొద ల్గాఁ గల వెల్లను వ్యామాది
పరిమితార్థములు గాఁ బరఁగు చుండు;
రూకంత, కాసంత, వీకంత, యీఁగంత,
యిసుమంత, దోమంత, యేనుఁగంత,
యనెడి శబ్దంబు లీరీతి నలరుపదము
లన్నియుఁ బదాదిమాత్రంబు లగుచు నుండు;
నవ్యయీభావ మని కొంద ఱంద్రు వీనిఁ;
బుంగవతురంగ! శ్రీమాతృభూతలింగ! 27

కొఱగానివాఁడు, కిగ్గాడి—ఇవి అప్రయోజకునకు (పనికిమాలినవానికి; కార్యనిర్వాహకుఁడు కానివానికి; ఏకార్యము చక్కఁబెట్ట లేనివానికి) పేర్లు.

బారెఁడు, మూరెఁడు, పట్టెఁడు, జేనెఁడు, పుడిసెఁడు, బెత్తెఁడు—ఇవి వ్యామాది పరిమితములకు (వ్యామము-మొద లగువానిపరిమాణము (కొలత) కలదానికి) పేర్లు.

[బారెఁడు:- (బార + ఎఁడు)—అడ్డము గా చాఁపఁబడిన రెండుచేతులతోడి బొమ్మ కొలత-వ్యామము. అదియే బార.దానియంతకొలత కలది.

మూరెఁడు:-(మూర + ఎఁడు)---రెండుజేనలకొలత కలది హస్తము.అదియే మూర. దానియంతకొలత కలది.

పట్టెఁడు:- (పట్టిలి + ఎఁడు) — ఎడము గా వంపఁబడినవ్రేళ్లు గలచేర-పట్టిలి. దానిపరిమాణము కలది.

జేనెఁడు:-(జేన + ఎఁడు) (వితస్తి-జేన) — పండ్రెం డంగుళములకొలత కలది. అంతకొలత కలది.

దుత్తెఁడు:-(దుత్తిలి + ఎఁడు)— చాఁపఁబడినబొటనవ్రేలి చూపుడువ్రేలి - నడిమి ప్రదేశము-ప్రాదేశము-(దుత్త.) అంతటి పరిమాణము కలిగినది.

పుడిసెఁడు:-(పుడిసిలి + ఎఁడు)—కుదియఁబట్టిన చేరలో సగము (ప్రసృతి) (పుడిసిలి.) అంతకొలత కలది.

బెత్తెఁడు:-(బెత్త+ఎఁడు) — చూపుడువ్రేలు మొదలు గా నాలుగువ్రేళ్లు బెత్త. (చతురఙ్గుళి.) అంతపరిమితి కలది.

రూకంత,కాసంత, పోకంత, ఈఁగంత, ఇసుమంత, దోమంత, ఏనుఁగంత — ఇవి, ఈరీతిశబ్దములు (ఇట్టివి; గోరంత, చీమంత, రవంత-మొద లగునట్టివి) - పదాది మాత్రమునకు (కాసు-మొదలు గా (పూర్వపదమునందు) నిర్దిష్ట మైనపరిమాణమునకు) పేర్లు

[వీనిని-ఈ'కాసంత'మొ. వానిని 'అవ్యయీభావము'-అవ్యయీభావసమాసము(లు) అని, కొందఱు-కొంతమంది వైయాకరణులు, అండ్రు- చెప్పుదురు.]

బారెఁడు:—'ఎడు స్స్యా త్పరిమాణకే' (అధర్వణుఁడు).

పట్టెఁడు:—'ప్రసృత్యాదే ర్లివర్ణస్య లోప శ్చ పరిదృశ్యతే' (అధర్వణుఁడు.).

వ్యామము:—'వ్యామో బాహ్వోః సకరయో స్తతయో స్తిర్యగన్తరమ్' (అమ.).

కొంద అండ్రు:—కాసంత-మొద లగువానియందు 'అంత' అనునది 'అపద'మని (శ.ర.).ఇఁక-'ఆంధ్రకౌముది' వీనిని అవ్యయీభావములఁ గా నిర్వచించినది. '....నింక, వాపి గాఁ దెలివిడి జేసెద నవ్యయీభావసమాసము ల్బాళిఁ గనుఁడు। కడు నిమ్మకాయంత కాసంత గోరంత యిసుమంత దోమంత యేనుఁగంత। చీమంత యన నివి నామపూర్వపదసమాస మగుచు నిట్లు

మంతు కెక్కు' (చూ. ఆం. కౌ. సమా.). ఆం. భా. కారుఁడు ఈ గణపతి వేంకటకవి మత మునే 'కొంద' అని ఇట్లు వచించినాఁడు. ఇఁక ఈ ఆం.భా. కారుఁడు (శ.ర.) అట్లే. ఇచటి 'అంత' అనుదానినిఁ బరిమాణార్థక మగు (ఎఁడు ప్రభృతులవంటి) 'అపద' మనియే అను నని తోఁచు చున్నది. 'శాకస్య లేశః-శాకప్రతి' ఇత్యాదులు సంస్కృతమున 'నామపూర్వపదావ్య యీభావములు'. అట్టివే యివియును-అని వేంకటపతియభిప్రాయము.

[ఈవిశేష్యనిఘ్నప్రకరణమునందు, మహదమహదాదినిర్దేశ మవివక్షితము. నాంత రీయక మై యట్టినిర్దేశము జరగిన దని యెఱుఁగవలయును].

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగును 'విశేష్యనిఘ్నాఖ్యవర్గ' మిట్లు;
గైకొనుము దీని భక్తసంఘాభిమాని!
మాతృభూత! జగత్త్రియీమాతృభూత! 28

[ వ్యాఖ్యకై చూ. స్వర్గ. 68. ]

ఇది

విశేష్యనిఘ్నవర్గము

---

# సంకీర్ణవర్గము

సీ. కోవురం,బనఁ జెట్లకొన కెక్కి వైరులఁ
జూచుట కర్థ మై తోఁచి యుండు;
నల్లారుముద్దు, నా నగు జనసమ్మతి;
యదువకాఁ, పనఁగను నద్దెకాఁపు;
నల్లిబిల్లి,యనంగ నలరుఁ బెనంకువ;
నిలుకడ, దనరును నిట్టల మనఁ
గన్గిలు,పనఁగను గన్గీఁటు విలసిల్లు;
సెసక, మం చనఁగ నుల్లసిలుఁ జలము;

గీ. అలరు దొంతరవరుసలపే రంచె, లనఁగ;
నీఱతాఱు, లనంగను దాఱుమాఱు,
లలరు చుండును; గాజురా, యన హలాకు;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 29

కోవురము—ఇది చెట్లకొన కెక్కి శత్రువులఁ జూచుటకు (చెట్లపై కెక్కి శత్రువులకు కాన రా కుండ వారిజాడ,కనిపట్టుటకు) పేరు.

అల్లారుముద్దు—ఇది జనసమ్మతికి (సర్వజనప్రియమునకు (అందఱిజనులకు ఇష్టమైనదానికి) మిక్కిలి ప్రియమునకు; చాలయిం పైనదానికి) పేరు.

అదువకాఁపు—ఇది అద్దెకాఁపునకు (సిస్తునకు భూమి సేద్యము చేయురైతునకు) పేరు.

అల్లిబిల్లి—ఇది పెనఁకువకు (ఒక టొకటి పెనవేసికొనుటకు; విడఁదీయ రానియట్లు మెలిక వేసికొని కలసి యుండుటకు) పేరు.

**నిట్టలము—ఇది నిలుకడకు (స్థిరత్వమునకు; నిశ్చలతకు; కదలిక లే కుండ ఉండుటకు) పేరు.**

**కన్గిలుపు—ఇది కన్గీటుటకు (కన్గిలుపునకు; కనుగొలుపునకు; కనుత్రిప్పునకు; కనుగొట్టుటకు; కనుసైగ చేయుటకు) పేరు.**

**సెసకము—ఇది చలమునకు (చలనమునకు; నిలుకడ లేనిదానికి; అస్థిరమునకు; చంచలమునకు) పేరు.**

**అంటెలు—ఇది దొంతరవళులకు (ఒకటిమీద ఒకటి గా ఏర్పడు ముడుతలకు) పేరు.**

**ఈఱతాఱలు—ఇది తాఱుమాఱులకు (వక్రములకు; సరి యైనవి (ఋజు వైనవి) కానివానికి) పేరు.**

**గాజురాయి—ఇది హలాకునకు (స్వచ్ఛ మైననలుపురంగు కలిగి నిగనిగ లాడు గాజుశిలకు) పేరు.**

కోవురము:—కోవర ముండుట శత్రువులను కొట్టుటకు దారిపక్కన దాగి ఉండుట-అని(బ్రౌ.).

సెసకము:—దీనిని ఏనిఘంటువులు గ్రహింప లేదు.

చలము:—'చలనం కమ్పనం కమ్ప్రం చలం లోలం చలాచలమ్' అని (అమ.).

గాజురాయి:—(బ్రౌ) తప్ప- మఱి యేనిఘంటుకర్తలు 'గాజురాయి' గ్రహింప లేదు.

హలాకు:—(బ్రౌ) మిశ్రమనిఘంటువు 'హలాకు-అల్లాకు' అనువానిని విశేషణములం గా గ్రహించి, నాశనము చేయఁబడ్డ-హతముచేయఁబడ్డ-చంపఁబడ్డ-అని అర్థ మిచ్చుచున్నది.

ఈఱతాఱలు:—'బహువిధంబులఁ బలుకునాపలుకు లెల్లఁ। జెవిటికై వడిఁ దనపెడచెవులఁ బెట్టి। యీఱతాఱలు మఱుమాట లిచ్చి యపహ।సించె దుర్యోధనుఁడు వేయుఁ జెప్ప నేల'? (భార. ఉద్యో.4.76.) (చి.ని.పా.) (చూ.సూ.ని.) (బహు.) అవివక్షితము. 'ఈఱతాఱతలంపులు' (మొ.) (చూ.సూ.ని.).

సీ. అదను,నాఁ దఱి,నాఁగ నలరును సమయంబు;
గద్దింపు, వెలయును గద్దన,యన;
నొనవెట్టు,నాఁగను దనరును పొంచడం;
బడరును జూఱ,యం చనఁగఁ గొల్ల;
చెచ్చెర,ననఁగను జెలఁగును సులభంబు;
పస,యన స్ఫురణంబు పరఁగు చుండు;
సైఁద,యనంగను జనును గోదుమపిండి;
క్రమ మొప్పు చుండు సరవి,యనంగఁ;
గీ. జిటికరింత, యనంగను జిటిక,యనఁగ
వ్రేల్మిడి,యనంగఁ ద్రుటిపేరు వెలయుచుండు;
నవనవ,యనంగఁ గొద్దిగాను వినుట తగు;
భూరిభవభంగ ! శ్రీమాతృభూతలింగ ! 30

అదను, తఱి—ఇవి సమయమునకు (హదనునకు, వేళకు; ఉచితకాలమునకు) పేర్లు.
గద్దన—ఇది గద్దింపునకు (అదలింపునకు; తర్జింపునకు; బెదరింపునకు) పేరు.
ఒనవెట్టు—ఇది పొంచడమునకు (పొంచి ఉండుటకు; మఱుఁగువడి ఏదేని ఉద్దేశించి కనుపెట్టి ఉండుటకు) పేరు.
చూఱ— ఇది కొల్లకు (దోఁపుడునకు; దోఁచుకొను వస్తువునకు) పేరు.
చెచ్చెరన్—ఇది సులభమునకు (చులకన గా-అనాయాసము గా-సులువు గా-అగు దానికి) పేరు.
పస—ఇది స్ఫురణమునకు (నిగ్గునకు; కాంత్యతిశయమునకు; గొప్పకాంతికి) పేరు.
సైఁదము - ఇది గోదుమపిండికి (గోధుమపిష్టకమునకు; గోధుమచూర్ణమునకు) పేరు.
సరవి—ఇది క్రమమునకు (పరిపాటికి; ఆనుపూర్వికి; వరుసకు) పేరు.
ఛిటికరింత, చిటిక, వ్రేల్మిడి—ఇవి త్రుటికి (అల్పకాలమునకు; చిటిక వేయునంతటి కాలమునకు) పేర్లు.

**పవసవ—ఇది కొద్ది గా వినుటకు (చూచాయ గా-జాడజాడ గా- కొద్దికొద్ది గా-వినుటకు, విని తెలియుటకు) పేరు.**

ఒనవెట్టు:—'కొను' అనుదానితో చేరియే దీనికి ప్రయోగము-(చూ.సూ.ని.).

పస:—'ఇట్టిపసమిస జిగిబిగి యీవిధంబు' (హంస.1.90.)మొ. (చూ.బ్రౌ.అను.).

చిటికరింత:—'....జిటికిరింత' (వావి.అపముద్రి.).

త్రుటి:—'తృటి'- (వావి.అపముద్రి.) 'ద్వే త్రుటీ లఘ్వక్షరకః' అని (వైజ.). అర్ధమాత్రోచ్చారణకాలము. ద్వినిమేషాత్మకకాలము-రెండునిముసములకాలము-అని (స.పి ప.ల.సం.).

గీ. భుజయుగంబున జందెముల్ బోల్కి మెలిని
బెట్టి యున్నట్టిదుప్పటి గట్టి గాఁగఁ
గట్టుక ట్లొ ప్పెసఁగు సరిక, ట్లనంగ
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ! 31

**అరికట్టు—ఇది దుప్పటి మెలిపెట్టి గట్టి గా రెండుభుజములయందు జందెపువాటుగా వైచి కట్టినకట్టునకు (వేఁటకట్టునకు) పేరు.**

[గట్ట:—'గట్టి... సరిక ట్టనంగ'అని (వావి.పా ).సూ.ని. ఈ పాఠమునుబట్టియే ఏకవచనాంతముగా 'అరికట్టు' అనినది. (బ్రౌ.శ.ర.లు) బహువచనాంతము గా దీనిని గ్రహించినవి. (బ్రౌ.) దీనికి అర్థ మి ట్లిచ్చినది-'అరికట్లు' అనగా భుజయుగమందు జంధ్యమువలె మెలివెట్టి యున్న దుప్పటి కట్ట గా కట్టినటువంటి కట్లు. (అం.భా.) ఈవ లావల జననిది-(ఆంధ్రదీపిక)' (చూ. బ్రౌ.అను.). ఈవ్రాఁతనుబట్టి 'దుప్పటి గట్ట గాఁగ' అనియే (బ్రౌ.పా.) అని తోఁచినది.]

సీ. బద్దపరికి,యనఁ బలుచనిబిళ్ల యౌ;
నెడరు,నా సందుక ట్టెసఁగు చుండుఁ;
బంపు,నా నభిచారవాచకం బౌను; దూ
ర్వాలు,యం చనఁగను బవన మొప్పు;
నలుజాతి,యనఁగను నలరును జెడుజాతి;
పన్నిక, యనఁగను బన్నుట తగుఁ;
జెల్లుబడికిఁ బేరు చెలఁగును రేప,మనఁ;
గందువ, యనఁ జమత్కార మెసఁగు;

55]

గీ. నెద్దులను గాళ్ల గట్టి క్రిం దేయు టొప్పు
గోలగగ్గర,యన; దినకో,రనంగ
వెలయు దినరోజు; మునుము,నా నలరుఁ గోయు
పయిరుకును ముందుపైరు గాఁ; బార్వతీశ! 32

బద్దపరికి—ఇది పలువనిబిళ్లకు(దళసరిది గానిగుండ్రని వస్తువునకు (బిల్లకు) పేరు.

ఎడరు—ఇది సందుకట్టునకు (సందునకు; మధ్యకాలమునకు; నడుమఁ గలిగిన (కాలముయొక్క) అవకాశమునకు) పేరు.

పంపు—ఇది అభిచారమునకు (హింసాకర్మమునకు; పరులమారణాదుల కగుమన్త్ర తన్త్రక్రియలకు; ప్రయోగమునకు) పేరు.

తూర్పాఱ—ఇది పవనమునకు (తూఱుపాఱ ఎత్తుటకు; గల్లపొట్టు - మొద లగునవి ఎగిరిపోవునట్లు చేఁట లో నగువానితో ధాన్యము లో నగువానిని గాలి కెదురు గా పై కెత్తి క్రిందు గా పోసి శోధించుటకు) పేరు.

అఱజాతి—ఇది చెడుజాతికి (హీసకులునకు; నీచజాతివానికి) పేరు.

పన్నిక—ఇది పన్నుటకు (పన్నుగడకు; వ్యూహాదుల (సేనాసంనివేశాదుల) నిర్మాణమునకు) పేరు.

రపము—ఇది చెల్లుబడికి (సాగుబడికి: సాగుటకు; పలుకు, పంతము, ఆజ్ఞ - మొద లగునవి నెగ్గుటకు) పేరు.

కందువ—ఇది చమత్కారమునకు (ఆనందహేతు వగు చిత్తవికాసమునకు) పేరు.

కోలగగ్గర—ఇది ఎద్దులను, కాళ్లు గట్టి క్రిందవేయుటకు (ఎద్దులకాళ్లకు (లాడాలు) కొట్టుట లో నగువానికై త్రాడు తగిలించి ఎద్దులను మూటకట్టు గా కట్టెడికట్టునకు) పేరు.

దినకోరు—ఇది దినరోజునకు (దినభృతికి; దినబత్తెమునకు; దినమున కింత యని దినదినము ఇచ్చెడికూలికి) పేరు.

మునుము—ఇది కోయుపైరునకు ముం దున్నపైరునకు పేరు.

సందుకట్టు:—నేను పోయి వీడువచ్చేసందుకట్టులో-అనురీతిని (వ్యవ.) (చూ.బ్రౌ.).

అభిచారము:—'మార ణోచ్చాట నాదిఫలకతాన్త్రికప్రయోగవిశేషః'అని (స.త.సి.స,ల.సం.).

పవనము:—'నిష్పావః పవనే పవః' (అమ.).

రపము:—(శ.ర.) చెల్లుబడి' అనెడి-అర్థము దీని కిచ్చి 'ఒకటి నొక్కటి సడ్డసేయక మెలంగు । నాపొలంబునఁ దమ రపం బై మెకములు' అని (సారం. 1.68) పద్యము నుదాహరించి నది. ఇచట- 'నాపొలంబునఁ దరతరం బై మెకములు'అని, తరతరంబై-గుంపులు గుంపు లై-అని వ్యాఖ్యానించి, ఇట్టియర్థము చెప్పుటకు (బ్రౌ.) ప్రమాణీకరించుచు-ఒకవ్యాఖ్యాత పడిన క్లేశము గమనింపఁ దగినది (చూ.జితకాశి-సార.) ప్రయోగాంతరము గూడ దీని కి ట్లిచ్చినది (శ.ర.) '...భువనబంధుఁడు లేనియరాజకంబుచేఁ । దనరప మై చరించె వసుధాస్థలిఁ జీఁకటి పాశెగాఁ డొగిన్' (అని. 3.8.).

చమత్కారము:—లోకాతీత మగువస్తువును చూడఁగా చిత్తమునకు కలుగునానందహేతు వైన వికాసము, విస్మయము, అబ్బురపాటు-అని (సూ.ని.).

ఏయుట:—వేయునకు (రూపాం.). 'హనుమంతునియెదుర వెసం గుప్పిగంతు లేయుట సుమ్మీ (ద్వా.2.49) (చూ.సూ.ని.).

దినకోరు:—'దిగ్గో లనంగ' అని (వావి పా.). (శ.ర.) దిగ్గోలు గ్రహించి - 'కోయుపైరునకు ముందుపై' రనునర్థమును ఇచ్చినది విచార్యము. బ్రౌ. 'దినకోలు' అని గ్రహించి, అనఁగా-దినరోజు (ఆంధ్రదీపిక) - అనినది.

దినరోజు:—(బ్రౌ.) 'దినరోజుమునుము' గ్రహించి-'కోయుపయిరునకు ముందుపయిరు' అని నది. దినరోజు-అని గ్రహించుట 'మునుము' తో కలపి ఏకపద మనుట ప్రమాద మన వచ్చును. (దినగోల-దినబత్తెము, దినదిన మిచ్చెడుబత్తెము-అని ఒకనిఘంటుకర్త.) 'దిన బత్తెము' వంటివి 'దినకోరు' 'దినరోజు' అనునవి. పై నాగ్రహించినది (సూ.ని.పా.) (చూ. 'దినకోరు').

గీ. పరఁగు నాకస్మికంబు డబ్బా,టనంగఁ;
దనరుఁ బెడకంత,యనఁగను దప్పుత్రోవ;
ప్రబలు ముఱుత్రోవ,నాఁగ దుర్గంధపదవి;
వ్యగ్రతయుఁ దోఁచు చుండు జూవర,మన; భవ ! 43

డబ్బాటు—ఇది ఆకస్మికమునకు (యాదృచ్ఛికమునకు; హఠాత్సంభవమునకు; అనుకోకుండ జరగినదానికి) పేరు.

ముఱ్ఱ్రోవ—ఇది దుర్గంధపదవికి (దుర్వాసనతో నిండినత్రోవకు) పేరు.

జూవరము—ఇది వ్యగ్రతకు (ఆకులపాటునకు; కలఁతకు; కలవరపాటునకు) పేరు.

వ్యగ్రత:—'వ్యగ్రో వ్యాసక్త ఆకులే' అని (అమ.).

జూవరము:—'వ్యాకులము' అని (బ్రౌ.) (చూ.అను.). 'సంతాపము' అని (శ.ర.).

గీ. నెమలియీఁకలఁ బేనుదారములపాగ
నెట్ట, మని పల్కఁగాఁ దగుఁ; దెట్టుకొఱకు
ముండ్ల నల్లినతడక యై పొలిచి యుండుఁ
దడుకుఁబెండె, మనంగఁ; జంద్రార్ధచూడ ! 34

నెట్టము—ఇది నెమలియీఁకలచే పేనినదారములపాగకు (నెమలియీఁకల తలపాగాకు) పేరు.

తడుకుఁబెండెము—ఇది తెట్టుకొఱకు ముళ్లతో అల్లినతడకకు (ఆవరణమునకై ముండ్లకంపతో అల్లినతడకకు) పేరు.

నెట్టము:—క్రొత్తప్ర. తాటియాకు బ్రౌ.చి.ని.పా.ఇది.నెట్టెము (ప్రాఁతప్ర.పా.) (చూ.సూ.ని.). (శ.ర.) 'నెట్టెము' అనియే గ్రహించినది.

తెట్టు:—ఆవరణము, కంచె, కంపకోట-అని (సూ.ని.).

తడుకుఁబెండెము:—'తడుకు'.'పెండెము' అనువానిని వేఱు వేఱు గా గ్రహించి, 'వాకిలిముండ్ల తలుపు' అనెడి 'అర్థ' మిచ్చినది (బ్రౌ.) 'వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ। లార్పఁ బనిచి కనుమలందు నిలువ। వేఱువేఱ యేర్చి విలుమందిఁ బనిచి తాఁ,దడుకుఁబెండె మలుక వొడమ వెడలి' అని (ఆము.3.27.) (చూ.సూ.ని.).

గీ. గాదెపోలిక నుండెడికాఁగుపేరు
రంజణి, యనంగ వెలయు; నార్జనసమాఖ్య
యడరు రజన, యనంగను గడన, యనఁగఁ;
లంపు, నా దొంగమేపు చెలంగు; నభవ ! 35

రంజణి—ఇది గాదెపోలిక ఉండెడికాఁగునకు (బొట్టవంటిపెద్దబాన మొద లగు దానికి) పేరు.

రజన, గడన—ఇవి ఆర్జనకు (సంపాదనమునకు) పేర్లు.

లంపు—ఇది దొంగమేపునకు (తన్ను ఇతరు లెఱుఁగ కుండ మేయు మేఁతకు) పేరు.

రంజణి:—'రంజణ, రంజణి'-అని (శ.ర.). 'రంజిణి'-అని (బ్రౌ.).

దొంగమేపు:—'గడన యనఁగ, లంప మన దొంగమేపు చెలంగు నభవ' (ఆంభా.3.35.) అని (సూ.ని.) (చూ.గడన-3.అర్థము.). ఇచట - 'లంప' మని పాఠ మిచ్చినది. 'లంపు' గ్రహించి- 'లంపు నా దొంగమేపు చెలంగు నభవ' అని (అం.భా.3.35.) అను చున్నది పూర్వాపరవిరుద్ధము గా.

లంపు:—'లంప యన' అని(వావి.అపపా.) .'లంపు' అనియే (బ్రౌ.సూ.ని.శ.ర.లు.). 'లంపుల మారి' ఇత్యాదులు దృష్టములు. 'గటికజొంపంబులగుంపుల కుటికి। లంపులు మేయుచు' (భాగ.10స్కం.) (మొ.).

గీ. ఘటవిశేషంబు లై రేనికడవ,లనఁగఁ
 బూజెకాఁగులు, బు,డ్లనఁ బొలుచు చుండు;
 గాజులను గూర్చుచేరులు గాఁ జెలంగు
 చుండు మల్లార,మనఁగను; సోమభూప ! 36

ఐరేనికడవలు, పూజెకాఁగులు, బుడ్లు—ఇవి ఘటవిశేషములకు (ఒకవిధ మగు పెండ్లికుండలకు; రంగులతో చేసిన 'అలంకారము' గల పెండ్లికుండలకు; నాగవల్లి కుండలకు; అయిరేనికుండలకు) పేర్లు.

మల్లారము—ఇది గాజులను కూర్చుచేరులకు; గాజులగుదులకు; గాజులు గ్రుచ్చిన దండలకు (మలారమునకు) పేరు.

ఐరేనికడవలు:—అరివేణి-లేక-అరిమెన-కుండలు-అని (బ్రౌ.).

బూజెకాఁగులు:— 'బూజుగు లనంగ'-అని (వావి.పా.). 'పూజెగులు' అని (శ.ర.పా.)

'బూజుగాగులు, బూజుగులు, బూంజకాగులు' - అని (బ్రౌ.). పై నా గ్రహించినది. (ప్రాఁత వ్రాత ప్ర.పా.) (చూ.సూ.ని.).

బుడ్లు:—దీనిని ఈ యర్థమున (శ.ర.సూ.ని.బ్రౌ.) లు ఏవియు గ్రహించుట లేదు. ఇట 'బుడ్లు' అనియే పాఠ మనుచున్నది (సూ.ని.) (చూ.పూజెకాఁగులు.). 'బుడ్డి' వేఱు గా గ్రహించినది - (ఆం.భా.) (చూ.2.246.). (దీనికి 'పెండ్లి కగుఘటవిశేషము (నాగవల్లిచిన్నపిడుత వంటి దేదేని) అర్థ మనవలయును.

గీ. చెంపలను మూసి కట్టుట చెలఁగు గౌద
కట్టనంగను; గడుపులోఁ గలుగుజాలి
యలరు చుండును జుమ్మచుట్లనఁగ; భక్త
పోషకాపాంగ! శ్రీమాతృభూతలింగ! 37

గౌదకట్టు—ఇది చెంపలను మూసి కట్టుటకు (చెంపలను మఱుఁగుపఱచి కట్టెడి(ఒక దినుసు) కట్టునకు) పేరు.

**చుమ్మచుట్లు—ఇది కడుపులో కలుగుజాలికి (కడుపునందు సంభవించు వేదనకు) పేరు.**

గౌదకట్టు'—'గద్దువ గౌద యనఁగఁ। జిబుకనామంబు రాజిల్లుఁ....' అని (సాం.ని.మా.17.). (గవుద-రూపాం.) '....ముక్కు। నువుఁబువ్వు చెవులు శ్రీల్ నునుఁబండ్లు మొల్లల, ధర మిగు ర్చెక్కు లద్దములు గవుద। తాటిగింజ మెడ చిందము వ్రేళ్ల పగడము లక్క। రము లబ్జములు. (ప్రబంధ.398.). 'బూఁది బ్రుంగిన మొకంబున గౌదకట్టు మైనపుమైలప్రాఁజొత నా వెలుంగ' (7.18) (బ్రౌ.) (చూ.అను.). ('మొగంబున' 'ప్రాఁజొత' (వేద.పా.).

**గీ. పల్లముల యిరువంకలఁ బరఁగుపట్టు
త్రాళ్లు వెలయుచు నుండు లాలసరు, లనఁగ;
వెనుక మోఁచేతులను గట్టిపెట్టు టొప్పు
లాఁకకట్టు, లనంగఁ; గైలాసవాసి! 38**

**లాలసరులు—ఇది పల్లములయిరువంకలను పరఁగుపట్టుత్రాళ్లకు (గుఱ్ఱముమీఁది పల్లములకు ఇరుప్రక్కల వ్రేలాడు చుండెడిపట్టుత్రాళ్లకు) పేరు.**

లాఁకకట్టు—ఇది మోఁచేతులను కట్టిపెట్టుటకు (విఱిచి కట్టినపెడచేతులకట్టునకు) పేరు.

లాలసరులు:—(ఏ.) లాలసరి. '.. పార్శ్వంబులం గట్టుకెంబట్టులాలసరి సమకట్టు తెక్కలు గా యాతుధానుం డనుకొండచిలువ నొడియ నేలపఱపు గా నాడుగరుడుం డనం. ' (మనుచ. 4.115.) (చూ.బ్రౌ.అను.). (ఇచ్చటిలాలసరి గోబలీవర్దన్యాయమున 'త్రాడు' అను-అర్థము కలది.). (శర.) (లాలము+సరి) అని, 'గుజ్జుపల్లముమీఁదియుల్లారుక్రింద ౘ్రవేలెడుజల్లుల దండ' అర్థ మనినది దీనికి.).

లాఁకకట్టు:—'లాకలకు గట్టి' అనగా పెడచేతులు విరిచి కట్టి' (O g.) అని (బ్రౌ.)

గీ. కీలుకీలుకు విఱుచుట గేరును విట
తాట, మనఁగాను; మెకమెకపా,టనంగ
నాఁకలికి నోర్వఁ జాలనియార్తి చెల్లు;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ ! 39

విటతాటము—ఇది కీలుకీలు విఱుచుటకు (సంధులు సంధులు విఱుగఁ దీయుటకు) పేరు.

మెకమెకపాటు—ఇది ఆఁకలికి ఓర్వఁ జాలని 'ఆర్తికి' (సహింప రాని 'ఆఁకలి' బాధకు) పేరు.

విటతాటము:—(శ.ర.సూ.ని.) ఈ యర్థమున దీనిని గ్రహింపక 'తాఱుమాఱు' లో నగు 'అర్థము' లను ఇచ్చు చున్నవి. అవి అర్థాంతరము లన వలసినవి. దీనికి బ్రౌ. 'వెస జైన ప్రతిమల విటతాట మాడి । వసతు లన్నియు వ్రచ్చి పైపించెఁ గాదె' అని ప్రయోగముగూడ నిచ్చినది.

గీ. బెస్తలు భుజంబులందును బెట్టుకొనెడి
యార్ద్రపటములు మాలుగు,లనఁగ వెలయు;
వ్రేఁగు,లన బరువులపేరు వెలయు చుండు;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 40

**మాలుగులు—ఇది బెస్తలు బుజములందు పెట్టుకొనెడి 'అర్ధ్రిపటము' లకు (పల్లకీ మోయు బెస్తలబుజములమీఁది తడిమడతపొత్తికి) పేరు.**

**వ్రేఁగులు—ఇది బరువులకు (భారములకు) పేరు.**

వ్రేఁగులు:—(ఏ.వ్రేఁగు). 'ఎందును నెవ్వరుం బడనియెంతయుఁ గష్టముపాటు వచ్చినం। గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్ననన్ను గో। విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ రానియప్పుఁబో। లెం దలపోయ వ్రేఁ గయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్' (భార. ఉద్యో. 2.129.). ఇది (విశే.) గాఁగూడ ప్రయోగములందుఁ గానవచ్చుచున్నది - 'పేడుకపేర్పుఁదొయ్యలుల వ్రేఁగుఁజనుంగవమీఁద మన్మథక్రీడల వ్రాలి నిద్రల సుఖించి ప్రభాతములందు' (హరి.ఉ.10.291.) (చూ.సూ.ని.).

ఆ. వె. సోయగంబు, సొబగు, జోక, మురువు, కొమరు,
చెలువు, తీరు, సొరు, పొలుపు, చెన్ను,
చక్కఁదన, మసంగ సౌందర్య మొప్పును;
మహితగుణసమేత ! మాతృభూత ! 41

**సోయగము, సొబగు, జోక, మురువు, కొమరు, చెలువు, తీరు, సొరు, పొలుపు, చెన్ను, చక్కఁదనము—ఇవి సౌందర్యమునకు (అందమునకు; మురువునకు; బాగునకు; హారువునకు; ఒప్పిదమునకు) పేర్లు.**

జోక:—వీనినిఁ గొన్నిటిని 'మంజులము' నకు పేర్లని (సాంబ.) ఇట్లు వచించుచున్నది-'కొమరు చొక్కాటమ్ము గొనబు చొకారము, చొక్కము మేలిమి జోక పొలుపు। నాణెంబు సొరు విన్నాణంబు తిన్నన, పరఁగు చొక్కా చెల్వు మురువు తనరు। నగు తియ్య బొనరు చెన్నలరు నలువు తీరు, వఱలు జాను చెలంగు కొఱలు నొనరు। చను తగు నొప్పు నెసంగు ననెడిపేళ్లు, తగుమంజులమునకు' (మాన.39.).

**గీ. వన్నె హెచ్చినయట్టిక్రొంబసిఁడికడ్డి
కత్తిరించినతావునఁ గానిపించు
నిగ్గునకుఁ బేరు నక్కు, నా నెగడు చుండుఁ;
దను, కనఁగ వజ్రకాంతి యై తనరు; నభవ ! 42**

నక్కు—ఇది వన్నె హెచ్చినట్టి క్రొంబసిఁడికడ్డి కత్తిరించినతావున కానిపించు నిగ్గునకు (బంగారుకడ్డి నఱకఁగా దానినడుమ కనిపించుగొప్పకాంతికి) పేరు.

తనుకు—ఇది వజ్రకాంతికి (వజ్రముల ప్రకాశమునకు) పేరు.

[తనుకు:—దనువు- అని (బ్రౌ.వ్రాఁతప్ర.పా.) (చూ.సూ.ని.). (తనువు-అనిఒకనిఘంటువు.).]

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు నిచ్చలు 'సంకీర్ణవర్గ' మిట్లు;
గైకొనుము దీని భక్తసంఘాభిమాని !
మాతృభూత ! జగత్త్రియీమాతృభూత ! 43

[ వ్యాఖ్యకై చూ. స్వర్గ. 68. ]

ఇది

సంకీర్ణ వర్గము

---

# నానార్థవర్గము

సీ. గౌ,రన నేనుఁగు కాహళి విలసిల్లు;
　　డంబు,నాఁగను గాంతి డంబను నగుఁ;
జెలి,యనఁ జెలికాఁడు చెలికత్తెయును దోఁచుఁ;
　　జెట్ట,నాఁ జెనఁటియుఁ జేయి వెలయు;
స్తనకవాటాంగము ల్దనరు గుబ్బ,లనంగ;
　　నావు నెద్దును దొడు,కనఁగ వెలయుఁ;
జిన్నవేజయు నమ్మ చెలఁగును గొరక,నాఁ;
　　జెలఁగుఁ జోఁ,యనంగ శిశురుషములు;

గీ. బాలకేళినతుల్ చెంగనా,లనఁ దగుఁ;
గచ్చపెల్లును మగఁటమి గఁ,డనఁబడు;
నల్పకుసుమంబు వినతియు నడరు చిన్ని
పూ,వనుకొనంగ; శ్రీమాతృభూతలింగ ! 44

గౌరు—ఇది ఏనుఁగునకు, కాహళికి (కాహళమునకు; బాఁకాకు; ఊఁదెడివాద్యవిశేష మునకు) పేరు.

డంబు—ఇది కాంతికి, డంబమునకు (దంభమునకు- ఆడంబరమునకు; స్థితికి మించిన వేషమునకు, అట్టిభాషణమునకు) పేరు.

చెలి—ఇది చెలికానికి, చెలికత్తెకు (స్నేహితునకు, స్నేహితురాలికి) పేరు.

చెట్ట—ఇది చెనఁటికి (ద్రోహికి;దుష్టునకు), చేతికి (హస్తమునకు) పేరు.

గుబ్బలు—ఇది స్తనములకు, కవాటాంగములకు (తలుపుమీఁద అమర్చెడి 'అడ్డు కొయ్య'లమీఁది గుబ్బలకు; బొగడలకు) పేరు.

**తొడుకు—ఇది అవునకు, ఎద్దునకు పేరు.**

**గొరక—ఇది చిన్నవేజకు (చిన్నయీఁటెకు) అమ్మునకు (ఇనుపబాణమునకు) పేరు.**

**చోఱ—ఇది శిశువునకు (బాలునకు), ఝషమునకు (రాజీవమునకు; క్రూర మైన ఒకదినుసుచేఁపకు;చొఱకు) పేరు.**

**చెంగనాలు—ఇది బాలక్రీడకు (ఒకవిధ మగుపిల్లలయాటకు), నతికి (ఒకవిధ మైన నమస్కారమునకు) పేరు.**

**గండు—ఇది కచ్చుపెల్లునకు (కోపాతిశయమునకు), మగఁటిమికి (పౌరుషమునకు; మగతనమునకు) పేరు.**

**చిన్నిపూవు—ఇది అల్పకుసుమమునకు, వినతికి(నమస్కారవిశేషమునకు; ఒకవిధ మగునమస్కారమునకు) పేరు.**

నానార్థవర్గము:—ఈవర్గాదియందు అమర మి ట్లను చున్నది- 'నానార్థాః కేఽపి కాన్తాది వర్గే ష్వేవా ఽత్ర కీర్తితాః। భూరిప్రయోగా యే యేషు పర్యాయే ష్వపి తేషు తే' (అని.). (అం.భా.) ఇట్లు వచింపక పోయినను ఈపద్ధతినే ఈవర్గమునందు పాటించినది, పైశ్లోకమునకు వివరణ మి ట్లున్నది.

పూర్వము,పర్యాయపదవర్గములలో చెప్పఁబడినవి, చెప్పఁబడనివిగూడ ఇందు చెప్పఁబడినవి. చెప్పఁబడినవానిని మరలఁ జెప్పుటయందు పునరుక్తి లేదు. ప్రసిద్ధార్థబోధమున కటను, అప్రసిద్ధార్థబోధమున కిటను చెప్పఁబడినవి (ఉదా. 'నాక' శబ్దము-మొ.). 'ఆకాశే త్రిదివే నాకః' (స్వర్గ.). స్వర్గపర్యాయము గా ఇది ప్రసిద్ధార్థకము. అంతటిప్రసిద్ధి ఆకాశార్థమునందు దీనికి లేదు. చెప్పఁబడనివి గొన్ని యిట చెప్పఁబడినవి. అవి యేయర్థమునందును జెప్పఁ దగినంతప్రసిద్ధి కలవి కావు. అందులకే అట-(పర్యాయపదవర్గమందు) చెప్పఁబడక యిట నుడువఁ బడిన వివి (ఉదా:-'కం శిరో ఽమ్బునోః' (మొ.). ఈశ్లోకమునకు (గురు.) అవతారిక ఇట్లొసఁగినది- 'ఏకార్థానేకపర్యాయాః ప్రథమం ప్రతిపాదితాః । పద మేక మనేకార్థం సంప్రతి ప్రతిపాద్యతే'. దీనికి అర్థవివరణ మి ట్లొనర్చినది-గ్రంథకర్త పూర్వవర్గములలో నేకార్థము గల యనేక పర్యాయములఁ జెప్పి యిప్పు డీనానార్థవర్గమునందు అనేకార్థములు గలశబ్దములఁ జెప్పఁ బోవుచు,

మున్ముందు గా నివి పూర్వవర్గములలోఁ జెప్పినవో, చెప్పనివో యనుశంకను దీర్చు చున్నాఁడు.- (అని.). (ఆం.భా.) నానార్థవర్గమునకుఁ గూడ ఇదే అవతారిక. ఇదే వివరణము. పైయమరము వచించిన దంతయు (ఆం.భా.) కుఁ గూడ చాలవఱకు సమానమే ! అందులకే యిది యంతయు వచింపఁబడుచున్నది. (అమ.)కొన్నిపట్టుల పర్యాయవర్గములం దిచ్చినవిశేషశబ్దములను సామాన్య వివక్షతో ఇందు వచించినది. కొన్నిపట్టుల విశేషవాచకములఁగానే (అం దిచ్చిన విచ్చినట్లు గానే) ఈ వర్గమునందు (నానార్థవరమునందు) గ్రహించినది (చూ.'శఙ్ఖో నిధౌ' (లలాటాస్థికమ్బౌ న స్త్రీ) (నానా.) పూర్వము 'భేదాః పద్మశఙ్ఖాదయో నిధేః' (స్వర్గ.).ఇట్లే 'గుల్మా రుక్త్స్నమ్బ సేనా శ్చ' (నానా ). 'సేనాముఖం గుల్మగణౌ' (క్షత్రి.) (మొ.). ఇచ్చట వ్యాఖ్యాతలు (నిధి విశేషమునకు, సేనావిశేషమునకు-అనురీతినే వ్యాఖ్యానించు చున్నారు (టీ.గురు.మొ.). ఇట్లే పూర్వ మిచ్చినవి యిచ్చినట్లే పేర్కొనుటయు జరగినది కొన్నిపట్టులందు 'వహ్నే ర్ద్వయో ర్జ్వాల కీలా వర్చి ర్హేతి శ్శిఖా స్త్రియామ్' (స్వర్గ.). 'రవే రర్చి శ్చ శస్త్రం చ వహ్నిజ్వాలా చ హేత యః' (నానా.మొ.). (అంభా.కూడ) ఇట్లే వచించిన దిందు (చిన్నిపూవు, గౌరు.మొ.) (చూ. నాతొలిపలుకు, అచ్చటచ్చటినావ్యాఖ్యానము). కొన్నిచోట్ల పూర్వము చెప్పనిప్రసిద్ధార్థముల సంగ్ర హించుటగూడ నానా.వర్గమందు జరగిన దనవచ్చును.-'...బాగా యనఁగ నశ్వపంక్తి విరాజిల్లు'(ఆం. భా.2.196.). 'మందుకోష్ణీషము ల్మనుచు బాగా యన' (నానా.3.47.)మొ.

గుబ్బలు: -- 'కుచమునకుఁ దల్పుచీలకు గుబ్బ యనఁగ . ' అని (సాంబ.నానా.91.). ఇట్లే 'గుబ్బ । నాఁగ బోరుతలుపునఁ గలసీలకు లేమగుబ్బకు భాసిల్లు' (వేంక.నానా.113.).

చోఱ:—'చౌఱ'- (రూపాం.) (చూ. అం.భా. 1.159.).

చెంగనాలు—— (సాంబ.) చిన్నిపూవు, చెంగనాలు (సాధారణము గా) సమస్కారవాచకము లను చున్నది.-'జోత.. .చిన్నిపూ చేమోడ్పు.....చెంగనాలు .సలా మన నమరు దండము పేళ్ల (మాన.25.). (ఆం.భా.) విశేషవాచక మనినది (చూ.2.175.).

[గచ్చుపెల్లు:—(చెంగనా) లనఁ దగుఁ 'గచ్చుతెల్లును'-అని (వాని.పా.) ఇచ్చట ' ...గచ్చుపెల్లు' అని ఉండు నని తోఁచినది. కోపము-అనెడి'అర్థము' 'క్రచ్చు' నకు కలదు. దానికి (రూపాం.) 'కచ్చు' కా వచ్చును. 'కచ్చుపెల్లు' కోపాధిక్యము. 'గండు' అనుదానికి 'కోపము' అనునర్థ మును నిఘంటువులు ఇచ్చు చున్నవి. 'కచ్చతెల్లు' నిఘంటువులు గ్రహింప లేదు.]

చిన్నిపువ్వు:—చిన్నిపూవు (రూపాం.). ఈ శబ్దమునకు (శ.ర.) 'భూషావిశేషము' అనెడి 'అర్థము'ను ఇచ్చుచున్నది. (సూ.ని.) అది కా దని. 'తురగఖురోద్ధూతధూళి యప్సరసల, చిన్నిపువ్వులతోడఁ జెలిమి చేయ' (భార.భీష్మ.1.104.). 'సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి, కురులపైఁ జిన్నిపూ గుస్తరించి' (కాశీ.7.147.). 'కుటిలాలకములమీఁదఁ జిన్నిపువ్వుఁ। గుస్తరించు నచ్చు గ మణికర్ణిక' (కాశీ.7.147.).మొ. ప్రయోగము లిచ్చి 'కుంకుమకర్పూరాదిచూర్ణము' దీని కర్థ మను చున్నది. ఒక ప్రయోగ మి ట్లున్నది- 'అలికలభములు పైఁ దులతెంచుతనిరేకు, లలకలఁ జిన్నిపు వ్వై వెలుంగ।నలిఁ గోయిలలు రాల్చునెలమావితలిరుఁట, వీనుల కవతంసవిభవ మొసఁగ। మలయానిలాహతి వెలలినపుప్పొడి, వొదివి మేనుల వింత పూఁత గాఁగ బుష్పహరణ। కేలిఁ దొంటిశృంగారము ల్దూలి యుండ। మగువలకు వనదేవత మగుడ నొప్పు। చేసెనో యన వేఁటొండు చెన్ను మిగిలె' (కు.సం 9.126.). ఇట (సూ.ని.) మొదటి పాదములో-'తులకించు' అని, 'తొలఁకించు' అని పారములఁ బ్రదర్శించినది (చూ.'తొలఁకించు' (తని.). 'తులకించు'-(చిన్నిపువ్వు.).'తొలఁకించు' అనుట ఇట సముచిత మనిపించును. 'చిన్నితుమ్మెదలు' (తుమ్మెదశిశువులు) రాల్చుచిన్నిపూరేకులు వనకేళి సలుపుస్త్రీలయలకలపై రాలి వానియందు ధరించెడి 'చిన్నిపూవు'గా అమరిన దని ఇట వర్ణన. ఇచ్చటఁ బైపాదములయందు (అనఁగా 1.2 పాదములయందు) విస్పష్టము గా (మాల్యశృంగారమే) వర్ణింపఁబడు చున్నది. జరగు చున్న దిట వనవిహారము. వనదేవత యొనర్చు చున్నయొప్పు (శృంగారము) ఇది. కనుక, ఈపాదము లన్నియు మాల్యనేపథ్యమునే వర్ణించు చున్న వనవలయును. రాలు చున్నవి చిన్నితేకులు. రాల్చు చున్నవి చిన్నితుమ్మెదలు. (రాలినవి ఇవి పూరేకులు). ఇఁక, వీనివలన రూ పొందినదిగూడ చిన్నిపూవే (లల్పకుసుమమే) కావలయును ; అని తోఁచు చున్నది. అందమునకై పూర్వము ముంగురులయందు (అలంకారము గా) చిన్నిపూవు ధరించుట వర్ణనలయందుఁ గానవచ్చును - 'సింహాసనము చారుసితపుండరీకంబు, చెలికత్తె జిలువారుపలుకుఁ జిలుక। శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు, పసిఁడికిన్నెరవీణె పలుకుఁదోడు . ' (శృం. 1.5). ఈ శృంగారకుసుమము 'చిన్నిపూవు' అనఁ దగినదే !' 'చిన్నిచుక్కలరాజు' అనుటగూడ దీనినే తెలియఁ జెప్పిన దన వచ్చును. ఇఁక (భార.ప్ర.), తురగఖురోద్ధూతధూళి మహావేగముతో, అప్సరస్త్రీల చిన్నిపువ్వులను కప్పివైచునంతది గా రేఁగినది (భూనభోంతరముల నిరవకాశములఁ గా చేయునంతది గా ఐనది) అనుటలో తాత్పర్యము గలది. తక్కినప్రయోగము లన్నియు (ఆం భా.)

దీని కిచ్చిన-అర్థమునకు విరుద్ధములు గా వనుట స్పష్టము : ('చిన్నీరు' వంటిది ఈ 'చిన్ని పువు'). 'చిన్నిపూరేకు' అనునదిమాత్రము 'ఆభరణము' (నగ) అనఁ దగినది. అది వేఱు. ఇది 'చిన్నిపూవు'యొక్క రేకును (దళమును) పోలి యుండుటనుజేసి ఈపేరు గల దైన దవిపించును. ఇది ఆభరణనేపథ్యమునకు చెందినది, అది 'మాల్యనేపథ్యమునకు ఐనది. నేపథ్యములు (శృంగారములు; అలంకారములు - నాల్గువిధములు గా పేర్కొనఁబడినవి- 'ఎందును నేపథ్యమునకుఁ। జందనభూషాంబరప్రసవముల వేఱ్వే। బొందుఁ జతుర్విధ మొక్కటి। యందంబు గఁ బంచవిధము లై యిటు పరఁగున్' (రిపాఫిబడు) (చూ. వసు. 1.72 వ్యా.). దీనికి ('చిన్నిపువ్వు'నకు) (ఆం. భా.) కు విరుద్ధము గా 'భూషావిశేషము' అనికాని, 'కుంకుమకర్పూరాదిచూర్ణము' అనికాని, అర్థము అనవలసినంతటియావశ్యకత కాన్పించుట లేదు. (బ్రౌ.) ఇందులకేకావలయు: (సూ.ని.శ.ర.) దీనికి ఇచ్చిన-అర్థము స్పృశింపక (ఆం. భా.) అర్థమునే ఒసఁగినది.

సీ. పక్షశౌర్యంబులు పరఁగు డాక, యనంగఁ;
 దెమ్మ, నాఁ బెల్లయుఁ దేమ వెలయు;
వత్సకృత్రిమమణు ల్వాఱలుసు దఱుపు, నా;
 నలితిండి యొప్పును నలి, యనఁ దగు;
నవలక్షణభగాఖ్య లలరు దూబ, యనంగ;
 నాఁచు, నా దొంగయుఁ బ్రాఁచి దనరు;
ఘర్షణనికటములో గనుపట్టుఁ డోసు, నా;
 నోలి, నా వరుసయు నుంకువ తగు;

గీ. నిచ్చకము చిలుకుట దోఁచుఁ బ్రదచ్చన, యన;
నెల్లి, నా ఛత్త్రిమును రేపు నుల్లసిల్లు;
నట్టు, నా గేహతద్దేశనామ మెసఁగుఁ;
బ్రభుగుహాఖ్యలు సామి, నాఁ బరఁగు; నభవ ! 45

**డాక**—ఇది పక్షమునకు (ఱెక్కకు, పక్షియీఁకకు), శౌర్యమునకు పేరు.

**తెమ్మ**—ఇది పెల్లకు (ఎండి పెల్లగిలినపలుచనిమట్టిగడ్డకు), తేమకు (తడికి; ఆర్ద్రతకు; చెమ్మకు) పేరు.

తఱుపు—ఇది వత్సకు (ఏఁడాదివయసు చెల్లిన ఆవుదూడకు), కృత్రిమమణికి (మణివిశేషమునకు; వజ్రమునకు మాఱుగా ఉపయోగించు ఒకదినుసుమణికి) పేరు.

నలి—ఇది నలితిండికి (చిఱుతిండికి), ఒప్పునకు (అందమునకు) పేరు.

దూబ—ఇది అవలక్షణమునకు (దుర్లక్షణమునకు), భగమునకు (ఆఁడుగుఱికి; స్త్రీలరహస్యాంగమునకు) పేరు.

నాఁచు—ఇది దొంగకు, ప్రాఁచికి (పాఁచికి;నీటియందు ఉండెడిపచ్చనితీఁగకు) పేరు.

టోకు—ఇది ఘర్షణమునకు (ఆస్ఫాలనమునకు; ముల్లురు బుజముతో బుజము తాఁకించుటకు), నికటమునకు (సమీపదేశమునకు) పేరు.

ఓలి—ఇది వరుసకు, ఉంకువకు (కన్యాశుల్కమునకు; కన్యార్థము మామకుఁగాని కన్యకకుఁగాని ఇచ్చెడి ద్రవ్యమునకు) పేరు.

త్రచ్చన—ఇది ఇచ్చకమునకు (ముఖప్రీతికై ఆడుప్రియవచనమునకు), చిలుకుటకు (పెరుఁగు మొద లగువానిని తరుచుటకు; మథించుటకు) పేరు.

ఎల్లి—ఇది ఛత్త్రిమునకు (గొడుగునకు), రేపునకు (నేఁటికి మఱుసటిదినమునకు) పేరు.

సట్టు—ఇది గేహమునకు (గృహమునకు), ఉద్దేశమునకు (గృహప్రదేశమునకు; ఇంటిపట్టునకు; నివాసస్థానమునకు) పేరు.

సామి—ఇది ప్రసువునకు, గుహునకు (కుమారస్వామికి) పేరు.

దూబ:—ధూర్తుఁడు-అని (సాంబ.) (చూ.మాన.9.).

నాఁచు:—తీఁగపాఁచి, కుంభిక-అని (శ.ర.) (చూ.నాఁచు.).

ప్రాఁచి:—పాఁచి-(రూపాం.) 'నాఁచు నాఁగను దొంగకుఁ బాఁచి కొప్పు' (వేంక.నానా.119.).

టోకు:—ఇది ఘర్షణార్థమున 'పడు' 'ఇచ్చు' అనువానికి అనుప్రయుక్తమై ప్రయోగములందు కనఁబడుచున్నది (చూ.సూ.ని.). చిల్లరకానిది, మొత్తమైనది'—అని (బ్రౌ.).

ఇచ్చకము:—'....నిచ్చము చిలుకుటయు' దోఁచు ద్రచ్చన యన' (అని) (వావి.పా.)(అపపా.).

రేపు:—'తేపు' (రూపాం.)అని, 'అనిన హేమావతికి నిట్టు లనియె హంస। తేపటికి నేఁటిప్రాయంపుతేపు గలదె। మోహ మెక్కొనఁ జక్కనిముద్దుజాణ।యొకని బిగికౌఁగిటను జేర్చియుంచవలయు' (హంస.1.100.) ఉదాహరించు చున్నది (సూ.ని.). 'రేపు' అనినను ఇట బాధ లేదు. దీనికి 'అచిరకాలాద్యర్థములు' లాక్షణికములు గా నేర్పడినయర్థము లనవచ్చును. 'ఇదిగో ' రేపె తపఃప్రభావమున వాణీశాను మెప్పించి మీ। పదముల్ గైకొన నున్నవాఁడు విబుధప్రత్యర్థి సామాన్యుఁడే' ? (దశా.4.53.) (మొ.).

సీ. రోషజుగుప్సాఖ్య లొప్పు నేవ,యనంగఁ;
గొఱఁత,నాఁ దక్కువ కొఱ్ఱు వెలయు;
స్థైర్యయత్నంబులు చనుఁ గడంక,యనంగఁ;
గొఱ,యన నొప్పు తక్కువ చెఱంగు;
బీడునేలయు ఖైక వెలయుఁ గంచెల, యనఁ;
గ్రోలు,నాఁ బానంబు క్రోవి దోఁచు;
నికటఖఖూరిక ల్నెగడును గరిడి,నా;
నావు పొట్టియు గిడ్డి,యనఁ జెలంగుఁ;

గీ. గుట్టుతే,ళ్లనఁ గంటకక్షుద్రు లగును;
రలరుఁ జుట్టము కూర్మి గాదిలి,యనంగ;
నేతుల,యనంగఁ దగుపాటియింతి చేఁట
లల్లువనితయుఁ దోఁచుఁ;బళ్ళల్లలాట । 46

ఏవ—ఇది రోషమునకు (అమర్షమునకు; కోపమునకు), జుగుప్సకు (రోఁతకు) పేరు.

కొఱఁత—ఇది తక్కువకు (న్యూనతకు; లాఘవమునకు), కొఱ్ఱునకు (శూలమునకు; ఒకదిమసువధసాధనమునకు) పేరు.

కడంక—ఇది స్థైర్యమునకు (ధైర్యమునకు; కష్టసుఖములకు కలఁగ కుండుటకు),

**యత్నమునకు** (ప్రయత్నమునకు; ఉత్సాహమునకు) పేరు.

**కంచెల**—ఇది బీడునేలకు (దున్ననిభూమికి), త్రైకకు (అవికకు-అయికకు; ఆఁడువారిచౌక్కాయకు) పేరు.

**క్రోలు**—ఇది పానమునకు (త్రాగుటకు), క్రోవికి (నాళమునకు; గొట్టమునకు) పేరు.

**గరిడి**—ఇది నికటమునకు (సమీపమునకు), ఖళూరికకు (సాముకూటమునకు; సాము నేర్చుకొనుస్థలమునకు) పేరు.

**గిడ్డి**—ఇది ఆవునకు, పొట్టికి (గిడ్డకు; పొట్టిదానికి) పేరు.

**కుట్టుతేళ్లు**—ఇది కంటకములకు (ముండ్లకు), క్షుద్రులకు (అల్పులకు; నీచులకు) పేరు

**గాదిలి**—ఇది చుట్టమునకు (బంధువునకు), కూర్మికి (ప్రేమమునకు) పేరు.

**ఏతుల**—ఇది తగుపాటియింతికి (సాధారణస్త్రీకి), చేట లల్లువనితకు (చేట లల్లుట వృత్తి గా కలఒకజాతిమనుష్యస్త్రీకి) పేరు.

రోషము:—'మాత్సర్యము'-అని (సూ.ని.) (చూ 'ఏప'4 అర్థము ) 'క్రోధః కోపో ఽమర్షరోషౌ రుషా రుట్ క్రుత్ క్రుధా స్త్రియః' అని (వైజ భూమి.బ్రా.).

కొఱఁత:—'....గొఱఁత। యనఁ దక్కువకును గొట్టున కగుఁ... ' (వేంక. నానా. 110.). '...కొఱుకుఁ గడమ కొఁ గొఱఁత యనఁగ' (సాంబ. నానా.86.). (ఆం.భా.) లోని 'తక్కువ'శబ్దము అల్పత్వము అర్థము గా కలది (తక్కువ-అల్పత్వము)-'ధర్మతనయాద్యులై ననీతమ్ములకును । ధార్తరాష్ట్రులకును నీవ తగువిభుండ । వేలు మీలోక మెల్ల నీ కేల రాధ । కొడు కితం డనుతక్కువ కొడుకుఁగుట్టు' (భార ఉద్యో. 4.59 ). 'ఉక్కును వస్త్రబలము మీఁ । కెక్కుడియది సాల రైతి రిందఱు నని న ।య్యెక్కరుఁ గావఁగ మీ రీ । తక్కువ కోర్చితిరి మిమ్ముఁ ద క్కన నేలా' (భార.ద్రోణ.2,266 మొ.). ఇఁక (సాంబ.) 'కడమ' అర్థ మను చున్నది దీనికి. అది(కొఱఁత-'వెలితి-లోటు'-)అనఁబడెడిది. దీనికి (అర్థాం.) అన

వలసినది. (ఆం.భా.) 'కొఱఁత'కు క్రిందిపద్యముకొఱఁత (ఉదా.) కాఁ దగి యున్నది. 'ఘర మై తోఁచుకుటుంబరక్షణకుఁ గాఁ బ్రాల్మాలి చింత న్నిరం। తరతాళీదళసంపుటప్రకరకాంతారం బునం దర్థపుం।దెరువాటుల్ దెగి కొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా। విరసుం డై కొఱఁతం బడుం గుకవి పృథ్వీభృత్సమీపక్షితిన్' (మనుచ. 1.9.) (మొ.). 'ఇట్టివి నిర్ధారకములు గా నున్నను (దీని) 'రూప మింకను విచార్య'మను చున్నరి' (సూ.ని.). ఒకటికి రెండు మూఁడు నిఘంటువులు 'కొఱ్ఱు'నకు పర్యాయము గా, 'వధసాధనవిశేషమును'జెప్పు 'కొఱఁత' యొకటి కల దను చున్నవి. అనేకప్రయోగములు ఇది యిట్టి దని నిఘంటువులతోపాటు తామును వచించు చున్నవి. (మనుచ. మొ.) శ్లేషభంగితో నిర్ధారకము గా 'కొఱఁత' ఇది యని ఉద్ఘోషించు చున్నవి. 'కొఱఁతవేయు'అనురీతిని లోక(వ్యవ.)ప్రత్యక్షదృష్ట మగు చున్నది. ఇంకను విచార్య మే మున్నది? ఈ'కొఱఁత'కు 'కొఱ్ఱు'నకు ముడి వేసికో నక్కఱ లేదు. ఇది వే ఱగు నొకదేశ్యశబ్ద మన వచ్చును. పై(మనుచ.) ప్రయోగమున 'కొఱుత' ఉండవలయు నని ఒకఁ డనినమాట, కేవల సాహసమూలకము.((బౌ.)'కొఱఁత'కై న (వ్యవ.) 'కొఱ్ఱు' అను చున్నది. 'కొఱ్ఱు'కు 'కొఱు' (రూపాం.) ' ..యదువృష్ణిభోజాంధకవీరవరులు । గొఱ్ఱుల నిడుఁడు. ..' (వి. పు.7.473.).మొ. 'నెఱి మాలి బందె వెట్టిన। నఱిముఱిఁ జంపినను గజము నశ్వము ద్రుము చ్చై చ్చి। పఱిగొనిన నట్టివారలఁ । గొఱులఁ దిగిచి చంపు టొప్పుఁ గువలయపతికిన్' (విజ్ఞా, ప్రా.104 మొ.) (దృష్టములు.)

కొఱ:—దీనికి 'అందము'అను-అర్థము (సూ.ని.శ.ర.లు) ఇచ్చినవి కావు.

క్రోలు:—ఈకృదంతరూపమును 'పానము' అనునర్థమున (సూ.ని.శ.ర.లు) గ్రహింప లేదు.

కుట్టుతేళ్లు:—((బౌ.) 'కుట్టుపేళ్లు'అని గ్రహించి, క్షుద్రశత్రువులు, ముండ్లున్న-అని (ప్రాఁత ప్ర.పా.) (చూ.నూని.). (వివరణమునకై చూ.నా తొలిపలుకు.).

గిడ్డి:—'పొట్టి'అనునర్థమున 'గిడ్డ'అని (సాంబ.) అను చున్నది. '.. .కుఱుచ ఱింగణ గిడ్డ గిఱుక గుజ్జు । పొట్టి యన వామనాఖ్యలు' (మాన.5.).

సీ. సొన్నయుఁ బెద్దడో ల్చను గంగడో, లనఁ;
బడగ, నా పెక్కెము; ఫణము దనరు;
నస్థిమయూరాఖ్య లలరు నెమ్ము, లనంగఁ;
బసి, యన ధేనువు పవన మెసఁగు;

మందురోష్ణీషము లనను బాగా, యన;
గుఱుతు పక్కియుఁ దగుఁ బులుఁగు, నాఁగ;
సస్యభేదాంబుధు లనుఁ బాలవెల్లి, నా;
బాట, నా దిక్కు త్రోవయుఁ జెలంగుఁ;

గీ. గుసుమితామ్రంబులును మచ్చగుఱ్ఱములును
మనుచు నుండును బూచినమావు, లనఁగఁ;
గ్రొత్తము, ట్టన నూలుఁబోఁగును సమర్త
పొలుచును వినంగ; శ్రీమాతృభూతలింగ! 47

గంగడోలు—ఇది సాస్నకు (గళకంబళమునకు; ఆవులకును, ఎద్దులకును మెడక్రింద వ్రేలాడెడి పెద్దతోలునకు), పెద్దడోలునకు పేరు.

పడగ—ఇది టెక్కెమునకు (పతాకమునకు; ధ్వజమునకు), ఫణమునకు (సర్పము యొక్క పడగకు) పేరు.

నెమ్ములు—ఇది ఎముకలకు, నెమళ్లకు పేరు.

పసి—ఇది ఆవునకు, పవనమునకు (గాలికి) పేరు.

పాగా—ఇది మందురకు (గుఱ్ఱపుసాలకు), ఉష్ణీషమునకు (తలపాగాకు) పేరు.

పులుఁగు—ఇది గుఱుతునకు, పక్కికి (పక్షికి) పేరు.

పాలవెల్లి—ఇది సస్యభేదమునకు (ఒకదినుసుశాలిధాన్యమునకు), సముద్రమునకు పేరు.

బాట—ఇది దిక్కునకు, త్రోవకు పేరు.

పూచినమావులు—ఇది కుసుమితామ్రములకు (పుష్పించిన మామిళ్లకు), మచ్చ గుఱ్ఱములకు (తెల్లపొడలు గల గుఱ్ఱములకు) పేరు.

క్రొత్తముట్టు—ఇది నూలుఁబోఁగునకు (నూలుదారమునకు), సమర్తకు (తొలి రజస్సునకు; స్త్రీలతొలిఋతువునకు) పేరు.

నెమ్మి:—'ఎమ్మి'కి 'నెమ్మి' అను 'అర్థము' (సూ ని, శ. ర లు) ఈయలేదు. (బ్రౌ.) 'ఎమ్మి' లేక 'నెమ్మి'—అనగా మయూరము' అను చున్నది దానికి—ఈ ('ఆం.భా.') ఆధార మనవచ్చును.

[ఎమ్మి-బ.ఎమ్ములు. ఎమ్మ (ఎమికె) బ. ఎమ్ములు] ప్రయోగ మి ట్లున్నది-'పెల్లుగ మటి యును డెందము। చిల్లులు వో నేసె నతఁడు చిదురుపనెమ్మల్ । మెల్లనె ధైర్యరమాసతి। జల్లింపఁగఁ బట్టుపెద్దజల్లెడ యనఁగన్' (చంద్రా. 6.85.).

సస్యభేదము.—ధాన్యభేదములను కొన్నిటిని (సాంబ.) ఇ ట్లుదాహరించినది—'నాగకేసరులు చెన్నంగులు కురువులు, భోజనప్రియములు రాజనములు।గన్నేరు లిబ్బపూ ల్గంగాజలంబులు, మట్టకారులు పూలమంజరీలు। పెద్దవంకలు పాలవెల్లులు ముత్తెపు। సరులు సంబావులు చంద్ర వంక। లేనుఁగుకొమ్ములు మానికములు వన్నె, పూలు సీతాబోగము లన శాలిధాన్య మెసఁ గును' (మాన.52.).

అంబుధి:—'పాలవెల్లి-క్షీరాబ్ధి'-అని (శ.ర.).

క్రొత్తముట్టు:—'వడుక నారంభించినప్పుడు ఏకుననుండి పురి లేక చాఁగఁ దీసి కదురున కంటిం చెడినూలు' అని (శ.ర.).

సీ. మొసలియు దేగయుఁ బొల్చు బైరి, యనంగ;
 రాజరాత్రులు రేలు, నాఁ జను నిలఁ;
ప్రణతియుఁ గౌముది పరఁగు వెన్నెల, యనఁ;
 బూవు, నా సొగసును బుష్ప మొప్పు;
వేగంబు పాళెము వెలయు వేళ, మనంగ;
 పైరవేగము లగు వేర, మనఁగ;
లూటి, నా దవుడపుండును దండువయుఁ దోఁచు;
 నాట, నాఁ గ్రీడ నాట్యమ్ము చెలఁగు;
గీ. వ్యాసటీక దేగియుఁ జెలంగు వేసడ, మనఁ;
 జెల్లుఁ బైమేడ యొప్పు మేలి, ల్లనంగ;
 మెఱుఁగు రిక్క, లనంగను బరఁగు మిన్న
 నైనచుక్కలు పగడంబు; నచలవాసి। 48

బైరి—ఇది మొసలికి, డేగకు (బయిరికి; ఒకజాతిడేగకు) పేరు.

రేలు—ఇది రాజులకు, రాత్రులకు పేరు.

వెన్నెల—ఇది ప్రణతికి (ఒకవిధ మగు నమస్కారమునకు), కౌముదికి (చంద్రికకు; చంద్రకాంతికి) పేరు.

పూవు—ఇది సొగసునకు (అందమునకు), పుష్పమునకు పేరు.

వేళము—ఇది వేగమునకు, పాళెమునకు (శిబిరమునకు; దండు విడిసినచోటికి; సేనానివేళమునకు) పేరు.

వేరము—ఇది వైరమునకు (పగకు), వేగమునకు పేరు.

లూటి—ఇది దవుడపుండుకు, దండువకు (దండుగకు; ధనాదులవలని నష్టమునకు) పేరు.

ఆట ఇది క్రీడకు, నాట్యమునకు పేరు.

వేసడము—ఇది వ్యాసటికకు (కంచరగాడిదకు), డేగకు (ఒకజాతిడేగకు) పేరు.

మేలిల్లు—ఇది ఒప్పునకు (అందమునకు), పై మేడకు (చంద్రశాలకు; మేడచివరి గదికి) పేరు.

మెఱుఁగురిక్కలు—ఇది మిన్నలైనచుక్కలకు (శ్రేష్ఠములైనచుక్కలకు; 'తళతళ' యనుకాంతి గలనక్షత్రములకు), పగడములకు (పవడములకు) పేరు.

రేలు:—రేయి (ఏ.) (రేలు.బ.) (చూ.బాలవ్యా.అచ్చి.21.సూ.). ఇఁక 'రాజులు' అనెడి-అర్థమున 'ఱేఁడు' అనుదానికి 'ఱేలు' అను (బ.) రూపము గల దని (ఆం.భా.) అను చున్నది. (బాలవ్యా.) 'ఱే' శబ్దమునకు (బ.రూపములు) గా 'ఱేఁడులు' 'ఱేండ్లు' అనునవియే సాధువులను చున్నది (చూ.అచ్చి.8సూ.). అథర్వణుఁడు 'వర్ణ స్యాన్త్యస్య లోప స్స్యాల్లలయోః ప్రాయశః క్వచిత్' అని దీనిని సాధు వనినాఁ డనవచ్చును. (సూ.ని.) దీనిని 'ఱే' శబ్దమునకు (బ.రూ.) గా ప్రదర్శించుట లేదు. (బ్రౌ.) 'రేలు' రాజులు, రాత్రులు (O g.) అనినది. ప్రయోగమమాత్రము దీనికి ('ఱేలు' (రాజులు) అనుదానికి) చూప లేదు. (సాంబ.) (ఆం.భా.) తోపాటు తానును 'ఱేలు' ఉదాహరించినది 'ఱేలు దొరలు నేల యేలుదంటలు వెన్నుని, వలబుజమునఁ గలవారు రాచవారు ఱేఁడులు...' (మాన.2.) (అని.). లఘ్వలఘురేఫలకు అభేద మొనర్చి (ఆం.భా.) 'రేలు' అని నిర్దేశించినది 'రలయోర్డలయో స్తద్వత్' అనురీతిని. సంస్కృతశబ్దములకుఁ గూడ (ఆం.భా.) ను ప్రమాణముఁ గాఁ గొను (సూ.ని.) దీనిని

గ్రహింపక పోవుట యుక్త మనిపింప లేదు. 'దుజ్జు' వికల్ప మని (బాలవ్యా.) దీనిని సాధించుకొన వలయును ; ప్రయోగ ముండక (ఆం.భా.) దీనిని గ్రహింపదు. ప్రయోగపరామర్శము ఆవశ్యకము.

['రాజరాత్రులు రేలు నాఁగఁ దనరు' (అపపా.). అందులకే పైరీతిని సవరింపఁబడిన దిది.]

వ్యాసటిక:—ఇట (బ్రౌ.) 'వ్యాసడము' లేక 'వ్యాసరము' అనఁగా 'వ్యాసరిక' (ఆం.భా.) అను చున్నది (చూ.అను.). 'వేసటము' గ్రహించి 'వ్యాసటిక దేగయుఁ జెలంగు వేసట మన' అని (ఆం భా.పా.) ను ప్రదర్శించిన దిది. ఇచ్చట ఆం.భా. అనుచు ఇది ప్రదర్శించు చున్న 'వ్యాసడము' 'వ్యాసరము' 'వ్యాసటిక' లనుబట్టి 'వేసరము దేగయుఁ జెలంగు వేసడ మన' అనెడిరీతిని (ఆం భా.పా.) ఉండ నగునా ? అనిపించు చున్నది. 'వ్యాసడము, వ్యాసరము' 'వేసడము, వేసరము' అనువాని కైన ప్రమాదము లేమో ; (వై జ.)-'అశ్వతరః పునః ; స్యాద్వేసరో వేగసరః' (అని), 'కంచరగాడిద' అనునర్థమున 'వేగసరము' అనుదానికి (రూపాం.) గా 'వేసరము' కల దను చున్నది. (వేసరము సం. వేసడము (వై.) అని నిఘంటువు లను చున్నవి. 'వేసటము' 'వ్యావటిక' అనువానిని(సూ.ని.శ.ర.లు) గ్రహింప లేదు. గ్రహించిన (బ్రౌ.) 'వేసటము'నకు ప్రయోగము చూప లేదు. కేవలము (ఆం.భా.)ప్రమాణ మను చున్నది. వై జ. మొ.(సం.ని,)గూడ'వ్యాసటిక'గ్రహింప లేదు. వేసడము-రెండర్థములందును ప్రయోగ ప్రసిద్ధి కలది. 'డేగకు' పర్యాయముఁ గా 'వేసడము' నే (ఆం.సం.,సాంబ.) ఉదాహరించు చున్నవి (ఆం.సం.తిర్య.16.,సాంబ.తిర్య.79,). ఐనను జాలినంతపరిశోధనము జరపక ఊహాగమ్యము గా,దృష్టపారము త్రోసిరా జనుటకు సాహసింప లేదు.

సీ. సమమిత్త్రసంజ్ఞ లై చనుఁ బోటిగాఁ, డన;
ముకుళంబు నిగ్గు పూ మొ, గ్గనఁ దగుఁ;
బునరర్థరజతము ల్వొల్చు వెండి, యనంగఁ;
బరఁగు జీనియు గుంట పల్ల, మనఁగ;
ప్రూఢధౌతవస్త్రంబు లమరును మడుఁగు, నా,
నధరపాదాభిధ లడు, గనఁ దగుఁ;
బొలమరి, యనఁగఁ గాఁపును వితమరి దోఁచు;
భగినియుఁ దల్లి యప్ప,యన వెలయుఁ;

గీ. దావి కట్టినయట్టి చందనపుచెక్క-
పొడియుఁ గమ్మయు జా, బనఁ బొల్చి యుండుఁ;
జుఱుకు, లనఁ జెట్లచీమలు నురులు దోఁచు;
భూతిలసితాంగ! శ్రీమార్కభూతలింగ! 49

పోటిగాఁడు—ఇది సమునకు (సదృశునకు; తనతో సాటి యైనవానికి), మిత్త్రునకు (చెలికానికి; స్నేహితునకు) పేరు.

ముకుళము—ఇది నిగ్గునకు (గొప్పకాంతికి), పూమొగ్గకు పేరు

వెండి—ఇది పునరర్థమునకు ('మఱియు' అనుటకు), రజతమునకు పేరు.

జీని—ఇది గుంటకు, పల్లమునకు (గుఱ్ఱపుజీనునకు) పేరు.

మడుఁగు—ఇది హ్రదమునకు (తటకాదులనడుమ లోఁతైనసీటిపట్టునకు), ధౌతవస్త్రమునకు (పరిశుద్ధ మైనవస్త్రమునకు) పేరు.

అడుగు—ఇది అధరమునకు (క్రిందిప్రదేశమునకు), పాదమునకు పేరు.

పొలమరి—ఇది కాఁపునకు (సేద్యకానికి; కృషీవలునకు), వితమరికి (సమర్థునకు; కార్యదక్షునకు) పేరు.

అప్ప—ఇది తల్లికి, భగినికి (తోడఁబుట్టువునకు; అక్కకు) పేరు.

జాబు—ఇది తావి కట్టినచందనపుచెక్కపొడికి (సువాసన గల మంచిగంధపుచెక్కచూర్ణమునకు), కమ్మకు (పత్త్రికకు; ఉత్తరమునకు) పేరు.

చుఱుకులు—ఇవి చెట్లచీమలకు (చెట్లమీఁద ఉండు ఎఱ్ఱనిచీమలకు), ఉరులకు (ఉరిత్రాళ్లకు) పేరు.

ముకుళము:—సంస్కృతశబ్ద మిది (అం.భా.) 'అచ్చతెలుఁ'గను చున్నది. ఇట్టివి పూర్వ ముదాహృతములు. 'ముకులము'న కైన(వికృ.'మొకులము') అనుట అనుచితము. అట్టిది అప్రసిద్ధము. ఒకప్పుడు 'ముకుళ'శబ్దమున కైన (వికృ.మొగడ) కలదుగాన,దాని కైన (రూపాం.) 'మొగళము'ఇది అని సవరింపవచ్చు ననిన,ఇది అంతయు వృథాపరిశ్రమము, పని లేనిపని-అని తోఁచినది.

నిగ్గు:—'ద్యుతికిఁ జెలు వారు డాలు। మెఱుఁగు జిగి నిగ్గు నిగ తళుక్కు మిన్న రంగు। కళుకు మినుకు చికిలి మించు వెలుఁగు నాఁగ' (సాంబ.స్థా.60.). ఇది దీనికి కాంతి అర్థ మనినది. (బ్రౌ.'ఉత్కృష్ట మగుకాంతినికరమున్నూ .. దీపిక. నికర మగుకాంతి-రేట్' అను చున్నది. ఆం.భా. ప్రసిద్ధ మగునర్థ మగుటను దీనిని వదలిన దనిపించును. లేదా। దీనికి 'కిరణము' అనెడి-అర్థ మిచ్చినది (చూ.1 82.). ఘనీభూత మగుకాంతియే 'కిరణము'. 'దానిచే నిది గతార్థ'మని తలఁచి ఉండును।

అప్ప:—(ఆం.సం,వేంక.సాంబ.మొ.) చాలవఱకు (ఆం.భా.) ను అనుసరించియే నానార్థవర్గ నడుపుకొనినవి.' నప్ప యనఁగఁ దండ్రి కక్క కమరు ...' (సాంబ.నానా.93.). 'భగినికి జనకునకును నాహ్వాయము దనరు। నప్ప యనఁగ.. .' (ఆం.సం.నానా.25.). ఇట్లే (వేంక. నానా.105.మొ.). (వెండి,కైవడి,పాగ,మొ.) ఎన్నో। ఇందులకు నిదర్శనములు.

సీ. ఓడ భిక్షాభేద మొప్పును జోగు, నా;
నలుఁగు, నాఁ బరివాహ మాయుధ మగు;
షట్సంఖ్య నూఁగారుఁ జను చుండు నారు, నా;
నాలు, నా ధేనుభార్యాఖ్య లమరు;
విటతాట, మనఁ గీళ్లు విఱిచి పెట్టుటయు ద
య్యము పట్టి యుండుట యమరి యుండు;
సత, యనఁ బల్లము సప్తసంఖ్య చెలంగు;
నాశయు వృత్త మౌ నక్కఱ, యన;

గీ. నుదకసంభూతి బల మగు నూట, యనఁగ;
నుపహతియుఁ దావు నె, ట్టన నొప్పు చుండుఁ;
జంద్రనవనీతఘుటికలు చనును వెన్న
ముద్ద, యని పల్కు; శ్రీమాతృభూతలింగ। 50

జోగు — ఇది ఓడకు, భిక్షాభేదమునకు (దేవతాదులకు మ్రొక్కుకొని అందులకై ఎత్తెడు తిరిపెమునకు) పేరు.

అలుఁగు — ఇది పరివాహమునకు(చెఱువులు లో నగువానిలో ఎక్కువ గా ఉండునీరు పోవుటకై ఏర్పఱచినదారికి (గండికి), ఆయుధమునకు పేరు.

ఆరు—(అఱు) ఇది షట్సంఖ్యకు (ఐదునొకటికి, (అరు) నూగారునకు (బొడ్డు క్రింది లోమరేఖకు; రోమావళికి) పేరు.

ఆలు—ఇది ధేనువులకు, ఆవులకు, భార్యకు పేరు.

విటతాటము—ఇవి కీళ్లు విఱిచి పెట్టుటకు (కీళ్లు కీళ్లు విఱిచి వేయుటకు; విటతాటమునకు), దయ్యము పట్టి ఉండుటకు (పిశాచము ఆవేశించి ఉండుటకు) పేరు.

పత—ఇది పల్లమునకు (నిమ్నమునకు), సప్తసంఖ్యకు (ఆఱునొక్కటికి; 'ఏడు' అనుసంఖ్యకు) పేరు.

అక్కఱ—(అక్కఱ) ఇది ఆశకు (అపేక్షకు; కోరికకు), వృత్తమునకు (ఆంధ్రభాషలోని ఒకవిధ మగుజాతిపద్యమునకు) పేరు.

ఊట—ఇది ఉదకసంభూతికి (ఊరెడునీటికి; లోపల నుండి పై తోఁచుజలమునకు), బలమునకు పేరు.

నెట్టు—ఇది ఉపహతికి (నాశనమునకు), తావునకు (ఉనికిపట్టునకు; నివాసస్థానమునకు) పేరు.

వెన్నముద్ద—ఇది చంద్రునకు, నవనీతఘుటికకు (ఉండగా (ముద్దగా) చేసిన వెన్నకు) పేరు

ఆరు:—ఇది మొదటి-అర్థమున 'అలఘురేఫము(ఱ)' కలది. రెండవ అర్థమునందు 'లఘురేఫము-(ర)' కలది. అర్థద్వయసంఘటనమునకై రెండిటికి అభేదము. (ఇట్టిదే 'అక్కఱ' మొ.).

ఆలు:—ఇది 'ఆవులు' అను-అర్థమున (బహు.) (చూ. బాలవ్యా. అచ్చి. 22 సూ.). 'భార్య' అను-అర్థమున (ఏ.) (వృత్తిని ఇది స్త్రీమాత్రవాచకము.) అర్థద్వయసంఘటనమునకై రెండిటికి అభేదము.

అక్కర:—(వృత్తము) ఇట వృత్తశబ్దము పద్యపరము. 'వృత్తం పద్యే చరిత్రే' అని (అమ.). అక్కరలు 'జాతులు'గా పేర్కొనఁబడినవి లక్షణకర్తలచే. 'కందభేదము లాఱు. . మధ్యమాక్కరలు నైదు దీపించు జాతులు ' ( అప్ప. 4.260. ). ఇవి ఐదు - 1. మహాక్కర,

2. షడ్వ్యాక్కర. 3. మధురాక్కర. 4. అంతరాక్కర. 5, అల్పాక్కర. 'మహామధ్యా। మధురాంతరాల్పపూర్వ। గ్రథితాక్కర లైదు దనరు గ్రంథములందున్'అని(అప్ప.4,275). వీనిలక్షణములకై (చూ.276.280.).

సీ. కలుషదేశమ్ములు చెలఁగుఁ గలం, కన;
నెద, యన భయమును హృదయ మెసఁగు;
బండికుంపటి చిల్కు పరఁగు గొండ్లె, మనంగ;
నొరయిక కోశంబు నొర, యనఁ దగు;
నారోహణశ్రేష్ఠ మలరు నెక్కుడు, నాఁగఁ;
గలుపు, నాఁ బెరుఁగును గాద మొప్పు;
ధనురగ్రగుణములు దగు గొనయా, బన;
నొప్పుఁ గచాటను ల్గొప్పు, నాఁగఁ;
గీ. బంట యొబ్బిడి నేయించుపని వసంత
మును విభాసిల్లు చుండు నామని, యనంగ;
నానవా, లనఁగాను జిహ్నంబుఁ గాఁచు
పాలు నయి యొప్పు చుండును; నీలకంఠ! 51

కలంకు—ఇది కలుషమునకు(కాలుష్యమునకు; మాలిన్యమునకు; జలాదులు కలఁగఁ బాఱుటకు), దేశమునకు (ప్రదేశమునకు) పేరు.

ఎద—ఇది భయమునకు, హృదయమునకు పేరు.

గొండ్లెము—ఇది బండికుంపటికి (ఒకచోటినుండి మఱియొకచోటికి తీసికొని వెళ్లుటకు ఉపయోగించెడి కుంపటికి), చిల్కునకు; తలుపు రా కుండ తగిలించెడి ఇనుపగొలుసునకు) పేరు.

ఒర—(ఒఱ) ఇది కోశమునకు (కత్తి ఉంచుకొనెడి ఒఱకు), (ఒర) ఒరయికకు (రాపిడికి; ఘర్షణమునకు) పేరు,

ఎక్కుడు—ఇది ఆరోహణమునకు (వాహనమునకు), శ్రేష్ఠమునకు (అధిక మైన దానికి) పేరు.

కలుపు—ఇది పెరుఁగునకు (మిశ్రదధికి; నీళ్ల లో నగువానితో కలిపినపెరుఁగునకు), గాదమునకు; పైరు లో నగువానిలో కలసి మొలచినగడ్డి మొద లగుదానికి) పేరు.

గొనయము—ఇది ధనురగ్రమునకు (వింటికోపునకు; వింటికొనకు), గుణమునకు (వింటినారికి;అల్లెత్రాటికి) పేరు.

కొప్పు—ఇది కచమునకు (జుట్టునకు; శిరోజముల సమూహమునకు; కేశపాశము నకు), అటనికి (వింటికొనకు) పేరు.

అమని—ఇది పంట ఒబ్బిడి చేయించుపనికి (పంట కోసి జాగ్రత్త గా పెట్టించు టకు), వసంతఋతువునకు) పేరు.

ఆనవాలు—ఇది చిహ్నమునకు (గుఱుతునకు), కాఁచుపాలునకు (ఇగురఁ గాఁచిన క్షీరమునకు) పేరు.

కలుపు:—'కలు పన మిశ్రదధి యొప్పు'అని (ఆం.భా.) (2.259.)లో వచించినది. ఇట దానినే సామాన్యవివక్షతో 'పెరుఁగు'అను చున్న దనిపించును. ఇతరనిఘంటువులు గూడ (నానా. వర్గ')లో దధిసామాన్యమునకు నామమును గానే దీనిని ఉదాహరించు చున్నవి - 'కలు పనఁ బే రగు దధికిన్' (ఆం.సం.నానా.1.). 'కలు పన మడిలోనికసువును బెరుఁగు నౌ' (సాంబ. నానా.93.). ఇట్లే (వేంక.నానా.109.). శ.ర.ప్రయోగ మొకటి ఇ ట్లిచ్చినది 'కలుపు న్వడియం బులు చారు లూరుఁగా । యలు కలవంటకాలు పరమాన్న మిడెన్ లలితాంగి వానికిన్' (తారా. 3.14 ). ఇట ఔచిత్యమునుబట్టి 'మిశ్రదధి' అర్థ మనుట సముచితము గాదు.(శ.ర.) వచించు చున్నట్లు'పెరుఁగే'అర్థ మన వలయును అప్పుడు ఆం.భా (అర్థాం.) గా దీనిని వచించిన దన వలయును. (శ.ర.) ఇచ్చినను(సూ.ని.) ఈప్రయోగమును దీనికి ఇచ్చుట లేదు. దీనినిఁబట్టి ఏదేని (పారాం.) ఇట ఉండు ననిపించు చున్నది. (ముద్రి.ప్ర.) లో 'కలుపు ల్వడియం బులు ...' అనురీతి నిది గానవచ్చు చున్నదిగూడ.

కచము:—ఈశబ్దమునకు'శిరోజములు'అను-అర్థమునే (అమ.మొ. ఇచ్చు చున్నవి 'చికురః కుస్త లో వాలః కచః 'కేశ శ్శిరోరుహః' (అమ.). 'కేశా శ్శిరసిజాః కచాః' (వైజ. పాతా. భూతా.). మొ. 'కొప్పు'నకు తెలుఁగువ 'కబరి'అనెడి-అర్థమే కానవచ్చు చున్నది. (ఆం.భా.)లోనియిచ్చటి 'కచ' శబ్దము లాక్షణికము గా 'కేశసమూహము, ధమ్మిల్లము; కబరి' అనెడి-అర్థము కల

దనిపించును. 'కొ ప్పనంగను వింటికొనకును గబరి కొ' అని (సాంబ.నానా.93.). '. గొ ప్పనఁ దగుఁ జాపాగ్రము।నొప్పగు ధమ్మిల్లమును గృహోపరియు'(ఆం.సం.నానా.13.). మొ.

సీ. కొమ్ము,నా వాద్యభేదమ్మును శృంగ మౌఁ;
గందు,నా శిశుకళంకములు దోఁచుఁ;
చిలుముహా,లనఁగను చిలుము పట్టినకత్తి
యులిపికట్టె యనఁ జె న్నలరు చుండు;
ధౌతవస్త్రంబు కేదార మౌ మడి,యనఁ;
గుండు,నాఁగను హయగోళము లగు;
వ్యంజనశ్వాసము ల్వఱలు నూరు,పనంగ;
వనిత శాఖయుఁ గొమ్మ,యనఁ జెలంగుఁ;

గీ. గై వడి,యనంగఁ దగు రీతి కరజవంబు;
రాయి సారాయి కల్లు,నా రహి వహించుఁ;
గమ్మ,యనఁగను జాబును గర్ణభూష
బొల్చు చుండును; శ్రీమాతృభూతలింగ ! 52

కొమ్ము—ఇది వాద్యభేదమునకు (ఊఁదెడి ఒకదినుసు వాద్యమునకు), శృంగమునకు (ఎద్దు లో నగువాని కొమ్మునకు; విషాణమునకు) పేరు.

కందు—ఇది శిశువునకు (బిడ్డకు), కలంకమునకు (నల్లనిమచ్చకు) పేరు.

చిలుముహాలు—ఇది చిలుము (త్రుప్పు) పట్టినకత్తికి, ఉలిపికట్టెకు (ఉలిపిగొట్టునకు; దుర్మార్గునకు) పేరు.

మడి—ఇది ఇది ధౌతవస్త్రమునకు (పరిశుద్ధమైనవలువకు), కేదారమునకు (వరిమడికి) పేరు.

గుండు—ఇది హయమునకు (గుఱ్ఱమునకు), గోళమునకు (ఉండకు) పేరు.

ఊరుపు—ఇది వ్యంజనమునకు (వ్యంజనవిశేషమునకు; ఒకవిధము గా వండిన కూరకు), శ్వాసమునకు (ఊపిరికి; నిట్టూరుపునకు) పేరు.

కొమ్మ—ఇది వనితకు (స్త్రీకి), శాఖకు (చెట్టుకొమ్మకు) పేరు.

కైవడి—ఇది రీతికి (విధమునకు), కరజవమునకు (హస్తలాఘవమునకు) చేతి వడికి (చేతిచుఱుకునకు) పేరు.

కమ్మ—ఇది జాబునకు (లేఖకు; ఉత్తరమునకు), కర్ణభూషకు (చెవియాకునకు; చెవికమ్మకు) పేరు.

మడి:—'మడుఁగు మడు వనంగ నడరు శుచికి' అని (సాంబ.ని.మాన.28.).

ఊరుపు.—ఊర్పు (రూపాం.) 'కూరకు మఱి శ్వాసకుఁ జెలఁగు నూ ర్పన' (సాంబ. ని. నానా. 91.).

కమ్మ:—'కమ్మ యనఁ బత్త్రికకుఁ జెవికమ్మ కెనయు' (సాంబ,నానా.93.).

కొమ్ము:—(వాద్యవిశేషము) ఇది కంచుతో నిర్మింపఁబడిన యొకవాద్యము. 'కంచుకొమ్మ' అనునది దీనికి పర్యాయము '.. గొ మ్మనఁ బసరపుఁగొమ్మునకును । గంచుకొమ్మునకు రాణించుఁ ' (వేంక.నానా.109.). 'ముందటను గంచుకొమ్ము మి న్నంది మొరయ' (వైజ. 4.78.) (చూ.సూ.ని.).

ఉలిపికట్టె:—'ఉలిపిగొట్టు' 'ఉలిపి' దీనికి పర్యాయములు (చూ.బ్రౌ.శ.ర ). 'ఉలిపి' ఒకానొక చెట్టు దీనికట్టె కాల్చినయెడల చిటచిట లాడును. 'ఉలిపివంటివాఁడు- తులువ, దుర్మార్గుఁడు' అని (సూ.ని ) (చూ.ఉలిపి,). 'ఊ రందఱది యొకదారి ఉలిపికట్టె దొకదారి' అని లోకోక్తి, 'పొగరుఁబోతు' అనునది దీనికి మఱియొకయర్థము 'పలుపిత్తు పలుగాకి ప్రాడ్వాకుఁ డుచ్ఛిష్ట, మొందుసుద్దులమారి యులిపికట్టె' (హంస.5.113.) (చూ.సూ.ని.) ఈయర్థము దీనికి ఛాయ గా ఏర్పడినలాక్షణికార్థ మనిపించును 'పలువిత్తు పలుగాకి ప్రాడ్ఫాయి యుచ్ఛిష్ట, మలప సుద్దులమారి యులిపికట్టె' (అని 1964వావి.ముద్రి.).

కేదారము:—'కేదారః కేదరః క్షే (ముర్వరా )' (వైజ.భూమి.వైశ్యా ). (కేదారము-వరి పండునేల' అని (గురు.) 'నమితాః ఫలభారేణ నమితాః శాలిమఞ్జరీః । కేదారేషు చ పశ్యన్తః కేదారేషు వినిస్పృహాః' (చూ.సుధా.టిప్పణి)

కైవడి:—'కైవడి యనఁ బోలికకుఁ జేతివడికిఁ జె, లంగు. ' (వేంక.నానా.111.). '.....జేవడికిఁ బోలిక కెసంగుఁ గైవడి యన' (సాంబ.నానా.90.). 'పోలిక' అనునది దీనికి

అర్థ మను చున్న వివి. 'విధము' అర్థ మను చున్నది (ఆం.భా.). ఒక ప్రయోగ మి ట్లున్నది-'అతనిమేను కుంతియట్టులకైవడి యరయ' భార.శాం.1.12.) .ఇట 'అట్టులు' వాక్యా లంకారము గా (అర్థవిశేషము లేకయే) ప్రయుక్తము (చూ.సూ.ని.అట్టులు). ఆం భా. ఉపమా వాచకము గా పూర్వ ముదాహరించినది దీనిని-'కైవడి కైవశి కయివడి కొడువు ....పోలిక యనఁగఁ బొల్పొందు నుపమపేరు' (2.302.). ఆం.భా. ఇచ్చిన రెండర్థములకు (ఉదా.) ఇ ట్లున్నది 'కైవడి మెకములఁ గ్రుమ్మెడి। కైవడి మాయావచేవ కనఁ బోయెదుగా। దేవర మాదేవరవలె। వేవేగమె సామి వేఁట విచ్చేయవయా' (సారం.1.75.). ఇచ్చటి 'కైవడి' 'విధము' అనెడి అర్థము కలది. 'పోలిక' అనుట ఇట పొసఁగదు. అందులకే (ఆం.భా.), ప్రయోగములన్నియు సమన్వయపడునట్లు 'విధ' మనినది. అంభా. ప్రయోగవిజ్ఞాన మెంత కూలంకష మైనదో ఇందుమూలమున మన కెఱుకపడును. కొన్ని యిట్టివి పూర్వ ముదా హృతములు. [పైపద్యమున 'మాయావ' అను చో (జి.కా.) వ్యాఖ్యాతలు 'ఏవ' కైన వ్యావ హారికరూపము 'యావ' ఇది అను చున్నారు. పూర్వటీకాకర్తలు 'యావ' ను 'ఆవ' యనుకొ నుట తెలియమి. 'ఆవ-జ్ఞానము' అని టీక వ్రాయుట సాహసము' అనినారు. కవి యిట మాత్రము వ్యావహారికముగా 'యావ' ఆను 'యకారాదిపదము' ప్రయోగించె ననుట కేవ లము సాహసము. 'ఆవపాఱు' అనుదానికి జ్ఞప్తికి తెచ్చు' అనునర్థము (శ.ర.) ఇచ్చు చున్నది. 'అది నాకు ఆవపారదు' జ్ఞప్తికి రాదు) - అను వ్యవహారమును (బ్రౌ.) చూపు చున్నది. దీనినిఁబట్టి 'ఆవ' కు (ధారణ-ఏకాగ్రత) అర్థ మున్న దనుటకు అభ్యంతర మేమి ? 'ఏవ'నుండి ఏర్పడినదే ఈ'ఆవ' అనవచ్చును ! (ఆం.భా.) 'ఏవకు' కు 'అవధానము' అను- అర్ధమును ఇచ్చు చున్నది '.... మెచ్చరిక యెచ్చరిం పేవ యేద పదిల । ము....యన నొప్పు నవధాన । (ము)' (1.138.) అని. 'లక్ష్యమందలియేకాగ్రత' దీనికి అర్థము. మఱియొక మాట. (ఆం. భా.) 'ఏవ'కు ఇదిలక్ష్యమనఁదగి నదే ! 'మాయేవచేవ'అనియే ఇట ఉండి, లేఖకప్రమాదమున'మాయావచేవ'గా ఇది పరిణమించి ఉండును ! 'మాయావ....'అనియే ఇవి ఇట ఉండవలయు ననుటకు నిర్ధారకము ఏమున్నది ? ఏమైనను'యావ' ఇది అనుటమాత్రము అయుక్త మనక తీరదు.

కల్లు:—ఇట (ఆం.భా.) 'సారా'దీనికి అర్థ మనుట, (సామాన్యవివక్షతో) మామిడిని 'చెట్టు' అనుటవంటిది. 'సారా' 'కల్లు'లోని భేదము (ఒకదినుసుకల్లు) అని (ఆం.భా.) పూర్వము

వచించినది '... గ ల్లనంగ సురాఖ్య చెల్లును, గై పు సారాయి సారా నాఁగ రహిఁ దనర్చు' (2.303.). (అని.). (సాంబ.) కూడ ఇట్లే వచించినది 'సారాయి యనఁ జెల్లు వారుణీనామ ముల్ ....(మాన.47.). (వేంక.) 'మద్యమ్ము పేళ్లు, దనరు సారాయి కై పనఁ... ' అను చున్నది. ఇట 'మద్యము' మద్యవిశేషమునే చెప్పెడి దనవలయును. కనుకనే, దీనికి పర్యాయ పదము గా 'కల్లు'ను వచించుట లేదు ఇట ఇది (ఆం.భా.)కూడ'కై పు, సారాయి' పర్యాయము లనినది. ఇఁక ఈ (వేంక.) నానార్థవర్గమున 'కలు నాఁగ జాతికిఁ గల్లున కగుఁ....' అను చున్నది. ఇట 'సారా' ను పేర్కొనుట లే దిది. 'క ల్లనఁగ శిల సురయు నౌ' అని (ఆం. సం.నానా.24.).

సీ. ఖట్వాంగరేఖలు కనుపట్టుఁ గోడు,నా;
ఘటికార్గళంబులు గడియ,యనఁగఁ;
బవనపిశాచము ల్పరఁగు గాలి,యనంగ;
గట్టు,నాఁ దీరనగంబు లలరు;
వృత్తాంతదంభము ల్వెలయును గబు,రన;
బంతి,నాఁ గందుకపంక్తు లెసఁగు;
నరసంఘనికటముల్ పరఁగుఁ జేరువ,యన;
నండతారకలు గ్రు,డ్డనఁగ మీఱు;

గీ. ఘూకకర్ణైకదేశము ల్గూ,బనఁ దగు;
గంట,యనఁ బై రుదుబ్బును ఘంట యొప్పు;
నుపలరాశియు నణుకువాఁ డొప్పుచుండు
గుట్ట,యని పల్కఁగ;సుగంధికుంతలేశ ! 53

కోడు—ఇది ఖట్వాంగమునకు (మంచపుఁగోడునకు), రేఖకు (గీతకు) పేరు.

గడియ—ఇది ఘటికకు (ఇరువదినిమిషములకాలమునకు), అర్గళమునకు (తలుపు రా కుండుటకై) తలుపునకు అడ్డుగా వై చుకఱ్ఱకు) పేరు.

గాలి—ఇది పవనమునకు (వాయువునకు), పిశాచమునకు (దయ్యమునకు) పేరు.

గట్టు—ఇది తీరమునకు (ఒడ్డునకు), నగమునకు (పర్వతమునకు; కొండకు) పేరు.

కబురు—ఇది వృత్తాంతమునకు (సమాచారమునకు), దంభమునకు (డంబమునకు; ఆడంబరమునకు) పేరు.

బంతి—ఇది కందుకమునకు (చెండునకు; ఆడెడిబంతికి), పంక్తికి (వరుసకు) పేరు.

చేరువ—ఇది నరసంఘమునకు (మనుష్యసమాజమునకు), నికటమునకు (సమీప స్థలమునకు) పేరు.

గ్రుడ్డు—ఇది అండమునకు (పక్ష్యాదుల గ్రుడ్డునకు), తారకకు (కంటి (నల్ల)గ్రుడ్డునకు) పేరు.

గూబ—ఇది గుడ్లగూబకు (దివాంధమునకు), కర్ణైకదేశమునకు (కర్ణమూలమునకు; చెవిగూబకు) పేరు.

గంట—ఇది పైరుదుబ్బునకు (గడ్డిదుబ్బునకు; తృణస్తంబమునకు), ఘంటకు (అఱువదినిముసములకాలమునకు) పేరు.

గుట్ట—ఇది ఉపలరాశికి(ఱాలకుప్పకు), అఱుకువానికి (మల్లజాతీయునకంటె అన్యునకు; మల్లజాతివాఁడుకాని పెఱజాతివానికి) పేరు.

చేరువ:—ఇవి సాధారణము గా సమూహమాత్రవాచక మని (సాంబ.)-'గమి పౌఁజు మొత్తము కదుపు చేరువ బారు, పిండి కూటువ పరి దండు దిమ్ము। గుంపు తుటుము గుమి గూటు పదుపనంగ బృందాఖ్య యగు' (మాన.37.). (నానా.వర్ణన) అం.సం. దీనిని సమూహమాత్రమునకు వాచక మనియే వచించినది - 'అంతికంబునకును సమూహంబునకును। నామ మై యొప్పుఁ జేరువ నాఁగ....' (నానా.19.). (సూ.ని.) ప్రయోగ మొకటి ఇట్లిచ్చినది 'అభిసారికాసమూహముకాలిసంకెల, ప్రముచ్చుచేరువలకు విచ్చుమొగ్గ' (కవిజ.3.81.) (దొంగల సమూహము-నరసంఘమే). (అం.భా.కు) ఇది (ఉదా.) అనఁ దగినదియే। 'ప్రముచ్చుచేరువ' 'కరికలభము' అనుటవంటిది. (అం.భా.) విశేషవాచకములు గా ఒనఁగినవానిని ఇతరనిఘంటువులు సామాన్యవాచకములు గా చాలవఱ కిచ్చు నని పూర్వ ముదాహరించినవానివంటిదే ఇది.

(సూ.ని.) ఈ-ఒక్క-ప్రయోగమునే చూపినది. కేవలసమూహవాచకము (అప్రాణిసంఘవాచకము) అనుటకు తగినప్రయోగ మేమియు చూప లేదు.

['..బైరుదుబ్బు:—'.. బైరుదుంపయు' అని (వావి.అపపా.)].

గుట్ట:—'గుంట....' అని (వావి.పా.). (సూ.ని.బ్రౌ) (ప్రాచ్యప్ర.పా.) పైనాగ్రహించినది. 'గుంటమారి' దుర్మార్గుఁడు - 'వాఁడు నానాఁటి కఖవృద్ధి వఱలఁ బెరిఁగి। కాఁకలను దేఱి గడిమీఱి గట్టిపాటి। రాలుగాయతనాన బేరజపుదారి। నారిదేఱియు బలుగుంటమారి యయ్యె' (హంస.5.110.) (చూ.సూ.ని.).

సీ. శ్రవణైకదేశ మాచ్ఛాదనగేహంబు
మీఱుచు నుండు గుడార, మనఁగ;
యవనాశ్వభేదంబు లలరుఁ బటాణి, నాఁ;
దొలి, నాఁగఁ బూర్వంబు బిలము దోఁచు;
బంధువు ల్వాలయుము ల్పరఁగుఁ జుట్టు, లనంగఁ;
దెఱవ, నా బయలును స్త్రీ దనర్చు;
దంతక్షతంబు రత్నం బగుఁ గెంపు, నా;
దడ్డ, నా నికటంబు దామ మొనరు;

గీ. బొందళము, యుగి జోడనఁ బొల్పుఁ గాంచుఁ;
జెఱఁగు విరళంబు సాంద్రంబు జీబు, నాఁగ;
గంధపట్టె, యనంగను జందనాను
లేపనకవాటపట్టిక ల్మెఱు; నభవ। 54

గుడారము—ఇది శ్రవణైకదేశమునకు (గుడారమువలె ఉండుచెవిభాగమునకు) ఆచ్ఛాదనగేహమునకు (పటకుటీరమునకు; వస్త్రముతో ఏర్పఱచినయింటికి; డేరాకు) పేరు.

పటాణి—ఇది యవనునకు (తురకకు), అశ్వభేదమునకు (యవనదేశపుగుఱ్ఱమునకు) పేరు.

తొలి—ఇది పూర్వమునకు (ముందటిదానికి), బిలమునకు (గుహకు) పేరు.

చుట్టలు—ఇది బందువులకు, వలయములకు (గుండ్రముగా చుట్టినచుట్టలకు) పేరు.

తెఱప—ఇది బయలునకు (తెఱపికి; అవకాశమునకు), స్త్రీకి పేరు.

కెంపు—ఇది దంతక్షతమునకు (పల్లొత్తునకు; కొఱకుటవలనిగాయమునకు), రత్నమునకు (పద్మరాగమణికి; కురువిందమునకు) పేరు.

దండ—ఇది నికటమునకు (సమీపమునకు), దామమునకు (పూలు-మొ.వాని మాలకు) పేరు.

జోడు – ఇది బొందళమునకు (కవచమునకు; మైమఱువునకు), యుగికి (మిథునమునకు; స్త్రీపురుషద్వంద్వమునకు; ఆలుమగలకు) పేరు

జీబు—ఇది సాంద్రమునకు (దట్టమైనదానికి), విరలమునకు (పలుచనిదానికి) పేరు.

గందపట్టె—ఇది చందనానులేపనమునకు (గందముతో పెట్టినరేఖకు), కవాటపట్టికకు (తలుపుమీఁద అమర్చెడి అడ్డుకొయ్యకు; స్కంధపట్టికకు) పేరు.

తొలి—తొల్లి (రూపాం.) (చూ.3.73.ఆం.భా.). (రెండవయర్థమునకు) 'హంసము క్రౌంచము తొలి రా । మాంసలరుచి పచ్చెఁ దాను మలయముశిఖఁ బా । ల్హాంస విఱువ నీ ర్వెడిచెను । హంసమున కగస్తి పరమహంసం బగుటన్' (ఆము. 4.178.) (చూ.సూ.ని.).

కెంపు:—దీనిస్వరూపము రత్నశాస్త్ర మిట్లు వచించినది-'సలలితమత్తకోకిలలోచనద్యుతి, నలరారుఁ గురువింద మనెడికెంపు' (రత్నపరీక్ష-11.) (చూ.సూ.ని.).

దండ:—'దండ యన దామమునకు దాపున కగు' (వేంక.నానా.118.).

జోడు:—దీనికి (ఆం.సం.) విస్పష్టము గా 'మిథునము'అనునర్థమును వచించినది ' ..మిథునమున కాఖ్య లగు జోడు । దోయి కవ యనంగ ....' (మాన.42.). వేంక. నానార్థవర్గమున 'జో డనఁ గవకు మైజోడున కన వగు' (116.) అనినది. (ఆం.భా.) పూర్వము ద్వంద్వమునకు (కవకు) కవచమునకు ఇది వాచక మనినది (చూ.2,100,204), (2.100 ఆం భా.) కడ (సూ.ని.) 'మిథునము, కవ' అని వ్యాఖ్యానించినది. (ఆం భా., 2.100 కడ) (దీనికి)

'ద్వంద్వము' అని అర్థనిర్దేశ మొనర్చినది. 'ద్వంద్వ'శబ్దమునకు 'మేదిని' ద్వన్ద్వం రహస్యే తథా మిథునయుగ్మయోః' అని, 'మిథునము, యుగ్మము' అను రెండర్థములు కల వనినది. (అమ,)-'స్త్రీపుంసౌ మిథునం ద్వన్ద్వమ్' 'యుగ్మం తు యుగళం యుగమ్'అని వీనిని వేఱు వేఱు గా వచించినది. అమరమట్లు (ఆం భా.) వేఱు గా వీనిని బేర్కొన కుండుటనుబట్టి 'ద్వంద్వ' శబ్దముచేత 'మిథున, యుగ్మము'ల రెండిటిని సంగ్రహించిన దనిపించును అందు లకే నే నట 'కలపి యుండెడిరెండిటికి' అని (మిథునయుగ్మములకు రెండిటికి) అనువు గా వ్యాఖ్యానించితిని (సాంబ.మొ.) ఈసందర్భమున వేఱు గా జంట,జోడు(మొ.)వానిని వచిం చినవి. '. ..జమి డిమ్మ డిబ్బడి జంట రెండు। దుగ రెట్టి దువ యన ద్విగుణాఖ్య కవ జోడు, దంట దోయి యనంగ ద్వంద్వసంఖ్య' (మాన 29 ). 'ద్విగుణమున కభిఖ్య లగు నిబ్బ డిమ్మడి । జంట దుగయు జమిలి రెట్టి। యినుమడి, యన మిథునమున కాఖ్య లగు జోడు। దోయి కవ యనంగ....' (ఆం.సం మాన.42 ). ఈయర్థములు (రెండు, ఇమ్మడి-అనునవి) లాక్షణికములు గా తరువాత ఏర్పడినవి. అందులకే (ఆం.భా.) వదలి యుండును.

యుగి·——'యుగ' శబ్దము (జంట - మిథునము) అను-అర్థమున (నపుం ) అనియే నిఘంటువు· లను చున్నవి నాచూచినంతలో. 'యుగో ఒస్త్రీ స్యన్దనాద్యఙ్గే క్లీ తు యుగ్మే కృతాదికే' (వై జ.ద్వ్య.నానా.). 'యుగం కృతాదౌ యుగళే వృద్ధినామౌషధే ఒపి చ। యుగం హస్త చతుష్కే ఒపి రథసీరాఙ్గయో ర్యుగః' (విశ్వ.) (మొ.). ఇఁక యుగశబ్దమునకే ఇన్నంత రూప మిది (నిత్యయోగార్థమున) అన వలయును. 'భూమ నిన్దా ప్రశంసాసు నిత్యయోగే ఒతిశాయనే। సంసర్గే ఒస్తివివక్షాయాం భవన్తి మతుబాదయః' అని (పాణినీయము). 'యుగల' శబ్దమును 'యుగము కలది' అనెడి-అర్థమున 'యుగ మ స్త్యస్య వా। సిధ్మాది త్వాత్' (5.2.97.) లచ్. అని, మత్వర్థకప్రత్యయాంతము గా సాధించినది (సుధ).

సీ కంఠభూషాలతికలు దోఁచుఁ దీగ,నా;
స్థూలము గుణ మొప్పుఁ దోర, మనఁగ;
మార్గకుష్ఠంబులు మను చుండుఁ దెన్ను,నాఁ;
బాలు,నా క్షీరంబు భాగ మెసఁగుఁ;

గాంతిధ్వజంబులు కనుపట్టు డాలు,నాఁ;
　　　　జంద్రమాసంబులు చను నెల,యన;
శిశువు కనీనిక చెలఁగుఁ బాప, యనంగఁ;
　　　　బలుకు,నా శకలబాషలు దనర్చుఁ;

గీ. దోఁపు,నాఁగను దగు నల్లతుమ్మచెట్టు
　పట్టపేరును శృంగారవనముపేరు;
　బాళియును గోటవెలిమంటపంబు దోఁచ
　దమక, మనఁగను; మాతృభూమీప్రదాన ! 55

తీగ—ఇది కంఠభూషణ (స్త్రీలు మెడయందు ధరించెడి ఒకవిధ మగు బంగారు నగకు), లతికకు (తీగెకు; తీవెకు; లతకు) పేరు.

తోరము—ఇది స్థూలమునకు (లావైనదానికి), గుణమునకు (దారమునకు; వ్రతసూత్రమునకు; నోము నోచుకొనుటకై ధరించెడిదారమునకు; నోముదారమునకు) పేరు.

తెన్ను—ఇది మార్గమునకు (త్రోవకు), కుష్ఠమునకు(ఒకవిధ మైన మహావ్యాధికి) పేరు.

పాలు—ఇది క్షీరమునకు, భాగమునకు (అంశమునకు) పేరు.

డాలు—ఇది కాంతికి, ధ్వజమునకు (టెక్కెమునకు) పేరు.

నెల—ఇది చంద్రునకు, మాసమునకు (ముప్పదిదినములకాలమునకు) పేరు.

పాప—ఇది శిశువునకు, కనీనికకు (కంటిపాపకు; కంటినల్లగ్రుడ్డులోని ప్రతిబింబమునకు) పేరు.

పలుకు—ఇది శకలమునకు (తునుకకు), భాషకు (మాటకు) పేరు.

తోఁపు—ఇది నల్లతుమ్మచెట్టుపట్టకు (నల్లతుమ్మతొక్కకు), శృంగారవనమునకు (సింగారపుఁదోఁటకు) పేరు.

తమకము—ఇది బాళికి (తమికి; మోహమునకు; గాఢమైనకోరికకు), కోటవెలి

గాంతిధ్వజంబులు కనుపట్టు డాలు,నాఁ;
జంద్రమాసంబులు చను నెల,యన;
శిశువు కనీనిక చెలఁగుఁ బాప, యనంగఁ;
బలుకు,నా శకలభాషలు దనర్చుఁ;

గీ. దోఁపు,నాఁగను దగు నల్లతుమ్మచెట్టు
పట్టపేరును శృంగారవనముపేరు;
బాళియును గోటవెలిమంటపంబు దోఁప
దమక, మనఁగను; మాతృభూ-పదాన! 55

తీగ—ఇది కింరభూషకు (స్త్రీలు మెడయందు ధరించెడి ఒకవిధ మగు బంగారు నగకు), లతికకు (తీగెకు; తీవెకు; లతకు) పేరు.

నోము—ఇది స్థూలమునకు (లావైనదానికి), గుణమునకు (దారమునకు; వ్రత సూత్రమునకు; నోము నోచుకొనుటకై ధరించెడిదారమునకు; నోముదారమునకు) పేరు.

తెన్ను—ఇది మార్గమునకు (త్రోవకు), కుష్ఠమునకు(ఒకవిధ మైన మహావ్యాధికి) పేరు.

పాలు—ఇది క్షీరమునకు, భాగమునకు (అంశమునకు) పేరు.

డాలు—ఇది కాంతికి, ధ్వజమునకు (టెక్కెమునకు) పేరు.

నెల—ఇది చంద్రునకు, మాసమునకు (ముప్పదిదినములకాలమునకు) పేరు.

పాప—ఇది శిశువునకు, కనీనికకు (కంటిపాపకు; కంటినల్లగ్రుడ్డులోని ప్రతిబింబమునకు) పేరు.

పలుకు—ఇది శకలమునకు (తునుకకు), భాషకు (మాటకు) పేరు.

తోఁపు—ఇది నల్లతుమ్మచెట్టుపట్టకు (నల్లతుమ్మతొక్కకు), శృంగారవనమునకు (సింగారపుఁదోఁటకు) పేరు.

తమకము—ఇది బాళికి (తమికి; మోహమునకు; గాఢమైనకోరికకు), కోటవెలి

మంటపమునకు (కోటపైట ఉండుమంటపమునకు; స్తంభములమీఁద కట్టినకట్టడము నకు) పేరు.

తోరము:—'....దోర మనఁగాను స్థూలము నోముదార। మమరు' (సాంబ ని. నానా.92.).

పాలు:—'...బా లనఁగఁ బంపకమునకుఁ బాలున కగు' (వేంక.నానా.121 ).

పలుకు:—'శకలంబునకు మాటకును బలు కన మించు' అని (సాంబ.ని.నానా.86.).

బాళి.—'బాళి, కాంక్ష—అని (సూ.ని.). '....దమకము మేలు మరులు బాళి। తమి వలపు విరాళి మమత నా మోహ మౌ' (సాంబ.ని.మాన.33.).

తోఁపు:—'....దోఁ పనఁగా నల్లతుమ్మచెక్కకుఁ దోఁపు, కోకకుఁ దోఁపునకుఁ దగు....'(వేంక. నానా.117.). పూర్వము (ఆం.భా.) ఇ ట్లనినది.-'తోఁట యం చనఁగను దోఁచు గృహారామ। ముపవనసంజ్ఞ యై యుండుఁ దోఁపు। నాఁగను ప్రమదావనాభిధ యౌను సింగారపుఁదోఁటన....' (ఆం.భా.2.34.). ఈ ఆం.భా.నుబట్టి 'తోఁపు' శృంగారవనము (సింగారపుఁదోఁట) కాకపోయినను (అర్థాం.) గా తోఁపునకు ఈ (నానా.ఆం.భా.నుబట్టి) అంగీకరింపవలసి యున్నది.

సీ. జాతసూతకమును సమ మగుఁ బురుడు,నాఁ;
 బెంపు,నా నాశంబు వృద్ధి దోఁచు;
నెమ్మి,నా బర్హిసఖ్యమ్ములు దన రారు;
 నాడు, నాదేశదినమ్ము లెసఁగు;
శయ్య విస్తారంబు చను చుండుఁ బఱుపు,నాఁ;
 బగలు,నా ద్వేషదివాఖ్య లెసఁగు;
దామనామంబులు దనరును బేరు,నా;
 బాస,నా శపథంబు భాష వెలయుఁ;

గీ. బోఁగు,నాఁ దంతువును గర్ణభూష మీఱు;
వెలయు శిశువత్సములు పసిబిడ్డ, యనఁగ;
సింహపూర్ణోపమానము ల్సెలఁగును నెఱ
సరి, యటం చని పలుకాడఁ; జంద్రచూడ !

పురుడు—ఇది జాతసూతకమునకు (జాతాశౌచమునకు; జననిమిత్త మగుమైలకు), సమమునకు (సాటి యైనదానికి; సదృశమునకు) పేరు.

పెంపు—ఇది నాశమునకు (చేటునకు; చెడుటకు), వృద్ధికి (అభివృద్ధికి) పేరు.

నెమ్మి—ఇది బర్హికి (నెమిలికి), సఖ్యమునకు (స్నేహమునకు) పేరు.

నాడు—ఇది దేశమునకు (సీమకు), (నాఁడు) దినమునకు పేరు.

పఱపు—ఇది శయ్యకు (పాన్పునకు; పడుకకు), విస్తారమునకు (విరివికి) పేరు.

పగలు—ఇది ద్వేషములకు, దివమునకు (పగటికి) పేరు.

పేరు—ఇది దామమునకు (దండకు; హారమునకు), నామమునకు (నామధేయమునకు; పేరికి) పేరు

బాస—ఇది శపథమునకు (ప్రతిజ్ఞకు), భాషకు (ఆంధ్రాదిభాషలకు) పేరు.

పోఁగు—ఇది తంతువునకు (దారమునకు), కర్ణ భూషకు (కుండలమునకు; చెవిపోఁగునకు) పేరు.

పసిబిడ్డ—ఇది శిశువునకు (పసిపాపనికి; చంటిబిడ్డకు), వత్సకు (క్రేపునకు; ఆవుదూడకు) పేరు.

నెఱసరి—ఇది సింహమునకు, పూర్ణోపమానమునకు (నిండుసాదృశ్యమునకు) పేరు

పెంపు:—రెండర్థములకు క్రిందిహరిశ్చంద్రనలోపాఖ్యానప్రయోగము (ఆం.భా.కు) లక్ష్య మనఁదగి ఉన్నది-'....ననురక్తి రేఁచునూతనసారసాటోప, మొంటికాంద్రకుఁ బెంపు లొసఁగునెచట ..' (హరి.న.2.30.) (చూ.శ.ర.). (శ.ర.) ఇట- (పెంపు = సమృద్ధి-అని ఒకయర్థమిచ్చు చున్నది. 'అభివృద్ధి' అనియే (టీక.). అదియే ఉచిత మనిపించును. ఆం.భా. అందులకే 'వృద్ధి' అనిన దిట.

నాడు:—"నా డనఁ దగు నాదినమునకు సీమకు" (సాంబ.నానా.92.).

పఱుపు:—పఱపు(రూపాం.) 'పఱ పనంగ నభిఖ్య యొఁ బానుపునకు। విస్తృతమునకు'(ఆం. సం.నానా.7 ).(ఆం.భా.) పూర్వము (2.163) లో 'పఱపు' అనినది. 'రాయంచగఱులపఱుపు' (ఉ.రా.6.161.).

పగలు:—(పగ.ఏ.)(పగలు(బ.)మొదటియర్థమున.)(రెండవయర్థమున ఏ.) (రెండిటికి అభేదము).

కర్ణభూష:—'కర్ణికా తాలపత్త్రం స్యాత్ । కుణ్డలం కర్ణవేష్టనమ్' (అమ.). 'కుణ్డలం కర్ణభూషాయాం పాశే ఽపి వలయే ఽపి చ' అని (మేదిని.).

పసిబిడ్డ:—'పసిబి డ్డనఁగ విసువున । కును గ్రేవునకుఁ దలిర్చును' (వేంక.నానా 121.).

సీ. కంఠభూషణమును గనకాక్షినామంబు
    పైఁడికంటె, యనంగఁ బరఁగు చుండు;
స్వర్ణోపకారము ల్చనును మేలిమి, యన;
    మూల,నాఁ గచకోణములు దనర్చు;
నౌదుంబరంబు హలాగ్ర మౌ మేడి,నా;
    బడుగు,నా శవము దుర్బలుఁడు దోఁచు;
సౌందర్యకరవిభూషలు చను మురువు,నా;
    మెఱుపును గాంతియు మెఱుఁ,గనఁ దగుఁ;

గీ. గర్ణభూషణమును దటాకజలనిర్గ
మస్థలంబును బొగడ,నా మనుచు నుండు;
నన్యమును క్షౌద్రపటలంబు నలరు చుండుఁ
బెఱ, యనంగఁ; బరాంతకవిభువిభంగ ! 57

పైఁడికంటె—ఇది కంఠభూషణమునకు (మెడయందు పెట్టెడు సొమ్మునకు; కంటె మొద లగుదానికి), కనకాక్షికి (సకినాలపులుఁగునకు; ఒకశకునపక్షికి; తనపలుకులచే శుభాశుభములు తెలిపెడిదానికి) పేరు.

మేలిమి—ఇది స్వర్ణమునకు (బంగారమునకు), ఉపకారమునకు పేరు.

మూల—ఇది కచమునకు (కొప్పునకు; ముడువఁబడిన కేశములకు), కోణమునకు (విదిక్కునకు; దిక్కులనడిమిభాగమునకు; ఆగ్నేయము - మొద లగు కోణములకు) పేరు.

మేడి—ఇది ఔదుంబరమునకు (ఉదుంబరమునకు; అత్తికి), (మేఁడి) - హలాగ్రమునకు (నాఁగేటిచివరకు; నాఁగలివెనుకటిపట్టుకొయ్యకు) పేరు.

బడుగు—ఇది శవమునకు, దుర్బలునకు (శక్తిహీనునకు) పేరు.

మురువు—ఇది సౌందర్యమునకు (మురువునకు), కరవిభూషకు (చేతికడియము నకు; మురుగునకు) పేరు.

మెఱుఁగు—ఇది మెఱుపునకు (విద్యుత్తునకు), కాంతికి (ప్రకాశమునకు) పేరు.

బొగడ—ఇది కర్ణభూషణమునకు (బుడగకు; ఆఁడువారు కొనచెవిని ధరించు-ఒకదినుసుసొమ్మునకు), తటాకజలనిర్గమస్థలమునకు (చెఱువునుండి నీళ్లు వెలువడు ప్రదేశమునకు) పేరు.

పెఱ—ఇది అన్యమునకు (ఇతరమునకు), క్షౌద్రపటలమునకు (తేనెపట్టునకు; మధు కోశమునకు) పేరు

కనకాక్షి:—'ఆఁడుగుడ్లగూబ' ఇది-అని (వైజ.) 'ఉలూకచేటీ హిక్కా స్యా త్కనకాక్షీ చ పిఙ్గలా' (అన్త.ఖగా.). (సాంబ.) దీనికి పర్యాయములను ఇట్లిచ్చినది-'... గుబ్బలికాఁడు నకినాలు వెలయింప. పక్కి పగటిచీఁకు పైఁడికంటి। యనఁగఁ గనకాక్షికిఁ దనరు' (తిర్య.82.).

పైఁడికంటె:—'పైఁడికంటి' అనియే పాఠము. 'కంఠభూషణము' అను (అర్థాం.) సంగత మగుటకు 'పైఁడికంటె' అని ఇట అనవలసి యున్నది. పాఠ మట్లే ఉండియుండి లేఖక సంస్కారమున ఇట్లైన దనిపించినది ఇందులకు నిదర్శనము గా (బ్రౌ.) 'పైఁడికంటి, (లేక) పైడికంటె'అను చున్నది కనకాక్షిని, (ఆంధ్రా. 2.291.) లో 'పైఁడికంటి', (ఇట) పైఁడికంటె'అని ప్రదర్శించిన రెండురూపములనే (బ్రౌ.) ఇట్లు పేర్కొనిన దనిపించును. (సూ.ని.) కూడ (ఇట) ఇట్టిసంస్కారమును సూచించినది - 'కంఠభూషణము'అనెడి - అర్థ మున 'పైఁడికంటె' అని ఉండవలయును.కాని ఆం.భా,కారుఁడు నానార్థములలో 'పైడికంటి' అని వ్రాసి యున్నాఁడు' (అని.) (చూ.సూ.ని. 'పైఁడికంటి').

మేలిమి:—'మేల్మి' (రూపాం,) 'చొక్కపురత్నపుందళుకు సోయగపున్నెఱమేల్మితొాట్లలో। మక్కువ నుంచి తేటపగమాటలు నీ కెనయన్ సువర్ణనమ్య। క్కరకంకణధ్వనులు మార్మ లయం గొలుసు ల్గదల్చుచుం। జొక్కుచు రాజనందనకు జోలలు పాడుదు రంగనామణుల్' (ఇందు 2.140.) చూ.సూ.ని.). (సాంబ.) దీనికి నానార్థములను ఇట్లు వచించినది. 'హేమొన్నన

కుపకృతి కొనరు మేల్మి యనంగ' (నానా. 90). (ఆం.భా.) పూర్వము 'అతిశుద్ధచామీకరా ఖ్యలు చను౯ గడాని,మేలిమి యపరంజి జాళువాకుందనం బుదిరి నా' (2 279) లో విశేష వాచకము గా దీనిని ఉదాహరించినది. ఇట సామాన్యవాచకము గా దానినే ('పత్రైకదేశము' 'పట' మన౯బడినట్లు) వ్యవహరించిన దనిపించు చున్నది. ఇట్టివి పూర్వము వ్యాఖ్యాతములు. (సాంబ.) ఈపట్టున '....బంగారు హొన్ను । జాళువా పుత్తడి మేలిమి బంగరు, పసి౯డి పొన్ను కడాని పై౯డి యుదిరి । యన సువర్ణము పొల్చు, నపరంజి కుందనం,బన౯ దత్త కనక మౌ' (స్థా.67.) అని (ఆం.భా.) విశేషవాచకము లనినవానిని సామాన్యవాచకముల౯ గా ఉదాహరించినది. చాలపట్టులం దిట్లే ఇవి వచించిన వని పూర్వము వ్యాఖ్యాతము. 'మేలిమి గట్టు' 'కనకాద్రి' అనుటవంటివిగూడ 'పాలసంద్రము' 'సముద్ర' మనుటవంటి వని ఎఱు౯గ వలయును.

కోణము:—'తాల్చు నాఖ్యను వధూధమ్మిల్లభారంబు, గోణంబు మూల నా ' (ఆం.సం. నానా.23.),

ఔదుంబరము:—'అత్తి మేడి యనంగ నౌదుంబరం బొప్పు' (సాంబ.స్థా.58.).

మేడి:—దీనికి (నానార్థములను) (ఆం.సం.) గూడ ఇట్లే ఉదాహరించినది. 'అభిధాన మగు మేడి యన,హలాంగమున కుదుంబరమునకు' (నానా.24). ' ... మేడి యన హలాగ్రమున కత్తికి౯ దన,రును' (వేంక.నానా.124 ). చాలవఱకు (ఆం.భా.ను) అనుసరించి దానితో అభిన్నము గానే ఈవర్గమును నడపిన విధి యని పూర్వము విశదపఱప౯బడినది.

బడుగు:—వ్రా౯తప్రతులలో ఇది 'బడగు' గా (అన్మధ్యమముగా) ఉన్నది (బడగు,బణగు(క.) చూ.సూ.ని,).

మెఱుపు.—'మెఱపు' అనియే (శ.ర.) (సూ.ని) గ్రహించినవి. ' ...దన । రును మెఱు౯ గన మెఱుపునకు జిగికి' (నానా.124.)అని (వేంక.) నిర్ధారకము గా'మెఱుపు'అను-ఉన్మధ్యమము గూడ కల దను చున్నది. (ఆం.భా.) (వేంక.) మొ. 'మెఱుపు'నే బహులము గా ప్రదర్శించు చున్నవి (వివరణమునకై చూ.1.72.). 'మెఱుపు'ను వచించు'మెఱు౯గు'అనుదానికి ప్రయోగ మొకటి ఇట్లున్నది- ' . ఎద్దు లాఱునూ । ఱును రథముల్ శతంబును మెఱుంగుల మొత్త ముపోనియంగనా । జనశతకంబు. .' (భార కర్ణ.2.) (చూ.శ.ర.).

సీ. పుష్పచాపంబును బుష్పగేహంబును
బూవిల్లు,నాఁగను బొదలు చుండుఁ;
బేఁట,యం చనఁగను విపణిప్రదేశాఖ్య
యేకసూత్రాఖ్య యై యెసఁగు చుండు;
మఁ ఙుఁ, గనఁగాను బ్రమాణభేదంబును
ధౌతవస్త్రంబును దనరి యుండుఁ;
గరవాలనిహతియు సరసీరుహాక్షియు
వాల్గంటి, యనఁగను బరఁగుచుండుఁ;

గీ. గోపరీతులు మోడి,నాఁ గొఱలు చుండు;
వేఁట, యన మేషమృగయలు వెలయు చుండుఁ;
దోఁచు జఠరామయంబునఁ దూమునందు
బల్ల,యనునట్టిమాట; పశ్యల్లలాట ! 58

పూవిల్లు—ఇది పుష్పచాపమునకు (మన్మథుని పువ్వువింటికి), పుష్పగేహమునకు (పూలయింటికి) పేరు.

పేఁట—ఇది విపణిప్రదేశమునకు (అంగడ్లవీధికి), (పేఁట) ఏకసూత్రమునకు(ఒక పోఁగునకు; యష్టికి; హారములోని ఒకసరమునకు) పేరు.

మఁఙుఁగు—ఇది ప్రమాణభేదమునకు (ఎనిమిదివీసెలబరువునకు), ధౌతవస్త్రమునకు (పరిశుద్ధమగు వలువకు) పేరు.

వాల్గంటి—ఇది కరవాలనిహతికి (కత్తిదెబ్బవలని గాయమునకు), సరసీరుహాక్షికి (స్త్రీకి) పేరు.

మోడి—ఇది కోపమౌనమునకు (బింకమునకు), రీతికి (వైఖరికి; విధమునకు) పేరు.

వేఁట—ఇది మేషమునకు (గొఱ్ఱెపోతునకు), మృగయకు (ఆఖేటకమునకు; అడవిలో మృగాదులను వెంటాడి చంపుటకు) పేరు.

బల్ల—ఇది జరరామయమునకు (కడుపునందలివ్యాధికి; కడుపులోనిగడ్డ; గుల్మము నకు), తూమునకు (నాలుగుకుంచముల కొలతమానమునకు; ద్రోణమునకు) పేరు.

పూవిల్లు:—రెండవయర్థమున ('పూవు+ఇల్లు') అని పదచ్ఛేదము.

పేఁట:—(పేట) 'పోఁగు' (దారము) అని అర్థము. 'మూఁడుపేటలత్రాడు గట్టిగ ఉండును' అని (వ్యవ.) 'అంగళ్ల నొకపోఁగు నగును బేట యనఁగ' అని (సాంబ.నానా.89.)

కరవాలనిహతి:—'కత్తిదెబ్బ' అనునది దీనికి వాచ్యార్థము 'కత్తిదెబ్బవలనిగాయము' అనునది కార్యకారణముల కభేదోపచారమున అర్థము గా ఇట వక్తవ్య మగులక్ష్యార్థము. (గంటి - గాయము (చూ.శ.ర.మొ.) 'వాల్గంటి'కి ఈ-అర్థము (శ ర.)మొ. ఇచ్చుట లేదు

మోడి:—'మోడి యనఁ గోపమౌనంబు పొల్చు' అని (ఆం.భా.1.135.) 'కోపమౌనమునే' 'కోప' మనిన దిట (ఆం భా.) (ఆయు ర్వై ఘృతమ్-అనినట్లు) (వేంక ) ఈ సందర్భమున 'మోడి నా నైష్ఠుర్యమునకు బంగరుతున్క, మోడికి వర్తిల్లు' (నానా.125 ) అను చున్నది. ఈ'నైష్ఠుర్యము' (కాఠిన్యము) (అర్థాం.) అనఁ దగినది. (బిగువు-మొ ) అర్థములను దీనికి (శ.ర.సూ.ని.మొ.) ఇచ్చు చున్నవి. అట్టిదే ఇదియు ఒకటి. (సాంబ.), (ఆం భా.) అనినట్లే (నానా.) లో 'మోడి నా నల్కకుఁ బైఁడితున్కకుఁ జెల్లు' అనుటయేకాక, '.... గనలు మోడి యలుక కినుక కిన్కనాఁగఁ గోపాఖ్య లగు'అని (మాన 22 లో) 'కోప' పర్యాయముఁ గాఁ గూడ దీనిని వచించు చున్నది. దీనినిఁబట్టి (లాక్షణికము గా ఏర్పడిన (అర్థాం.) గా దీనిని లెక్కింపవలసి ఉన్నను, కేవలము 'కోపము' దీనికి అర్థ మనవలసినంతటి-ఆవశ్యకత గలప్రయోగము లేవియు (సూ.ని.)మొ. ప్రదర్శింపట లేదు దీనికి. ఇందుమూలమున (సాంబ ) 'కోపమౌనము' నే సాధారణము గా (విశేషవివక్ష లేక) 'కోప' మని వ్యవహరించినది (నానా.ఆం.భా.ను చూచి) అని తోఁచు చున్నది. (కలువా.శ.) ప్రయోగ మొకటి ఇ ట్లున్నది- 'మ్రొక్కి వేఁడినఁగాని మోడి మాననివాఁడు, పెక్కులు బతిమాలి వేఁడ సాగె' (84.). ఇట 'మోడి' 'కోపము'నుగాక 'కోపమౌనము' ను వచించు చున్నది-అనుటయే సముచితము. దీనికి 'బింకము,పట్టుదల (మొ.) (అర్థాం.). (శ.ర.) 'వ్రాఁతయొక్క వైఖరి'అనియు ఒక-అర్థ ముదాహరించినది. ప్రయోగములు చూచినంతలో 'విధము'అను-అర్థమునే (సాధారణము గా) బోధించు (ఆం.భా ) (అర్థాం )కు లక్ష్యములు తాఁ దగినవి గానే ఉన్నవి-'మోముఁ జూచిన

శశిరేఖమోడి యమరె' (తారా.3.50.). 'రేజోతిజాగోడజాజుటాకు ...తీగమోడిపనులఁ... ' (ఘటి. 2.69.) మొ.

వేఁట:—'వేఁట నా గొఱియకు వేఁట కమరు' (సాంబ. నానా. 94.). ఇది 'గొఱ్ఱె' అర్థ మను చున్నది. దీనికి (ఆం.భా.) 'గొఱ్ఱెపోతు' అర్థ మని వచించినది. 'మేష' శబ్దమునకు 'మేషో రాశిప్రభేదే స్యా దురణే భేషజాన్తరే' అని (విశ్వ.) మొ. 'ఉరణము' అర్థ మను చున్నవి. (వైజ.) 'మేషే శృఙ్గిణ సంఘాల . ఏడకో ఉప్యరణో మీఢ ఉరభ్రో రోమశో ఉష్యవిః । మేషీతు కురరీ వేణీ.. .' భూమి.పశు.)' అని 'ఉరణ' శబ్దమునకు 'గొఱ్ఱెపోతు' అర్థ మని, 'మేష'శబ్దము ఏతత్పర్యాయ మనినది. (ఆం.భా.కూడ) 'గొఱ్ఱె గొఱ్ఱియ యనఁగను గొఱలు మేషి । తగరు పొట్టే లనంగను దనరు మేష(ము)' (2.265.) లని 'మేష' శబ్దమునకు 'గొఱ్ఱెపోతె' అర్థ మనినది. ప్రయోగము లి ట్లున్నవి-'శశముపిశితంబు పక్షిమాంసంబు పంది। యామిషంబు వేఁటపలలంబు నధిక మైన । తృప్తి యొనరించు నొగిఁ బితృదేవతలకు ...' (మార్క. 3.200.). '....గందకున్।వెలయన్ వేఁటలు (ల?) బోనమున్పిడులు గావించెన్ సుతోత్పత్తికై ...' (హంస. 2.91.). (ఇట 'వేఁట-మేఁకపోతు'అని (సూ.ని.). (మేషము-మేఁక) అని సాధారణ(వ్యవ.).

బల్ల:—'కుంచము'అని (శ.ర.). (ఆం.సం.) 'కుంచము' 'బల్ల'వే అను చున్నది-'తూము ముంత ముకుసంబు । బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ । ధాన్యములు కొలుచువానికిఁ దగును' (మాన.52.). (ఆం.భా.) 'తూము నా నాఢకాభిధ తోఁచు చుండు'అనినది (చూ.2.280.).

సీ. కంటకావృతియును గాంతి యౌ వెలుఁ, గనఁ;
బవనశైత్యంబులు వలి, యనఁ దగుఁ;
బరిమళవీధులు వాడ, యం చన మీఱు;
వెలి, యటం చన బహిశ్శ్వేతము లగు;
ఖడ్గదీర్ఘంబులు గనుపట్టు వాలు, నా;
యతివేగములు వడి, యనఁ దనర్చుఁ;
బ్రత్యుపకారంబు గ్రామ మౌ వీడు, నా;
సరి, యనఁగా దామసమము లొప్పు;

గీ. సాక, మనఁగను వ్యాజ ముత్సవము దోఁచు;
నల్పరవమును రతి సంచు, నాఁ దనర్చు;
నల్పమార్గంబు మల్లవిద్యావిశేష
మొప్పు సం, దన; శ్రీమాతృభూతలింగ ! 59

వెలుఁగు—(వెలుగు) ఇది కంటకావృతికి (కంచెకు; పశువులు మున్నగునవి ప్రవేశింప కుండ చేనుచుట్టును కంపచే ఏర్పఱచిన 'ఆవరణము'నకు), (వెలుఁగు) కాంతికి (ప్రకాశమునకు) పేరు.

వలి—ఇది పవనమునకు (గాలికి), శైత్యమునకు (చల్లఁదనమునకు) పేరు.

వాడ—ఇది పరిమళమునకు (సువాసనకు), వీధికి (ఇండ్లవరుసలు రెంటికి నడుమ ఉండుత్రోవకు) పేరు.

వెలి—ఇది బహిఃప్రదేశమునకు (బాహ్యమునకు; బయటిప్రదేశమునకు), శ్వేతమునకు (తెలుపునకు; తెల్లనిదానికి) పేరు.

వాలు—ఇది ఖడ్గమునకు (కత్తికి), దీర్ఘమునకు (నిడుపునకు; నిడివి గలదానికి; పొడు గైనదానికి) పేరు.

వడి—ఇది యతికి (పద్యములోనివిశ్రమస్థానమునకు), వేగమునకు పేరు.

వీడు—ఇది ప్రత్యుపకారమునకు(ఉపకారమున కైనమాఱుపకారమునకు), గ్రామమునకు (ఊరికి) పేరు.

సరి—ఇది దామమునకు (దండకు; హారమునకు), సమమునకు (సదృశమునకు; పోలినదానికి) పేరు.

సాకము—ఇది వ్యాజమునకు (మిషకు; నెపమునకు; మిథ్యాహేతువునకు; నిజమగుకారణము కానిదానికి), ఉత్సవమునకు (పండుగునకు; సంతోషకర మగుదినమునకు) పేరు.

సంచు—ఇది అల్పరవమునకు (కొద్దిపాటిధ్వనికి; సన్నని యెలుఁగునకు), రతికి (సంగమమునకు; కలయికకు; కూటమికి) పేరు.

సందు—ఇది అల్పమార్గమునకు (కొద్దిపాటిత్రోవకు; చిన్నవీథికి), మల్లవిద్యా విశేషమునకు (ఒకదినుసుమల్ల విద్యకు) పేరు.

వలి:—'... వలి యనఁ దెమ్మెరకుఁ జలి । కలరారు' (వేంక.నానా.128.). 'చలికిని గాలి కొ వలి యనంగ' (నానా.89.) అని (సాంబ.).

వాడ:—'పసుపుతావికి వీధి కెసఁగు వాడ యనఁగ' (సాంబ.నానా.89.).

వెలి:—'వెలి యన బయటికి వెల్లనకుఁ దనర్చు' (సాంబ.నానా.94.). 'వెలి యన గడకును వెలుపలికినిఁ దెలు,పునకు వర్తిలు . ' (వేంక.128.).

గ్రామము:—'పట్టనపర్యాయము-వీడు' అను చున్నవి ఇతరనిఘంటువులు. 'పల్లె కొట్టిక, కొటిక కుప్పమ్మొ నాఁగ । నూ రనఁగ గ్రామనామంబు లొప్పు చుండుఁ । బట్టణంబున కాఖ్యలు పరఁగు చుండుఁ । బ్రో లనఁగ వీ డనంగను' (ఆం.సం.స్థా.4.). 'వీడు నాఁగ బదులు । నకు వదలు మనుటకుఁ బ్రోలుకుఁ జెలంగు' (వేంక.నానా.128). (ఆం. భా.) 'గ్రామపర్యాయము 'వీడు' అను చున్నది. ఇది మఱియొక-అర్థము దీని కన వలయును ; 'పట్టణము'అను-అర్థము ప్రసిద్ధ మగుటనుబట్టి వదలి, ఈ-అర్థమును(ఆం.భా.) వచించిన దనవచ్చును. (బ్రౌ) దీనికి 'పారితోషికము-కట్నము'-'అర్థ'మని'ఉపకారికి నుపకారము। విపరీతము గాదు నదియు వీఁడుకు వీడే ' । అపకారికి నుపకారము । నెప మెన్నక చేయువాఁడు (నేర్పరి)' - (సుమ.19.) అని ఉదాహరించినవి. ఇట-(వేంక.) వచించిన 'బదులు' అను-అర్థము సంగతము గా తోఁచినను, పరిశీలించి చూచినప్పుడు అసంగతమే అది మొదట ఒనర్చినది-'బదులు' - (ప్రత్యుపకృతి)' కాదు, ఉపకృతి అది. కనుకనే, 'బదులు'కు బదులే' అనుట కుదురదు. ఇదిగాక, మఱికొన్ని ప్రయోగములు (పారితోషికము-అర్థము చెప్పవలసినవి) (బ్రౌ.) మొ. ఉదాహరించు చున్నవి. (ఆం.భా.) 'ప్రత్యుపకృతి' ఈ'పారితోషికము'నకు ఉపలక్షక మనవచ్చు నేమో ;

సాకము:—'సాక । మన జాతరకు నెపమునకుఁ దనరు' (వేంక.నానా,128 ). ఈ 'జాతర'ను ఉత్సవవిశేషమును గా పేర్కొనినది (ఆం.భా.). 'పరఁగుఁ బబ్బము పండుగ పండు వసఁగ । నుత్సవము, తద్విశేషంబు లొప్పుఁ దేవతంతు సాకము నంప జాతర కొలు వన' (1.143.). ఈ 'ఉత్సవ విశేషము'లనే (ఆం.భా.) సామాన్యవివక్షతో ఇట 'ఉత్సవ'మనిన దనిపించును ;

సంచు:—'సంచు నాఁగను బాణసంచున తెలుఁగున । కుసు రతికిని సంజ్ఞ కొఱలు చుండు'(వేంక. నానా.129.).

సీ. ముఖపతితాహారమును దంతవసనంబు
వాతెఱ, యంచన ఖ్యాతిఁ గాంచుఁ;
బులిసినవంటకంబును వృషభంబును
బులికూడు, నాఁగఁ బేం పొంది యుండు;
స్త్రీమత్స్యభేదముల్ దీర్ఘలోచనములు
వాలుఁగన్ను, లనంగ వఱలు చుండుఁ;
యమనిష్ఠధాటియు నాయుధభేదంబు
జముదాడి, యంచన నమరి యుండు;

గీ. నభ్రగంగ శిరస్తోద మలరును దల
యే, రనంగ; నఖక్షతశారికాళి
ధానములు గోరువంక, నాఁ దనరి యుండుఁ;
బుంగవతురంగ! శ్రీమాతృభూతలింగ! 60

**వాతెఱ**—ఇది ముఖపతితాహారమునకు (మొగమునుండి పడిన 'ఆహారము'నకు (అన్నాదులకు), దంతవసనమునకు (రదనచ్ఛదమునకు; పెదవికి) పేరు.

పులికూడు—ఇది పులిసినవంటకమునకు (పులియోరకు), వృషభమునకు (పులికి ఆహార మగుటఁబట్టి) ఎద్దునకు పేరు

వాలుఁగిన్నులు—ఇది స్త్రీమత్స్యవిశేషములకు (ఒకజాతిఆఁడుచేఁపలకు), దీర్ఘలోచనములకు (నిడుదకిన్నులకు) పేరు.

జముదాడి—ఇది యమనిష్ఠధాటికి(యమునిధాటికి;యమునిదండయాత్రకు), ఆయుధభేదమునకు (నిఖు పైనపిడి గల కటారికి) పేరు.

తలయేరు—ఇది అభ్రగంగకు (ఆకాశగంగకు; మందాకినికి), శిరస్తోదమునకు (శిరోవేదనకు; తలనొప్పికి) పేరు.

గోరువంక—ఇది నఖక్షతమునకు (గోరొత్తునకు; గోటినొక్కునకు, గోటిగాయమునకు), శారికకు (గోరింకకు) పేరు.

వాతెఱ:—దీనికి మొదటి-అర్థమును ఏనిఘంటువులు ఇచ్చుట లేదు. (వాతి-ఎర) అని ఈయర్థమున ఛేదము.

పులికూడు:—'పుల్లనీళ్ల అన్నము'-అని (బ్రౌ.).

['పులిసినవంటకంబును పులిహోరంబు'-అని (బ్రౌ.వావి.పా.). ఇట, 'పులిహోరము - వ్యాఘ్రహారము'-అని (బ్రౌ.వ్యాఖ్య.) (చూ.అను.)].

వాలుఁగన్నులు:—మొదటియర్థమున- (వాలుగ+అన్ను-లు.) అనవలయును.

జముదాడి:—'జముదాడి యని తోఁప జముదాడిపోటులం గూలఁ ద్రోతుముగదా ! ఘోరలీల' (కృష్ణ.3.18.) (చూ.సూ.ని.).

గోరువంక:—'గోరంక' 'గోరింక' (రూపాం,). 'గోరవంక గోరంక నా గోరువంక । యనఁగ శారికాహ్వాయములు' (వేంక.తిర్య 100.) ఇట (పారాం,) ఇ ట్లున్నది-'గోర గోరింక గొరవంక గోరవంక' (అని.). '....బట్టికాఁడు గో,ర్వంక గోరింక గోరంక యనఁగ । శారికాహ్వాయము లెసఁగు' (సాంబ.తిర్య.78,).

సీ. కబళపరీమళక్షత్యర్ధములయందుఁ
గనుపట్టుచుండును గడి, యనంగఁ;
జంద్రకమ్ములును లోచనములు రంధ్రము
లెచ్చె న్నొందు చుండును గన్ను, లనఁగఁ;
గబరియు శిఖయును గార్ముకాగ్రంబును
గొ,ప్పని పల్కఁ గా నొప్పు చుండు;
శ్యామలవర్ణంబు సాక్షియు మర్యాద
పరఁగుచు నుండును గఱి, యనంగ;

గీ. నిగ్గు చిఱుగడ్డ కుటిలంబు నెఱి, యనఁ దగు;
వ్యథ గొలుసు గొప్ప వెలయును బారి, యనఁగ;
బిందు నక్షత్రతిలకము ల్వెలయు చుండుఁ
జుక్క, యనఁగఁ; బరాంతకచోళవైరి ! 61

కడి—ఇది కబళమునకు (ముద్దకు; గోమయాది పిండమునకు), పరిమళమునకు (సువాసనకు), క్షతికి (గాయమునకు) పేరు.

కన్నులు—ఇది చంద్రకములకు (నెమిలి (పురి) కన్నులకు), లోచనములకు (నేత్రములకు), రంధ్రములకు (వల-మున్నగువాని) సందులకు (బొక్కలకు) పేరు.

కొప్పు—ఇది కబరికి (ధమ్మిల్లమునకు; తలయందు దోఁపినస్త్రీలవెంట్రుకలముడికి), శిఖకు (సిగకు; (మగవాని) జుట్టుముడికి), కార్ముకాగ్రమునకు (వింటికొనకు) పేరు.

కఱి—ఇది శ్యామలవర్ణమునకు (నల్లనివన్నెకు), సాక్షికి (సాకిరికి; వృత్తాంతము కని విని తెలిసినవానికి), మర్యాదకు (మేరకు; హద్దునకు) పేరు.

నెఱి—ఇది నిగ్గుకు (జిగికి; గొప్పకాంతికి), చిఱుగడ్డకు (చిఱువేరునకు; బట్టకు ఎఱ్ఱరంగు వేయుటకు ఉపయోగించెడిమూలమునకు), కుటిలమునకు (వక్రమునకు; వంకర కలదానికి) పేరు.

బారి—ఇది వ్యథకు (బాధకు), గొలుసునకు (ఏనుఁగు లో నగువానికాల నుండు గొలుసునకు; సంకెలకు), గొప్పకు (గొప్పదానికి; పరిమాణాదులచేతను, విలువ చేతను గొప్పతనము కలదానికి) పేరు.

చుక్క—ఇది బిందువునకు (ఏరు లో నగువానిబొట్టునకు), నక్షత్రమునకు, తిలకమునకు (మొగమునం దుంచుకొనుబొట్టునకు) పేరు.

కబరి:—'కేశకూట స్తు ధమ్మిల్లః కబరీ కర్పరీ సమే' (వైజ. పాతా. భూతా) కబరిని, ధమ్మిల్లము ను వేఱుపఱచినది (అమ.) 'కబరీ కేశవేశో౽థ ధమ్మిల్లా స్సంయతాః కచాః' (అని.).

శిఖ.—'శిఖా చూడా కేశపాశీ' (అమ.).

కఱి:—ఇది (2,3) అర్థములందు లఘురేఫయుతము. (1) అర్థమున శకటరేఫయుతము.

చిఱుగడ్డ:—దీనికి (చిఱుగడ్డకు)కలఅర్థ మేమో నిఘంటువులు వివరింపలేదు. 'చిఱువేరు'నే 'చిఱు గడ్డ'అని(ఆం.భా.) ఇట అనిన దనిపించినది. 'గడ్డ, వేరు, దుంప' పర్యాయము లనవచ్చును.

గొలుసు:—'గొలుసు లలంతికావిశేషం బగు' అని (ఆం.భా.2.149.) పూర్వము వచించినది. 'బారి'కిఁ గలప్రయోగములను పరిశీలించి చూడఁగా,ఇట అది అర్థము కా దనిపించినది. ఇఁక (సంకెల-శృంఖల, నిగళము ('ఏనుఁగుకాలిగొలుసు'అను-అర్థమే : యిట వక్తవ్య మని తోఁచినది. ప్రయోగము లి ట్లున్నవి-'మత్త। వారణేంద్రంబు ద్వారంబుఁ జేరి పెద్ద। బారిచే వైరి బారుల బారిసమరె' (రా. వి.5. 20.) (చూ.సూ.ని.). (సం.ప్రారి.క బారి.). ((బ్రౌ.) బారిగొలుసు-'ఏనుఁగుతొండముతో తీసికొనిపొయ్యేగొలుసు'అని అర్థ మిచ్చి ప్రయోగములు చూపినది 'సౌరగజేంద్రము దానిన్ బారిగొలుసుతో విసర' (తారా.5.24 ) 'బారిగొలుసులఁ బర బలంబులం బాయం గొట్టి'(తారా.5.24.) (అని.). 'నహ్యైకదేశే నామగ్రహణమ్' అనురీతిని 'బారిగొలుసు'న కైనదే'బారి'. 'బారిగొలుసు' లోని 'గొలుసు' గూడ పై న్యాయమున 'బారి గొలుసు' అను-అర్థమును వచింపఁ గలదు. 'సత్యభామను (భామ-సత్య') అనునట్లే :

సీ. ధనురగ్రమద్యనృత్తావయవమ్ములు
గొఱలుచు నుండును గోపు, నాఁగఁ;
బడిగలు మడిలోనఁ బడినయెన్నులు నేటి
కడనేల లొప్పును బడిగ, లనఁగఁ;
దామర ల్కొండమీఁదఁ గలనేలలును జూ
దమ్ములు వెలయు నెత్తమ్ము, లనఁగఁ;
జంద్రమఃక్షత్రియ సర్వంసహాపతుల్
రాజిల్లు చుందురు రా, జనంగఁ;

గీ. ప్రసవఖర్జూరసలిలసంప్లావనములు
వెలయు నీఁత, యనంగను; గలికి, యనఁగఁ
గొంగతలయాఁక దంటయు గోమలియును
బొలుచును వినంగ; శ్రీమాతృభూతలింగ ! 62

కోపు—ఇది ధనురగ్రమునకు (వింటికొనకు), మద్యమునకు (మద్యవిశేషమునకు;

సారాయికి), నృత్తావయవమునకు-నాట్యముతీర్పునకు (నాట్యములోని-ఒకవిధ మగు నడకకు) పేరు.

పడిగలు—ఇది పడిగలకు (పాముపడగలకు), మడిలో పడినయెన్నులకు (చేనియందు రాలినవరి లో నగువానికంకులకు; కణిశములకు), ఏటికడనేలలకు (నదీప్రాంతమందు ఉండుభూములకు) పేరు.

నెత్తమ్ములు—ఇవి తామరలకు (పద్మములకు), కొండమీఁద కలనేలలకు (కొండలపై ఉండెడి (విశాల) సమప్రదేశములకు) జూదములకు (పాచికలయాటలకు) పేరు.

రాజు—ఇది చంద్రునకు, క్షత్త్రియునకు (రాజన్యునకు; క్షత్త్రియస్త్రీయందు క్షత్త్రియునకు పుట్టినవానికి; రాచవానికి), సర్వంసహాపతికి (భూపతికి; పుడమిఱేనికి; నృపతికి) పేరు.

ఈఁత—ఇది ప్రసవమునకు (ఈనికకు; పశ్వాదులు(పశువులు పక్షులు అప్రాణులు-ఈనుటకు), ఖర్జూరమునకు (ఖర్జూరికకు; ఖర్జూరపుచెట్టునకు), సలిలసంప్లావమునకు (ఈఁదుటకు; కాలుసేతులసాహాయ్యముతో నద్యాదులను దాఁటుటకు) పేరు.

కలికి—కొంగతలయీఁకకు దంటకు, (సమర్థునకు; జాణకు; నేర్పరికి), కోమలికి (స్త్రీకి) పేరు.

నృత్తావయవము:—'పదార్థాభినయో నృత్యమ్. వాక్యార్థాభినయో నాట్యమ్. అఙ్గవిక్షేపమాత్రం నృత్తమ్'అని శాస్త్రకారులు నృత్యనృత్తనాట్యములకు భేదము చెప్పు చున్నారు. కవులు ఈభేదమును అంతగా పాటించుట లేదు.

కోపు:—'కోపు నా నాటలోఁ గోపు కొప్పిదమున, కు విలుగొనయమున కగుఁ దుమ్మ । చెక్కసారాయికిఁ జెలఁగు . .' (వేంక,నానా.110.) (మొ.).

పడిగలు:—'పాముపడగ, టెక్కెము'అను - అర్థములయందు 'పడగ'లని అన్మధ్యమమునుగానే చాల నిఘంటువులు దీనిని ఇచ్చినవి. 'పఱిగ'అని'మూఁడవ-అర్థమును'(ఆం భా.) దీనికి ఇచ్చుచున్నందున 'పడగ'కు (రూపాం.)గా 'పడిగె' ఈ-అర్థమున (ఆం.భా.) గ్రహించియే ఉన్నది 'పడిగె నాఁ బడ గ నా సృట దనరారు' (1.148.) (అని.). 'టెక్కెము' అను - అర్థమున

'పడగ' అనియే (ఆం.భా.) అనినది (చూ.2.221.) (ఆం.భా.) తోపాటు (సాంబ.ఆం.సం.) కూడ ఈ-అర్థమున 'పడగ'అనియే దీనిని అను మన్నవి 'ధ్వజంబుపేళ్లు పడగ డా లనఁ జెల్లు' (సాంబ.స్థా.62.). 'కేతనాహ్వయము లగు .పిడె మనఁగఁ డెక్కె మనఁ గాఁ। బడగ యనన్ డా లనంగ' (ఆం.సం స్థా 12.). 'ఏటికడనేల'ను 'పడిగ' (ఆం.భా.) వచించిన దని పూర్వము వ్యాఖ్యాతము (చూ.2 6.). (సూ.ని.శ.ర.లు)'పడిగ' గ్రహింప లేదు (బ్రౌ.) 'పడిగ' గ్రహించి, ఈ(ఆం.భా.)కు 'సర్పఫణము, టెక్కెము, మడిలోన పడినవెన్నులు, ఏటికడనేల'అను-అర్థములను ఇచ్చినది. ప్రకరణమునుబట్టి మూఁ డర్థములే ఇట వచింపఁబడ వలసి ఉన్నవి. 'టెక్కెము'అను-అర్థము ఇచ్చుటే-ఆం.భా.'పడిగ'కు అర్థము కా దనిపించును పై నిఘంటుపరిశీలనమున. (మూఁడవ-అర్థమును) 'పఱిగ'అనియే నిఘంటువులు ప్రయోగము లిచ్చి అను చున్నవి. 'పఱిగ' 'పఱిగె'అని (వ్యవ.). బ్రౌ. 'పఱిగె' అను చున్నది.(ఆం.భా ) 'పఱిగ'అను చున్నది. (ఆం.భా.)-'పఱిగ' కే 'ర-డయో రభేదః'అని 'ఱ-డ' లకు అభేద మొనర్చి (రూపాం.) గా 'పడిగ' అనినది.

ఏటికడనేల:—నదీప్రాంతము. 'పడిగమడ, పడిగమెడ, పడిగెమడి, మడి' - అని(శుద్ధాం,పా.)' అని ఒక నిఘంటువు.

నెత్తమ్ములు:—ద్యూతవిశేషముగాక, ద్యూత సామాన్యము దీనికి అర్థ మని (ఆం.భా.) పూర్వము వచించినది. ' .. జూదం బనంగ, నెత్త మనంగను ద్యూతము నివ్వటిల్లుఁ (2.304.) (అని.). (ఆం.శే.) కూడ ఇట్లే (ఆం.భా.)తోపాటు 'ద్యూతసామాన్యమే' దీనికి అర్థ మను చున్నది 'జూద మన నెత్త మనఁగ దురోదరంబు' (54.). (బ్రౌ.)కూడ 'నెత్త మ్ములు' అనుదానికి (నెత్తమ్ములు) అనగా 'బయళ్లు, జూదమ్ములు, తామరలు, కొండమీది భూములున్ను' (D) అని వచించినది. భార. ప్రయోగముగూడ ఇ ట్లున్నది 'అన్నదమ్ములు నెత్తమ్ము లాడి సతుల। తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి। చీర లొలిపింతురే . .' (ఉద్యో. 3.367.). ఇట 'ద్యూతసామాన్యము' అర్థ మనుటయే ఉచితము. అట్లే అనినది (సూ.ని.). ఇఁక 'సోళాదొప్పియు నెత్తమున్ మొదలు గా జూదంబు లీవాడునవ్వేళన్....' (జై. 3.42.) ప్రయోగముతోపాటు ఈ (ఆం.భా.) ను గూడ ఉదాహరించి. ఈ (ఆం.భా.) లోని 'నెత్తమ్ము' గూడ 'ద్యూతవిశేషవాచక' మను చున్నది (సూ.ని.). ఇది సముచిత మనిపించుట లేదు. (శ.ర.) పై (జై.భార.) ప్రయోగ మిచ్చి, ఈ ప్రయోగములోని 'నెత్తము' నకు

'పాచికలాట' అర్థ మను చున్నది. 'పాచికలాట' (ద్యూతసామాన్యమేకాని) ద్యూతవిశేషము కాదు. 'అక్షా స్తు దేవనాః పాశకా శ్చ తే' అని (అమ.). ద్యూతపర్యాయములను (అమ.) ఇ ట్లుదాహరించినది 'ద్యూతో ఒస్త్రియా మక్షవతీ కైతవం పణ ఇ త్యపి' (అని). ఇట (సుధ) 'అక్షవతీ' శబ్దమునకు (వ్యు.) ఇట్లు వచించినది - 'అక్షాః పాశకాః స న్తి అస్యామ్। మతుప్ (5.2.94.) అని. 'పాశకములే పాచికలు 'పాచికలాట-ద్యూతము' పర్యాయములు. కనుక, 'పాచికలాట ద్యూతసామాన్యమే' కాని ద్యూతవిశేషము కాదు. పై (జై) ప్రయోగములోని 'నెత్తము' 'ద్యూతవిశేషము' అర్థము గా కలది. (శ.ర.) 'పాచికలాట' దీనికి అర్థ మనుటకంటె 'సోళాదొప్పి'కి వచించినట్లే 'ద్యూతవిశేషము' అని అర్థము చెప్పుట యుక్తము. అందులకే (సూ.ని.)(నెత్తము) వి. (క నెత్త=నేత్రశబ్దతద్భవము. కన్నులవంటి గుఱుతులు కలది దీనికి వృత్తియందు కొన్నిపట్ల పైకల్పికము గా ముపర్ణలోపము (చూ.నెత్త పలక.)అని,పాచికలాట, జూదము, ద్యూతవిశేషము' అనినది.(ఆం భా.) 'నెత్తమ్ములు' అను దానికి వచించు చున్న రెండు, మూఁడు-అర్థములు క్రింది (మనుచ) ప్రయోగమును లక్ష్యముఁ గాఁ గొను చున్న వన వచ్చును 'నెత్తమ్ము లేకొండనెత్తమ్ములం దాడు, విద్యాధరీ కోటి విటులతోడ' (4.78). 'కొండనెత్తమ్ము' లనుట 'కరికలభము. గజఘటలు' మొ. వంటిది. మొదటి-అర్థమున (నెఱ+తమ్మి) అనఁ దగిన దిది 'తప్పు లే కుండ నేల నెత్తమ్మి మొగడ, విసరి వక్షఃప్రదేశంబు ప్రేటుగొంటి' (హర.1.27.). 'నెత్తమ్మి'-(పద్మము).

క్షత్త్రియుఁడు:—'క్షత్త్రా ద్ఘః' (4.1.138) 'జాతా వి త్యేవ' (సి.కౌ.).

రాజు:—'రాజా ప్రభౌ చ నృపతౌ క్షత్త్రియే రజనీపతౌ' (మేదిని).

[(వెలయు) సీఁత —' సీత్ర' (వావి.అపముద్రి.)]

సీ. కచబంధమును శిఖ గంధమూషికమును
శోభిల్లు చుండును జుంచు, నాఁగ;
నల్పతరక్షుబాలాభిధానంబులు
చిఱుత, యం చనఁగను జెలఁగు చుండు;
రాజియు సంవత్సరాంతంబు లాంగల
పద్ధతి చాలు, నాఁ బరఁగు చుండు;
వాజినీగర్భంబు వాచవు లుమ్మెత్తెంపు
తూనిక చవులు, నాఁ దోఁచు చుండుఁ;

గీ. దిలకభూషావిశేషబిందులు చెలంగు
 బొ, ట్టనంగను; జంపు, నాఁ బొల్చి యుండు
 సముదయాలస్యఝుల్లరీసంజ్ఞ లగుచు;
 ధార్మికనిధాన ! మాతృభూతాభిధాన ! 63

చుంచు—ఇది కచబంధమునకు (కబరికి; కొప్పునకు), శిఖకు (సిగకు; పిల్లజుటునకు), గంధమూషికమునకు (కంపెలుకకు; చుంచెలుకకు) పేరు.

చిఱుత—ఇది అల్పమునకు (చిన్నదానికి), తరక్షువునకు (క్షుద్రశార్దూలమునకు; సివంగికి), బాలునకు (పిల్లవానికి) పేరు.

చాలు—ఇది రాజికి (పంక్తికి; వరుసకు; శ్రేణికి; బారునకు), సంవత్సరాంతమునకు (సంవత్సరమునకు), లాంగలపద్ధతికి (నాఁగలిమార్గమునకు; నాఁగేటిచాలునకు; నాఁగలిరేఖకు) పేరు.

చవులు—ఇది వాజినీగర్భమునకు (గుఱ్ఱపుచూలునకు), వాచవులకు (నాలుకకు ప్రీతి కలిగించుదానికి; రుచికి); ముత్తెముల తూనికకు (ముత్యాలయెత్తునకు) పేరు.

బొట్టు—ఇది తిలకమునకు, భూషావిశేషమునకు (మంగలసూత్రమునఁ గట్టెడిఒకవిధ మగుబంగారుసొమ్మునకు; పుస్తెకు), బిందువునకు (సున్నకు (లేక) నేయి మొద లగువానిచుక్కకు) పేరు.

జంపు—ఇది సముదయమునకు (సముదాయమునకు; సమూహమునకు; గుంపునకు) అలస్యమునకు (విలంబమునకు; జాగునకు), ఝుల్లరికి (గొడుగు మున్నగువానికి చుట్టు కట్టెడిజాలరునకు) పేరు.

చుంచు—'చుంచు నాఁ గబరికి జుట్టున కెలుకకుఁ, జెలఁగుసు' (ఆం, సం . నానా.114.). కేశవేశము-కబరి,కొప్పు-అని (శ.ర.).

తరక్షువు:—ఇట, 'క్షుద్రశార్దూలము-సివంగి'అని (సూ.ని.). (ఆం.భా.) ఈపద్యమున 'తరక్షువు' అని అర్థనిర్దేశ మొనర్చు చున్నది.'తరక్షు స్తు మృగాదనః'అని(అమ,).'చివ్వంగి నాఁ జెలఁగుఁ దరక్షువు' అని ఆం.భా.(2.82.)లో వచించినది. ఆపద్యముననే 'చిఱుత'ను వేఱు గా నిర్దేశించుచు

'..మల్పశార్దూలాఖ్య యలరుచుండుఁ।జిఱుత చిఱుతపులి చిఱుపులి యం చన' అనినది (ఆం. భా.)ఈపట్టున (వేంక.)'. .జిఱుత నాఁ, జిఱుతగండునకుఁ జేచిన్నిదుడ్డు।కోలకు నిసువునకుఁ దలిర్చు' (నానా.114.)అను చున్నది 'శిశువును బులియు నౌ చిఱుత యనఁగ' (సాంబ.నానా. 91.).(సాంబ.)లోని యీపులి చిఱుతపులియే। (ఆం.భా ) ఇట చిఱుత'నే 'తరక్షువు' అనిన దనిపించును. చిఱుతపులులలోని-ఒకభేదమే 'సివంగి' కావలయును।(సాంబ.)'చిఱుత'ను'పులి' అనినట్లే (విశేషవివక్ష చేయక) సామాన్యవివక్షతో (ఆం భా.) 'తరక్షు' వని యుండును చిఱు తనే। పులులలోనిభేదములను(వై జ.) ఇట్లుదాహరించు చున్నది-'వ్యాఘ్రో మృగారి శ్శార్దూలో హింసారు శ్చన్ద్రికీ మృగాత్ । హుణ్ణ శ్చాల్ప స్స్వయం ద్వీపీ చులుకో భేలమేహిసౌ॥ తరక్షు స్తు మృగాజీవ స్తిలిత్సకమృగాదనౌ । పిణ్డారక స్తు చిత్రాఙ్గో మహాదంష్ట్రో వరోత్కటః' (భూమి.పశు.). 'పిణ్డారకము-చిత్రాఙ్గవ్యాఘ్రభేదము-చిఱుతపులి'-అని (కే ని.). 'మహాదం ష్ట్రము'కడఁగూడ 'ఒకజాతిపులి'అనియే(కే ని.) (చూ,సూ ని.). ఈ (కే.ని.) సంవాదమునుబట్టి ఇవి అన్నియు వ్యాఘ్రభేదము లనుటకు సంశయము లేదు. 'చిత్రాంగము'కడ (సూ.ని ) 'ఒకక్రూరజంతువు' (వై.ని.)అనుట ప్రమాద మనిపించును. 'తిలిత్సా'దులకు-'కొండచిలువ' మొ. అర్థములు గూడ (అర్థాం.) అనఁ దగినవి గా తోఁచును.

చాలు:—' ..చాలు నాఁగను । బంక్తికి లాంగలపద్ధతి వల, దనుట కేడాది కొల్వాయె ననుట కొప్పు .' (వేంక.నానా.115.). (శ.ర.(సాలు)-హిం.వి. సంవత్సరము - అను చున్నది.). (సూ ని.) (సంవత్సరము గాక) రెండవ-అర్థము గా 'సంవత్సరాంతము'అనుదానిని ఇచ్చి ఈ (ఆం.భా.) ప్రమాణము గా ఉదాహరించినది. 'అంత' శబ్ద మిట స్వరూపార్థకము. 'సంవత్స రాంత'మనుట 'సంవత్సరము' అనుటయే ' (సాంబ.) సంవాదముగూడ ఇది ఇట్టిదే అను చున్నది. (హిం.సాల్.) 'చాలు'నకు వచ్చువాని 'అయివేజు' ఎంత ? అని (వ్యవ.). ('అయి వజు') (హిం.వి.) అని (శ.ర.).

[రాజియు:—'రాజిల్లు. . '(వావి.అపపా.)]

సీ. ఆహార మాఁకలి యవనిపన్నగములు
పరఁగుచు నుండును నెర, యనంగ;
శ్వశ్రేయసార్థ ప్రశంసార్థములయందు
మీఱుచు నుండును మే, లనంగ;

వేఁటసాధనమును వీచియు యవనిక
దేజరిల్లుచు నుండుఁ దెర, యనఁగ;
గాదెబొట్టియును దుగ్ధాసారమును ముద్దు
గుమ్మయు వెలయును గుమ్మ, యనఁగ;

గీ. గజవిశేషంబు ముందువెన్కలను జూడ
నట్టివాఁడును గెంపులయందుఁ బాట
మునఁ దళుక్కనుజిగి దగు మొక్కళి, యన;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 64

ఎర—ఇది ఆహారమునకు, ఆఁకలికి, (ఎఱ) అవనిపన్నగములకు (మహీలతలకు; వానపాములకు) పేరు.

మేలు—ఇది శ్వశ్రేయసమునకు (శుభమునకు), అర్థమునకు (ప్రయోజనమునకు; ఫలమునకు), ప్రశంసార్థమునకు (పొగడ్తను తెలుపుటకు; మెచ్చునకు) పేరు.

తెర—ఇది వేఁటసాధనమునకు (వేఁట కగుపరికరమునకు; అడ్డువలకు), వీచికి (అలకు; తరంగమునకు), యవనికకు (జవనికకు; మఱుఁగుచీరకు) పేరు.

గుమ్మ—ఇది గాదెబొట్టకు (ధాన్యము-లో నగునవి పోసికొనుటకై ఏర్పడినమట్టి యొఱలబొట్టకు), దుగ్ధాసారమునకు (పాలు పిండునప్పుడు వచ్చుధారకు), ముద్దు గుమ్మకు (స్త్రీకి) పేరు.

మొక్కళి—ఇది గజవిశేషమునకు (మొక్కడికి; చిన్నదంతములు గలఏనుఁగునకు; పొట్టికొమ్ముల-ఏనుఁగునకు), ముందువెన్కలు చూడనివానికి (సాహసికునకు), కెంపులయందు పాటమున తళుక్కనుజిగికి (కృత్రిమపద్మరాగములందు ఎండచే తళుక్కని మెఱసెడి 'అధికకాంతి'కి) పేరు.

ఎర:—'. .నెఱ్ఱుకుఁ దిండి కౌ నెర యనంగ' (సాంబ.నానా.87.). ('ఎఱ్ఱ'కు-'ఎఱ'రూపాం.).
['. స్వశ్రేయసార్థ.. ' అని వావి.అపముద్రి.).]

మేలు:—'అర్థము' అనునది దీనికి మూఁడవ-అర్థముగా (ఆం.వా.)ఇచ్చు చున్నది. 'అర్థ'శబ్దము నానార్థములు గలది. 'అర్థో ఽభిధేయ రై వస్తు ప్రయోజన నివృత్తిషు' (అమ.). ఇచ్చట

ప్రయోజనము (ఫలము)' అను - అర్థము గ్రాహ్య మనిపించినది. క్రిందిప్రయోగము (ఆం.భా.)కు లక్ష్యము కాఁ దగినది గా ఉన్నది - '.. సరోజాక్ష ! తపస్సిద్ధికిం దగుమే లిచ్చుట గాదు పూర్వవిహితార్థం బింత కింతేటికిన్ (ఉ.హరి.2.200). ఇచ్చట ఇతరనిఘంటువు లిట్లు వచించినవి-'మే లన మీఁదికి మెచ్చునుడికి । మోదమునకు శుభమున కొప్పు' । (వేంక. నానా 124.).'మే లన శుభంబుపే రగు । మే లన నుపరికినిఁ గూరిమికినిం బే రౌ । మే లన మెచ్చునఁ బల్కిన । యాలాపంబునకు నాఖ్య యగు'(ఆం.సం.నానా.11). (ప్రయోగములకై (చూ.సూ.ని.). ప్రశంసార్థమున ఇది (అవ్య) 'అరరే ! దాంతి బళిరే ! శాంతిగుణ మయ్యా రే ! ప్రసాదంబు మా । యురె ! దాక్షిణ్యము బాపురే ! తెలివి మే ! లోహో ! తపం బౌర ! యా । దర మాహా ! మహిమం బహో! కలితమేధాశక్తి మజ్జారె ! స । త్కరుణాలో కన మంచు నాత్మ మునిరాట్కంఠీరవున్ మెచ్చుచున్' (చంద్రా.3.) (చూ శ.ర.'బాపురె').

['వేఁటసాధనమును':—'వేఁటసాధనములు' అని (సూ.ని.పా.) (చూ.తెర.) 'మత్స్యగ్రహణ సాధనము' గూడ అర్థ మనినది దీనికి (సూ.ని). (వేంక.) నానార్థములను దీనికి ఇ ట్లిచ్చి నది '....దెర యనంగను నల్లతెఅపికిఁ బెండ్లి లోఁ, దెరకు వేఁటాడెడు . తెర కెనఁగు...' (నానా.116.). ]

గాదె:—'గాజె' (రూపాం.). (గాజె)-ధాన్యము పోయుటకు మట్టియొఱలచే ఏర్పఱచినబొట్ట.కు సూలము-అని (శ.ర.). (ఆం భా) 'గరిసె' దీనికి పర్యాయము-అని (కుసూలము) అర్థ మనినది ఒకప్రయోగము ఇ ట్లున్నది-'భూమి నశ్రుతసమృతదృష్ట పూర్వ మైన । బహుళ సంపత్పరంపర పాదుకొనిన । గరిసె యనఁ గోట మించఁగ గఱన కెక్కె । నందుపై నిలు వార మన దివంబు' (చంద్రా.1 5.). మఱియొకప్రయోగము 'గరిసె' కిట్లు కానవచ్చు చున్నది-'కాయధాన్యమ్ములకణఁజము ల్బియ్యంపు, గరిసెలు దినుసులు గలకొటార్లు' (హంస. 2.226.) (చూ.సూ.ని.) పై (చంద్రా.) ప్రయోగము ఉదాహరించి (శ ర.) ధాన్య ముంచెడి కొట్టు (గరిసె) అనినది. (వైజ.) 'ధాన్యకోష్ఠే కుసూలః' అనినది. ఆ'కుసూలము'నే (శ.ర.) ఇట్లు వివరించిన దనిపించును. (హంస) ప్రయోగము 'బియ్యంపుగరిసెలు' అను చున్నది. ఇఁక (చంద్రా.)ప్రయోగమునుబట్టి 'ఇలువారము'గల్గది గా ఇది తెలియవచ్చు చున్నదిగావున, మట్టియొఱలతో ధాన్యాదు లుంచుటకు ఏర్పఱచినబొట్ట' ఇది అనుట ఉచిత మనిపించినది(చూ.

ఆం.భా. 2.240.). 'గాదె' అనుదానికి 'చిన్నబొట్ట'అను-అర్థము వ్యవహారదృష్టము.(సూ.ని.) 'సం.గంజః.) కుసూలము, ధాన్యము-మొద లగునవి పోసికొనుటకు ఏర్పడినచిన్నబొట్ట(చి.ని. శ.ర.)' అను చున్నది. (1929. ముద్రి.శ.ర.లో నావచించినరీతినే కానవచ్చు చున్నది.). (గరిసె-గాజబొట్ట-అని (బ్రౌ.) (చూ. అను.).

ముద్మగుమ్మ:—'మనోజ్ఞురా లగుఆఁడుది' అనునది (అర్థాం.). 'ముద్దులగుమ్మ' (రూపాం.). '....నెలఁత ముద్దులగుమ్మ....ముద్దియ యనఁ। బొంక మగుఁ గాంత కీపేళ్లు' (వేంక. మాన.35.). 'గుమ్మ గా దిది ముద్దులగుమ్మ గాని' (ఇలా.3.186.) (చూ. బ్రౌ. అను.).

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు నిచ్చలు 'నానార్థవర్గ' మిట్లు;
గైకొనుము దీని భక్తసంఘాళిమాని !
మాతృభూత ! జగత్త్రియీమాతృభూత ! 65

[ వ్యాఖ్యకై చూ. స్వర్గ. 68. ]

ఇది

నానార్థవర్గము

# అవ్యయవర్గము

సీ. అగ్గెడ, యక్కడ, యచట, యచ్చట, యాడ,
యందుల, పొనపొన, యయ్యెడ, యట,
యందు, నాఁ దత్రార్థ మై విరాజిలు చుండు;
నెగ్గెడ, యెక్కడ, యెయ్యె, డెచ్చ,
టెచ, టెందు, నాఁగఁ బెం పెసఁగు యత్రార్థ మై;
యిక్కడ, యిచ్చట, యిచట, యీడ,
యియ్యె, డిం, దనఁగఁ బెం పెక్కు నత్రార్థ మై;
యద్దిర, యయ్యారె, యౌర, మేల్, సె

గీ. బాసు, మజ్ఝా, బలారె, సేబాసు, నాఁగ
నలరు చుండుఁ బ్రశంసార్థములు గ; మీఁద,
పై, పయిని, నాఁగ నూర్ధ్వాఖ్య పరఁగు చుండు;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 66

అగ్గెడ, అక్కడ, అచట, అచ్చట, ఆడ, అందుల, పొనపొన, అయ్యెడ, అట, అందు—ఇవి 'తత్ర' అనుదానియర్థమునకు (ఆప్రదేశమునందు-అనుటకు) పేర్లు.

ఎగ్గెడ, ఎక్కడ, ఎయ్యెడ, ఎచ్చట, ఎచట, ఎందు—ఇవి 'యత్ర' అనుదానిఅర్థమునకు (ఏప్రదేశమునందు-అనుటకు) పేర్లు.

ఇక్కడ, ఇచ్చట, ఇచట, ఈడ, ఇయ్యెడ, ఇందు—ఇవి 'అత్ర' అనుదానిఅర్థమునకు (ఈప్రదేశమునందు-అనుటకు) పేర్లు

అద్దిర, అయ్యారె, ఔర, మేలు, సెబాసు, మజ్ఝా, బలారె, సేబాసు—ఇవి ప్రశంసకు (పొగడ్తకు; మెచ్చుకొనుటకు; శ్లాఘించుటకు; (బలే, బళీ, బళి-అనుటకు` కొనియాడుటకు) పేర్లు.

మీఁద, పై, పయిని—ఇవి ఊర్ధ్వమునకు (ఉపరిభాగమునకు; మీఁదిప్రదేశమునకు) పేర్లు.

**అగ్గడ**—(అ+గెడ)'దిగ్గియ నంచ దూఁడుకొని తీరవనేజవువంకమీఁదు గా। నగ్గడపుల్ల కేసరమునం దు వసింపఁగ ...' (ఆము. 5.122.). (టీక.) 'అప్రదేశమందున్న' - అని (బ్రౌ.). ఇట 'ఉన్న' అన్నది అధ్యాహారలబ్దము. ఇట (శ.ర.) 'గెడ'కు 'సమీపము' అర్థ మని, 'ఆసమీపమున' అని దీనికి అర్థము చెప్ప చున్నది. 'అగ్గడ'వంటిదే ('ఎగ్గడ') 'అగ్గడ' గ్రహించి, 'ఎగ్గడ' వదలినది (సూ.ని.).

**అక్కడ**:—(అక్కడ-మొ.) సప్తమ్యర్థక మగుద్వితీయావిభక్తి 'ను' చేరినద్రుతప్రకృతికములు. ఐనను 'శబ్దపరములు' గా ఇవి ఐనప్పుడు 'యగాగమము'వచ్చుట దోషము కాదు. అధికరణశక్తి ప్రధానము లగు-అవ్యయము లివి. (ఆం.సం.) (సాంబ.) వీనిని క్రిందివిధముగా ఉదాహరించినవి 'అచ్చట నచట నచ్చోట నందు నాడ । నచౌట నచ్చోట నక్కడ నయ్యెడ నట । ననఁగఁ దత్ప్రదేశంబునం దనుట కాఖ్య । లయ్యె '(ఆం.సం.మాన.79.). (సాంబ. మాన. 48.). అధికరణశక్తిప్రధానము లివి ఐనను 'ప్రాతఃకల్పమ్' ఇత్యాదులయందలి'ప్రాత' రాదులట్లు,ప్రత్యయ సంబంధముకలిగినప్పుడు శక్తిమత్త్వమాత్రము వీని కభిధేయము.'క్వచిత్ప్రత్యయసంబన్ధే శక్తే స్స్యా దన్యథాస్థితిః'అనినాఁడు అథర్వణుఁడు. 'అందుచేత, అందుకొఱకు, అటకు, ఇటకు' (మొ.) ఇట్టివే ।

**అడ.ఈడ**:—'ఏడ'కూడ ఇట్టిదే । (ఆం.భా.) ఉపలక్షణవిధితో వీనిని గ్రహించి 'ఏడ'కూడ పరిగ్రాహ్య మనియే అనిన దన వలయును. అహోబలపతి 'గ్రామ్యతాపరిహారేణ హితా స్యాచ్ఛబ్దకల్పనా' అనుకారికావ్యాఖ్యానసందర్భమున 'ఆకడన్, ఈకడన్' అనువాని కైన గ్రామ్యములు 'ఆడ,ఈడ'అని 'పరిహార్యము లివి'అనినాఁడు. ప్రయోగము లి ట్లున్నవి 'అడ కేమొగముల నరుగుదెంచెదరు । వేడుక సురలు హవిర్భాగమునకు'(రం.రా.అయో.116పొ.10పం ). 'తోడఁబుట్టుగుకన్న నీ వొగిఁ దోడు నీ దయి ప్రోవఁగా । నీడ నేకొద లేక యుండితి నింక మాతలిదంద్రులం। జూడఁ బోయెద .. ' (యయా.3.153) మొ. నన్నయభట్టారకుఁడే 'ఏడ' ఇట్లు ప్రయోగించినాఁడు-'ఏ నేడ నింద్రాదు లేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు....'(భార. అర.2.47.). మొ. (చూ.సూ.ని.). కనుకనే (ఆం.భా.) పరిహరింపక గ్రహించినది. అహోబలపతివ్యాఖ్య ప్రయోగసమ్యగపరిశీలనామూలక మనిపించును. గ్రామ్యము లనినను 'అనిం

ద్య గ్రామ్యములు'గానే ఇట్టివి పరిగణనీయములు. (ఆం.కౌ.) అవ్యయము లని వీనిని ఉదాహ రించినది '....నక్క డిక్కడఁ గాక యాడ యీడ' (అని).

**అందు:**—(అందు-కడ) (సూ.ని.) ఇ ట్లను చున్నది ('అవ్య.ద్రు.)మొదట ఇది కళ గా నుండి 'ఆచోటు'అనునర్థ మిచ్చియుండును. పిదప దానికి స ప్తమ్యర్థకద్వితీయావిభ క్తి ప్రత్యయ మగు 'ను' చేర్పఁగా 'అందును'అయి 'ఆచోటును' అనునర్థ మిచ్చి క్రమముగా అధికరణవిశిష్టత చ్ఛబ్దార్థక మయి 'దానిలో,వానిలో,వారిలో,దానియందు,వానియందు-మొద లగుఅర్థములు తెలిపి, తర్వాత కేవలస ప్తమీవిభ క్తి ప్రత్యయము గా మాఱి యుండును. ఈయర్థములందే భట్టారక ప్రయోగములు కానవచ్చు చున్నవి' (అని). 'అందు,ఇందు'లనుగూర్చి అహోబలపతి ఇట్లు వ్యాఖ్యానించినాఁడు-'నను అం ద్విత్వస్య సాశ్రయత్వ మనాశ్రయత్వ మ ప్య స్తీతి సాశ్ర యత్వే విభ క్తిత్వ మనాశ్రయత్వే త త్రేత్యవ్యయపర్యాయత్వ మే వేతి తస్య విభ క్తిత్వేన గ్రహణం యు క్తమ్ । ఇం ద్విత్వస్య తు కేవల మనాశ్రయత్వేన తస్య విభ క్తిత్వే నోపా దానం కథ ముపపన్నం స్యాత్ । కించ తస్య విభ క్తిత్వేన గ్రహణే ఎం ద్విత్వనేన కి మప రాద్ధమ్ ? త స్యాప్యధికరణతాపన్నపరోక్షపదార్థాభిధాయకత్వా దితి చే త్సత్యమ్ । సామాన్యా కారేణ అం ద్వితిగ్రహణాత్-'అందలిపువ్వుజొంపములు' ఇత్యాదిప్రయోగ స్సిధ్యతి । ఇన్దు గ్రహణఫలం తు'ఇన్దలిరత్నసానువులు'ఇత్యాదివాక్య మే వే త్యవధారయ' ఇతి (చూ.'సవిధ వ ర్తినా మిన్దు' (ఆం.చిం.అజ 27సూ.).

**మజ్ఝా:**—(శ.ర.) 'మజ్ఝారే, మజ్ఝారె,మజ్జరె-అను(రీతి)రూపములను ఇచ్చినది. (సూ.ని.) 'మజ్జా' 'మజ్ఝా'అని రెండును గ్రహించినది. రెండు వేఱుగా గ్రహింప నగు నిర్ధారకప్రయోగములు లేవు. బ్రౌ 'మజ్ఝా'అనియే అను చున్నది. (వసు.) ఇ ట్లనినది-'లలనా....మాయాజపా । కల నాదంభము పూని మౌని దిశ లాకర్ణించి 'మజ్ఝా'యనన్'అని. (చూ.3.44.). ఇట ఇది 'ఆకర్ష ణోపయోగిశబ్దము'-అని వ్యాఖ్యాత. 'ఆకర్షణదేవతాప్రశంసావాచక' మిది-అని ప్రశంసార్థక ముఁ గానే సమన్వయించి ఆం.భా. లక్ష్య మిది యన వచ్చు ననిపించును. ఎట్లైనను 'రవ' రాదులవంటిదేశ్య మిది అనుట అనుచితము కాదు 'దేశ్య'మనియే (శ ర.), కొన్ని ప్రశంసా వాచకములను ఇ ట్లుదాహరించు చున్నది(ప్రబంధ )-'అవురా:వాతెఱతేట, ఖాఖు పిఱుఁదొయ్యా రంబు మజ్ఝారె : చ । న్గవతళ్కుల్ భళి దంతకాంతు లరరే : కన్బెళ్కు లప్పప్ప : కొ । ప్పు

విలాసంబు...'(484) (చూ.సూ.ని.). 'మజ్జారే'కు (రూపాం.) 'మజ్జారె'. దీని కైన (రూపాం.) 'మజ్జా' అన వచ్చును.

సెబాసు:—'శెబాసు'-అని (బ్రౌ.ఆం.భా.అపపా.) (చూ.అను.). ((ఆం.కౌ.) శకారాదిపదములు పదునాల్గు (పదములు) తెలుఁగునందు కల వనినది. అందు 'శెబాసు' ఒకటి. 'శాబాసు' అను (రూపాం.) కూడ దీనికి ఉన్న దనిన దిది.-'....ఇంక శకారమ్మ లెటిఁగింతు శేబాస, నునుడి యెత్త్వాత్త్వతఁ దనరు వినుఁడి। శింగాణి శిరి శేలు శివిరి శేమంతి, శేకరించెను శేరు శిద రంబు। శిరి శింగణావత్తి శిరిమిడితరటు శి,రాజి శేమంబు శేరబడు లనఁగ। శాబా సనఁగ నిట్టి శబ్దము ల్పదునాల్గు, తెలుఁగునను శకారము లగు' (ఆం.కౌ.) ఉచ్చారణమునుబట్టి పదాది యకార మున్న దన్నట్లే, ఈతఁడును ఏ(గ్రామ్యజనోచ్చారణమునో, లేక శాసనములనో (లేక) తాటాకుప్రతులలోనియే(వ్రాయసకాం(డతప్పడుప్రాఁతలనో, అండ గాఁ గొని ఇట్లు వ్రాసి యుండు ననిపించు చున్నది. బ్రౌ. మిశ్రనిఘంటువుసైతము తురకపదము గా ఇచ్చి 'సెబాసు'అనియే అను చున్నది. (బ్రౌ).'శెబాసు' అని దీనిని అనినను- 'సేమము' అనియే అనినది. (బ్రౌ.) 'శేయుట' అనియు అనుచున్నది. కనుకనే ఇట్టివానియెడ (బ్రౌ.) ప్రమాణ మన రాదు.

[అందుల:—'అందలి' (వావి అపపా.) ].

సీ. దిగువ,క్రింద,యనంగఁ దగు సధస్సంజ్ఞ యై;
యొగి, లెస్స, యనఁగ సాధూక్తి దనరుఁ;
గట్టా, యనంగను గటకటా, యనఁగఁ గ
టా, యనంగ బతార్థ మై యెసంగుఁ;
దద్దయు, నాఁగను దనరు భృశార్థ మై;
పరఁగు నప్యర్థంబు మఱి, యనంగ;
వి, ను, లు చార్థంబు గాఁ దనరును; సవి, సావి,
యని, యను నిత్యర్థ మై తనర్చుఁ;

గీ. బరిపరి, యనంగఁ జిందఱవందఱ, యన
నలరు చుండును గణశోర్థ మగుచుఁ; బాట
పాట, యనఁ గొద్దిగొద్ది యన్మాట చెలఁగు;
భూతిలసితాంగ! శ్రీమాతృభూతలింగ!

దిగువ, క్రింద—ఇవి అధోభాగమునకు (క్రిందిప్రదేశమునకు) పేర్లు.

ఒగి, లెస్స—ఇవి సాధూక్తికి (సుందర మైనది; అంద మైనది; చక్కనిది-అని చెప్పుటకు) పేర్లు.

కట్టా, కటకటా, కటా—ఇవి బతార్థమునకు (సంతాపమును) (బాధను) తెలుపుటకు పేర్లు.

తద్దయు—ఇది భృశార్థమునకు (అత్యంతము; అధికము; మిక్కిలి - అనుటకు) పేర్లు

మఱి—ఇది అప్యర్థమునకు(ఏదేనియొకదానినిఁగూర్చినప్రశ్న మునకు; దేనినిఁగూర్చి యేని తెలియుటకై అడుగుటకు) పేరు.

ని,ను—ఇవి చార్థమునకు (సముచ్చయమును తెలుపుటకు; పరస్పరము నిరపేక్షము లగుపదములకుఁగాని కర్మద్వయమునకుఁగాని ఒకేక్రియతోడిసంబంధము చెప్పుటకు) పేర్లు.

సవి,సావి,అని—ఇవి ఇత్యర్థమునకు (ఉక్తార్థనిర్దేశమునకు; తనకు ముందు ఉండినది శబ్దస్వరూప మనికాని, ప్రాతిపదికార్థ మనికాని, వాక్యార్థ మనికాని, తెలుపుచు క్రియతో సంబంధపఱచుటకు) పేరు.

పరిపరి, చిందఱవందఱ—ఇవి కణశోర్థమునకు (ముక్కలు ముక్కలు గా; చిన్న చిన్న తునుకలు గా-అనుటకు) పేర్లు.

పాటపాట—ఇది 'కొద్దికొద్ది' అనుటకు (కొంచెము కొంచెము; చాలతక్కువ; అత్యల్పము-అనిచెప్పుటకు) పేరు.

సాధూక్తి:—'సాధు'శబ్దమునకు(అమ.) అర్థమును ఇట్లు చెప్పు చున్నది-'సున్దరం రుచిరం చారు సుషమం సాధు శోభనమ్'(అని.). ప్రశంసావాచకము లివి అని (సూ.ని.). అవి ముందటిపద్యమున (3.66.) లో చెప్పఁబడినవి.

బతార్థము:—'బత'అనుదానికి (అమ.)అర్థ మిట్లు వచించినది. 'ఖే దానుకమ్పా సంతోష విస్మ యామన్త్రణే బత' (అని.).

తద్దయు:—'తద్ద'-(రూపాం.)'. మొక్కడు నాఁగఁ జాల నెంతేనియు। మిగులఁ దద్దయుఁ దద్ద మిక్కిలి యనఁ । బెద్దయు ననునివి పేళ్లగు భృశము గా । ననుటకు' (ఆం.సం.70.).

అప్యర్థంబు:—'అపి' అనుదానికి (అమ.) 'గర్హా సముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనా స్వపి' అని అర్థము వచించినది.

మఱి:—ఇది 'మఱియు' అనుదానికి రూపాంతర మై పునరర్థమును (మరల-తిరుగ-అనెడి అర్థమును) బోధించును. దానినేకాక ప్రశ్నార్థమునుగూడ ఇది తెలుపు చున్నది(ఉదా:-) 'అయిన 'మఱి ? (అట్లయిన మఱి (ఇఁక) ఏమి చేయవలయును? అని అనుట.). ఇదియే అప్యర్థము. గర్హా సముచ్చయ ప్రశ్న శఙ్కా సంభావనా స్వపి' అని (అమ.). ఈయర్థమునే ఇట (ఆం.భా.) వచించినది. పునరర్థముగూడ దీనికి ఉన్న దని (సాంబ.) ఇట్లు చెప్పు చున్నది '...గ్రమ్మఱ మఱి । మగుడ వెండియుఁ బలుమఱు మరల సారె।తిరుగ ననఁ బునరాఖ్యలు పరఁగు' (మాన.37.).

ని,ను.లు:—(ని) ఇది సముచ్చయార్థక మగు 'ను' అనుదాని రూపాంతరము. రూపాంతరములను గూడ (అం.భా.) ఇచ్చు చుండును. అట్లే దీనినిఁగూడ యిచ్చినది. 'ఉను' అనుదాని సంక్షిప్త రూపము 'ను'. దాని కైన (రూపాం.)'ని'(చూ.ప్రౌ.వ్యా.శబ్ద.116సూ. వివరణము. బాలవ్యా. తత్స.56.సూ.). ఉదా:- 'రామునిఁ గృష్ణునినిఁ జూచితిని' మొ. 'ఏమిని' ఇత్యాదులుగూడ సముచ్చయమునకు చెందినఒకఅర్థవిశేష మనఁ దగినవి - 'నీ వేమిని వేగిరపడక' (హరి. పూ.8ఆ.110.) 'ఏమియును'-అని అర్థము. ఇట్లే 'అనుజులకు నడ్డపడి నీ వేమినిఁ జేయ నీక' (భార.ఉద్యో.2.13.) (దేనినిఁగూడ-అని అర్థము. కొట్టుట తిట్టుట కాక, ఊరక మాటలాడుటనుసయితము-అనుట.).

చార్థము:—(అమ.) 'చ'కు ఇట్లు అర్థమును వచించినది - 'చా ఽన్వాచయ సమాహా రేతరేతర సముచ్చయే' (అని). 'పరస్పరనిరపేక్షాణా మనేకేషా మేకస్మి న్నన్వయః । కర్మద్వయ మైకక్రియానిష్ఠత్వమ్-'సముచ్చయః' అని (స.త.సి.ప.ల సం.).

ఇత్యర్థము:—'ఇతి' అనెడి అవ్యయమునకు (అమ.(అమర)శేషము) అర్థమును ఇట్లు నిర్దేశించినవి. 'ఇతి హేతు ప్రకరణ ప్రకా శాది సమా ప్తిషు' (అమ.). 'ఇతి రుక్తార్థనిర్దేశే మ త్యేవం నియమే ఽపి చ వక్ష్యమాణపరామర్శే వివక్షానియమే ఽపి చ'(శేష.) (చూ.గురు.).

కణశోఽర్థము:—కణశబ్దము అల్పార్థకము. 'స్తో కాల్ప .. లవ లేశ క ణాణవః' అని (అమ.) దానికంటె 'సం ఖ్యైకవాచనా చ్చ వీప్సాయామ్' (5.4.43 సూ.) అని వీప్సయందు, 'శస్' ప్రత్యయము. ఆ శస్ప్రత్యయాంతమునకు 'అభిధేయార్థక' మగు అర్థశబ్దముతో సమాసము.

సీ. సుఁడి, సుమీ, సుండి, సూ, సుమ్మి, యనంగను
నిశ్చయార్థకము గా నెగడు చుండు;
వారక, యనఁగను మీఱు నిరంతరా
ర్థము; కద, యనఁ గిలార్థమ్మ చెల్లు;
నంత, యం చనఁ దావదర్థ మౌ; నెంత,నా
యావదర్థంబు గా నతిశయిల్లు;
నేతావదర్థ మౌ నింత, యం చనఁగను;
బలు,నాఁగ నానార్థవాచక మగుఁ;

గీ. దనర నొండొండు, నాఁగ మిథఃపదార్థ
మొప్పు; నొకపరి, యొకతేప, యొక్కసారి,
యొక్కమా, టన సకృదర్థ మొనరు; నంత,
నట, యన నథార్థ మగును; సూర్యావతంస · 68

సుఁడి, సుమీ, సుండి, సూ, సుమ్మి—ఇవి నిశ్చయార్థమునకు (నిశ్చయమునకు; నిర్ణయమునకు; 'ఇది ఇట్టిదే' అనెడిఏర్పాటునకు) పేర్లు.

వారక—ఇది నిరంతరార్థమునకు (నిరంతరము గా; సాంద్రము గా; దట్టము గా-అనుటకు) పేరు

కద— ఇది కిలార్థమునకు (వార్తను; లోకప్రసిద్ధిని-తెలుపుటకు) పేరు.

అంత—ఇది తావదర్థమునకు (అపాటిది; ఆకొలఁదిది; వక్తచే ఉద్దిష్ట మై బుద్ధియం దున్న పరిమాణము కలది - అనుటకుఁగాని, సమస్తమును; (యావత్తును) ఏమియు మిగుల కుండ అంతయు-అనుటకుఁగాని) పేరు.

ఎంత—ఇది యావదర్థమునకు (యావన్మాత్రమునకు; ఏపాటిది; ఏకొలఁదిది; ఏమాత్రపుప్రమాణముకలది ? అనుటకుఁ గాని, ఎంతకు; ఎంతకైనను; అంతకును; సర్వమునకును-అనుటకుఁ గాని) పేరు.

ఇంత—ఇది ఏతావదర్థమునకు (ఈపాటిది; ఈకొలఁదిది; బుద్ధిస్థమైన (ఇంతటి) ప్రమాణము కలది అనుటకుఁగాని, ఈసర్వము; 'ఇది యంతయు' అనుటకుఁగాని) పేరు

పలు—ఇది నానార్థమునకు (అనేకమునకు; ఒక్కటిగాక పెక్కైనదానికి) పేరు.

ఒండొండు—ఇది మిథోర్థమునకు (అన్యోన్యమునకు; పరస్పరమునకు; ఒకరి కొకరు (తాము) ఒకేవిధ మగుపని జరపుకొనుటకు; దెబ్బకు మాఱుదెబ్బ కొట్టుట, తిట్టునకు మాఱుతిట్టు తిట్టుట-మొద లగుదానికి) పేరు.

ఒకపరి, ఒకలేప, ఒకసారి, ఒక్కమాటు—ఇవి సకృదర్థమునకు (ఏకవారమునకు; ఒకపర్యాయము; ఒకతడవ-అనుటకు) పేర్లు.

అంత, అట—ఇవి అథార్థమునకు (అనంతరము; తరువాత-అనుటకు) పేర్లు.

సుఁడి:—చూడుఁడు, చూడుమీ (మొ) వానికి సంక్షిప్తరూపములు 'చుఁడి. చుమీ' మొద లగు నవి-అని (సూ.ని.శ.ర.లు) సకారాది గా వీనిని ఇవి గ్రహింప లేదు. బ్రౌ. గ్రహించినది (చూ.అను.).

నిశ్చయార్థకము:— 'సమౌ నిర్ణయనిశ్చయౌ' అని (అమ.)

వారక:—'వారు' ధాతువునకు వ్యతిరేకక్త్వార్థకరూప మిది. వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేకవిశేష ణార్థములయందే దీనికి ప్రయోగము. 'ఉడుగక; ఆఁగక; సతతము' అని అర్థము (చూ.సూ. ని.మొ.).'నిరంతరము' అనుదానికి అంతరము లేనిది; కాలమునందు ఎడలెంపు లేనిది; సంత తము. దేశమునందు ఎడము లేనిది; మిక్కిలి దగ్గఱగా ఉన్నది; వ్యవధానము లేనిది - అను 'అర్థము' సైతము గలదు (చూ.సూ.ని.) (ఆం.శే.) దీనికి అత్యంతము (అధికము) అను అర్థ మిచ్చినది '.. .వార కేడ్తెఱ పెలుచ వావిరి యన।నటిముఱి యనఁ బొరిపొరి యనంగఁ। గడుఁ జాల మిగులంగ గాటం బనంగ న। త్యంత మనుటకు నాఖ్య లయ్యె' (57.). పై యర్థయున కైనపర్యవసానమే ఈయర్థ మనిపించును. ప్రయోగము లిట్లున్నవి-'శ్రీరాముఁడు నయధాముఁడు। తారాశోకంబు నంగదవిలాపంబున్। వారింపుచు లాలింపుచు।వారక సౌమిత్రి

...నుత్పవంబునం బలికెన్' (రామా.5.323.) (చూ.(బౌ.). 'ఊరక మీసము గొఱుగుట। వారక పాదమున నేల(వ్రా(రాః)యుటం బెక్కుల్ । సారెకు చేతులు పిసుకుటం । బౌరుషముల కెల్ల హాని వాటిల్లు నృపా !' (విష్ణు 4.255.) (చూ.(బౌ.). 'వారలగుణానుగుణము గ । వారక కను గల్గి నడచువారల కెలమిన్ ।శ్రీ రంజిలు' (కే.1.94.)((బౌ.). 'శ్రీరుద్రమహిమయుం దెల్పుసూక్తములు । వారక చదువుచు వర్ణిం(ర్లిం?)చువారు' (పండి.1413 )మొ.(చూ.(బౌ.

కద:—కాదా, కదా, కాదె, కదె - మొ.(రూపాం.)(చూ.సూ.ని.కద.).

కిలార్థకము:—'వార్తా సంభావ్యయోః కిల' అని (అమ.).

తావదర్థకము, యావదర్థకము:—'యావ త్తావ చ్చ సాకల్యే ఽవధౌ మానే ఽవధారణే' అని (అమ.). వీనికి సాకల్యము, మానము-అను రెండర్థములు గలవు. 'అంత,ఎంత' అనువానికిం గూడ ఆ రెండర్థములు గలవు. అందులకే అర్థద్వయము వీనికి ఈయంబడినది. 'ఎంత'కు సాకల్యా ... ...ంతకు కాండు' (మొ.)వానియందు ప్రసిద్ధము.

నానార్థవాచకము:—'నానా ఽనేకోభయార్థయోః' అని (అమ).

మిథఃపదార్థము:—'మిథో ఽన్యోన్యం రహ స్యపి' అని (అమ) అన్యోన్యం-క్రియావ్యతిహార విషయః' అని (స త సి.ప.ల.సం ).

సకృదర్థము.—'సకృ త్స హైకవారే చాఽపి' అని (అమ.). 'ఏకస్య సకృ చ్చ' (5-4-19 ) అని ఏకశబ్దమునకంటె క్రియాగణనమున 'సుచ్' ప్రత్యయము. ఏకశబ్దమునకు 'సకృత్' ఆదేశము. ప్రత్యయలోపము

అంత —అంతట - (రూపాం ) 'వెనుకం దరువాతం దిమ్మట । ననంగా నంతట ననంగ నంత ననంగాం । దనరుం బశ్చాదర్థము' అని (ఆం.శే 42 ).

అథార్థము:—'మఙ్గ లాన న్తర రారమ్భ ప్రశ్న కార్త్స్న్యే ష్వథో అథ' అని (అమ.).

గీ. మగుడ, క్రమ్మఱ, క్రమ్మఱి, మరల, సారె,
వెండి, మాటికిం, దిరుగ, నా వెలయును బున
రర్థము గనం; ద్రిక్కు, యనం దక్కు, యన వినార్థ
ము గను రాజిల్లు; శ్రీమాతృభూతలింగ ! 69

**మగుడ, క్రమ్మఱ, క్రమ్మఱి, మరల, సారె, వెండి, మాటికి, తిరుగన్—ఇవి పునరర్థమునకు (ఇంకొకసారి; రెండవసారి-అనుటకు) పేర్లు.**

**త్రిక్క, తక్క—ఇవి వినార్థమునకు (తప్పన్-అనుటకు; అవి (అది) కాక-వానిని (దానిని) విడిచి-అనుటకు) పేర్లు.**

పునరర్థము:—'పున రప్రథమే భేదే' అని (అమ.).

త్రిక్క:—'... త్రిక్క ననఁ దక్క నన .' అని (సూ.ని.పా.). ఇట్టిస్థలములయందు శబ్దములయందు శబ్దస్వరూపమే వీనికి 'అర్థ' మని తదనుకరణమున 'త్రిక్క యనఁ దక్క యన' అనురీతిని వచించుటయే (ఆం.భా.) చాలచోటులను చేయు చున్నది. అందులకే (వావి.పా.) నాకు గ్రాహ్య మైనది.

వినార్థము:—'పృథ గ్వినా ఽన్తరే ణర్తే హిరు క్నానా చ వర్జనే' అని (అమ.).

సీ. చీటికిమాటికి, **మాటిమాటికిఁ, బలు**
**మఱు, వేమ, అనఁగ సమార్థము లగు;**
నెట్టకేలకు నాఁగ నెసఁగుఁ జిరార్థంబు;
తగు వృథార్థంబు వితా, యనంగఁ;
గూడ, యనంగను దోడుత, యనఁగను
రాజిల్లు నౌ సహార్థంబు గాను,
ఓ, యన నేమి, నా నొప్పుఁ గిమర్థంబు;
నై తె, యనంగను ద్వ్యర్థ మలరుఁ;

గీ. గనుక, కన్కను, గాఁబట్టి, కాన, కాఁగఁ,
గావున, యనంగ నన్ని యేకార్థము లగు;
నడరును గదాచిదర్థ మొక్కెడ, యొకప్పు,
డనఁగను; సుగంధికుంతలాప్రాణనాథ ! 70

**చీటికిమాటికి, మాటిమాటికి, పలుమఱు, వేమఱు—ఇవి సమార్థమునకు (ఇంత కంతకు; చిన్నదానికి పెద్దదానికి; అన్నదాని కెల్ల; అంతకు-అనుటకు) పేర్లు.**

ఎట్టకేలకు—ఇది చిరార్థమునకు (చిరకాలమునకు; చాలసేపటికి; ఎట్టకేనికి; చిట్టి చివరికి) పేరు

వితా—ఇది వృథార్థమునకు (నిరర్థకము; వ్యర్థము; ప్రయోజనము లేనిది-అనుటకు) పేరు.

కూడ, తోడుత—ఇవి సహార్థమునకు (కలసి; కూడుకొని; తోడ-అనుటకు) పేర్లు.

ఓ, ఏమి—ఇవి కిమర్థమునకు (ఎందులకు; ఏమిటికి-అనుటకు) పేర్లు.

ఐతె—ఇది త్వర్థమునకు (విశేషమునకు; చెప్పినదానికంటె ఒకభేదము తెలుపుటకు) పేరు

కనుక, కన్కను, కాఁబట్టి, కాన, కాఁగన్, కావునన్—ఇవి హేతువును (కారణమును) చెప్పుటకు పేర్లు. (అన్ని ఏకార్థములు= ఇవి అన్ని ఒకేఅర్థము కలవి.)

ఒక్కెడ. ఒకప్పుడు—ఇవి కదాచిదర్థమునకు (ఒకానొకప్పుడు; ఏదోఒకసమయమున-అనుటకు) పేర్లు.

[సమార్థము:—'సదార్థము'-అని (వావి.పా) (బ్రౌ.పా.) కూడ ఇదియే: (చూ. పలుమరు). '.. .మఱు .. సదార్థము లగు అని, ఈపారమున యతిభ్రంశము చూపట్టుచున్నది. 'సమార్థము లగు' అనునది ఇచ్చటిపార మగును. 'సమా సంవత్సరే ప్రియామ్।సర్వ సాధు సమా నేషు సమం స్యా దభిధేయవత్'అని విశ్వము (చూ సుధ). (సూ.ని.శ.ర.లు) 'ముహురర్థకములు'-అనియే వీనిని వచించినవి. చీటికిమాటికి-మాటిమాటికి: మఱిమఱి, అన్నదావి కెల్ల, అంతకు-అని అర్థము. పలుమఱు, వేమఱు (మొ).కూడ ఇట్టి అర్థమునే వచించును. 'పలుమఱు జాఱువాసరిగెపయ్యెదకొంగు విదిర్చు' (దశావతారచరిత్ర.2.393). (చూ. బ్రౌ. 'పలుమరు' అను.).

ఎట్టకేలకు:—ఇది సకృదర్థ మనుచున్నది (ఆం శే.) 'ఎట్టకేల కనంగ నెనయును సకృదర్థ (మఖిలం బటంటకు నంతవట్టు)' (71).

వితా:—విత (రూపాం.) 'అతివలహృదయము లారసి। రతికలనం దేల్ప నేనిరట్టడిరూపుం। జతురతయు జవ్వనంబును। వితయచుమీ: యడవిఁగాయువెన్నెలరీతిన్' (శశాం 3.73.).

కిమర్థంబు:—'కిం పృచ్ఛాయాం జుగుప్సనే'అని (అమ.).

ఐతె:—(ఐతే (రూపాం.).'ఐతేనియున్' (అయితినేనియున్) అనువాని సంక్షిప్తరూపములు ఇవి.
త్వర్థము:—'తు స్యా ద్భేదే ఽవధారణే' (అమ.).
[కన్కను:—'కనుకను'అని (వావి.పా.) (సూ.ని.పా.)గూడ ఇదియే.(చూ.కాన.). 'కన్కను'-
అనుట ఉచిత మనిపించినది.].
కదాచిదర్థము:—'కదాచి జ్జాతు' (అమ.). 'కస్మిం శ్చి త్కాలే' అని దీనియర్థము వివరించినది
(సుధ.).

గీ. వే, యనంగఁ జయ్యన, యనంగ వెస, యనంగఁ
గ్రచ్చ, అన గ్రక్కున, యనంగఁ గ్రన్నన, యన
నప్పళ, మన బిరాన, నా నొప్పు చుండు
ఝడితిపదతుల్యములు గాను; జంద్రచూడ ! 71

వే, చయ్యన, వెస, క్రచ్చఱ, గ్రక్కున, క్రన్నన, అప్పళము, బిరాన—ఇవి ఝడిత్యర్థ
మునకు (త్వరగా; శీఘ్రము గా; ఆలస్యము చేయ కుండఁగా; వెంటనే - అనుటకు)
పేర్లు.

చయ్యన:—'వే యనఁగ సయ్యన యనఁగ'(వావి.పా.). ఈపాఠమున'చయ్యన'కైన(రూపాం.)
'సయ్యన' అన పలయును. బ్రౌ. 'సయ్యన' (రూపాం )గా ఇచ్చి ప్రయోగ మిచ్చినది. ఈ
ప్రయోగము 'గసడదవా స్స్యుః ప్రథమామాత్రాత్'అని సంధివశమున ఐన దనినను సరిపడు
నదియే ! 'త్వరితమున కొప్పుఁ బేళ్లు వెచ్చెరను సరగ।వేగిరము వేగ వేళము వెసను వడి గ।
గ్రక్కునను గ్రద్దన ననంగ గ్రన్న ననఁగ।గొబ్బునను దిగ్గున ననంగ..' (ఆం.స.మాన.64.).
'జడితి గొబ్బున వేగ సరగు గ్రక్కున వడి,వేగిర మనఁ దగు వేగమునకు'(సాంబ.మాన.21.).
'గ్రక్కున సప్తపారావారవలయిత, క్షోణిమండలి వాన గురియదయ్యె' (వరాహ.7.52.).మొ.
'గ్రక్కన' (రూపాం.) '....పై చెఱంగు గ్ర । క్కనఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున
లేఁ జెమ రంకురింప . .' (పారి.1.124.)మొ. (చూ.సూ.ని.).

సీ. తగు నవిచ్ఛిన్నార్థము గను హోరాహోరి,
యనఁగాక, యనఁగ నుతార్థ మెసఁగు;
నోర, నా సాచ్యర్థ మొప్పును; సహసార్థ
ము గ విరాజిల్లు గొబ్బున,ననంగ;

సంబోధనార్థమై చను నో,యనంగ; నో
 రీ, యోరి, యనఁగను రేసమంబు;
నోమె, యోపె, యనంగ నొప్పు స్త్రీసంబోధ
 నార్థమై; యొసి, యోసి, యనఁగఁ జేటి
గీ. కాదిసంబోధనార్థమై యలరు చుండు;
వలె, యన నివార్థకంబు గా వెలయు; వంటి,
పోని, యనఁగ వదర్థంబు గాను దనరు;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ !

హోరాహోరి—ఇది అవిచ్ఛిన్నార్థమునకు (అవిరామమునకు; ఎడతెగక; నడుమ ఆఁగక; ఎడము తెఱపి లేక - అనుటకు) పేరు.

కాక—ఇది ఉతార్థమునకు (వికల్పమునకు; పక్షాంతరమును (మఱియొకపక్షమును) తెలుపుటకు) పేరు.

ఓర—ఇది సాచ్యర్థమునకు (అడ్డము గా; వంపు గా; వక్రగమనము (ఒరగుట—క్రిందికి వ్రాలుట) కలుగునట్లు గా అనుటకు) పేరు.

గొబ్బున—ఇది సహసార్థమునకు (అవిచారితము గా; ఆలోచింప కుండగా అనుటకు) పేరు.

ఓయి—ఇది సంబోధనార్థమునకు (సంబోధనమునకు;ఎదుట ఉన్నవానిని తనవంకకు మరలించుకొనుట కై నపిలుపునకు; ఆమంత్రణమునకు) పేరు.

ఓరీ,ఓరి—ఇవి 'రే' అనుదాని అర్థమునకు (హీనసంబోధనమునకు; తనకంటె తక్కువవా రగుసేవకాదులనుగాని, నింద్యులు అగుధూర్తులనుగాని పిలుచుటకు) పేర్లు.

ఓమె,ఓపె—ఇవి స్త్రీసంబోధనార్థమునకు (స్త్రీలను సంబోధించుటకు) పేర్లు.

ఒసి,ఓసి—ఇవి చేటికాదులసంబోధనమునకు (దాసి; పనికత్తె - మొద లగువారిని పిలుచుటకు) పేర్లు.

వలె—ఇది ఇవార్థమునకు (సాదృశ్యమునకు; సామ్యమునకు; సాధర్మ్యమునకు; పోలికకు) పేరు.

వంటి,పోని—ఇవి వదర్థమునకు (సదృశమునకు; సాటి యైనదానికి; పోలిక కలిగిన దానికి) పేర్లు.

ఉతార్థము —'ఉతాఽప్యర్థవికల్పయోః' అని (అమ.).

సాచ్యర్థము·—'తిర్యగర్థే సాచి తిరో ఽపి' (అమ.). 'స తిర్యఙ్ యస్తిరో ఽఞ్చతి' అనియు (అమ.). ఇట సుధ 'వక్రం గచ్ఛతః' అని వ్యాఖ్యానించినది. ఓరచూపు-అనుచో-అడ్డచూపు: తిర్యక్ప్రేక్షణము-అని (సూ.ని.). ఒరగినచూపు (వాలుచూపు) అని (శ.ర.) (చూ.ఒరగు).

సహసార్థము:—'అతర్కితే ఽర్థే సహసా' అని (అమ.).

ఓయి:—'ఓ యీత్యామన్త్రణం చ వికృతౌ స్యాత్' అని (ఆం.చిం.అజ.8సూ.బాలసరస్వతి.పా.) 'ఓ ఇత్యామన్త్రణం చ . ' అని (అహోబలపతిపా.). ఇట అహో. పాఠమును-'ఓ యీత్యామన్త్రణం చ.. ' అని ఉదాహరించుట ప్రమాదము. అథర్వణుఁడు (బాల.పా.) కు అనుకూలము గా 'వికృతా వత్ర వా లోపః సంబుద్ధ్యోయిపదే తు యేః' అనినాఁడు. 'ఓయి: దయావిహీనమతి' (మొ.) ఉదా. (చూ.అహో.వ్యా.).

ఓరి,ఓసి:—'ఓ యీత్యామన్త్రణం చ వికృతౌ స్యాత్' అనుదానిని వ్యాఖ్యానించుచు-అథర్వణుఁడు, 'వికృతా వత్ర వా లోపః' అని 'యి' కి లోపము వచ్చినపక్షమున - 'నీచతాయాం 'రి, సీ' స్యాతాం క్వచి న్మైత్ర్యాం చ తచ్చ్యుతిః' అని మైత్రియందుఁగూడ క్వాచిత్కము గా 'రి. సి' కల వను చున్నాఁడు. కనుకనే (సూ.ని.) 'ఓరి-నీచమిత్రపురుషసంబోధనమునను ఉపయుక్తము, ఓసి-నీచమిత్రస్త్రీసంబోధనమున నుపయుక్తము-అని వివరించినది. (ఆం.భా.) బహులదృష్టితో 'హీనసంబోధన' మిది అనినది.

రే:—'హీనసంబోధనే రే' అని (అమ.) (చూ.రత్నా.నాయ.29శ్లో.వ్యాఖ్య.). 'హీనన్యూనావూనగర్హ్యౌ' (అమ.).

ఇవార్థకము:—'వ వా యథా తథై వైవం సామ్యే' (అమ.).

వదర్థము:—'తేన తుల్యం క్రియా చే ద్వతిః' (5.1.115.) అని తుల్యార్థమున 'వతి' (వత్) విహితము. తదర్థమే వదర్థము.

సీ. మున్, మున్ను, మును,ముందు, మొగి, ముంగల, యనంగఁ
దగును బురఃపురోఽర్థములు గాను;
దొలుత, తొల్లి, మునుపు, తొలి, యనఁగను బురా
ర్థము; మ్రోల, యెదుట, నాఁ దగుఁ బురోఽర్థ;
మైద, నా వెంబడి, యన బడి, యనఁగను
వెంట, యం చనఁగ వెన్వెంట, యనఁగ
వెనుక, యం చనఁగను బృష్ఠార్థకం బొప్పుఁ;
బదపడి, పిదప, తర్వాత, పిమ్మ,

గీ. టనఁగఁ బశ్చాత్సమార్థ మై యలరు చుండు;
ముందువెనుకలు, నా నటిముటి, యనంగ
నడరు చుండును రెండు నేకార్థములు గ;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ ! 73

మున్, మున్ను, మును, ముందు, మొగి, ముంగల—ఇవి పురోఽర్థమునకు (ఎదుట; అగ్రభాగమున; ముందఱ-అనుటకు; సంముఖమునకు), పురార్థమునకు (పూర్వము; ఇంతకు మునుపు-అనుటకు) పేర్లు.

తొలుత, తొల్లి, మునుపు, తొలి—ఇవి పురార్థమునకు (పూర్వము; ముందట; మొదట-అనుటకు) పేర్లు.

మ్రోల, ఎదుట—ఇవి పురోఽర్థమునకు (ముందుభాగమునందు; ముందు; ఎదుర-అనుటకు) పేర్లు.

బద, వెంబడి, బడి, వెంట, వెన్వెంట, వెనుక—ఇవి పృష్ఠమునకు (పృష్ఠభాగమునకు; వెనుకకు) పేర్లు.

పదపడి, పిదప, తర్వాత, పిమ్మట—ఇవి పశ్చాదర్థమునకు (తరువాత;అనంతరము-అనుటకు) పేర్లు.

ముందువెనుకలు, అటిముటి—ఇవి తాఱుమాఱునకు (వ్యత్యయమునకు; వైపరీత్యమునకు; తబ్బిబ్బునకు) పేర్లు.

ముంగల—దీనికి 'సమ్ముఖము' అనెడి ఒకేయర్థము ఇచ్చినది (సాంబ.). 'ముంగల మ్రోల నెదుట ముందు। ముందట యనఁగ సమ్ముఖముపేళ్లు రహించు' (మాన.42.).

పురోఽర్థము:—'స్యా త్పురః పురతో ఽగ్రతః' అని (అమ.).

పురార్థము:—'పురా పురాణే నికటే ప్రబ న్ధాతీత భావిషు' అని (మేదిని.).

తొలి.—'తోల' (వావి. అపముద్రి.). ' .దొలుత ముందర మున్ మున్ను తొల్లి మునుపు। ముందు మును తొలి యనఁ జనుఁ బూర్వమునకు' (సాంబ.మాన.40 ).

ఐద —దీనికి ఈయర్థమున ప్రయోగము లేదు-అని (సూ.ని.). (బ్రౌ.) (బస.ద్వి.1029) ఇందులకు ఉదాహరణ మను చున్నది-'....నందుండి యుఱుకుచు నైద వెట్టుచును।సందుల కేఁగుచు' (అని) (బస.6ఆ.1031 )గా ఇప్పు డిది కానవచ్చు చున్నది.

వెనుక —దీనికిఁగూడ పశ్చాదర్థము కల దని (సాంబ.) 'పిమ్మటఁ దరువాతఁ బిదప వెన్క—వెనుక, ననఁగఁ బశ్చాదభిఖ్యలు చెలంగు' (మాన.40.).

పృష్ఠార్థము:—'పృష్ఠం తు చరమం తనోః' (అమ.). 'పృష్ఠం చరమమాత్రే స్యాత్ దేహ స్యావయవాన్తరే' అని (మేదిని.) (చూ.సుధ.).

అటిముటి:—' . .నటిముటి యనఁ బొరిఁబొరి యనంగఁ గడుఁ జాల మిగులంగ గాటం బనంగన। త్యంతము గ ననుట కాఖ్య లయ్యె' అనినది (ఆం.శే.) (57.). దీనికి ఈయర్థము (అర్థాం ) అనవలసినది.

సీ. ఇంచుకంత, యొకింత, యించుక, యిసుమంత,
యన నీషదర్థ మౌ; నటుల, నట్లు,
నాఁ దథార్థఁ; బెట్లు, నా నెటు, లం చన
నలరుచు నుండు యథార్థము గను;
నిటులు, నా నిట్లు, నా నేవమర్థం బొప్పుఁ;
దోడుతో, ననఁగఁ దోడ్తో, ననంగ
సద్యస్సమంబు గాఁ జను; లేదు లే, దనఁ
గను గాదు కాదు, నాఁగను నఞర్ధ

గీ. మొప్పు చుండును; మిన్నక, యూరక, యన
నెసఁగుఁ దూష్ణీంసమంబు గా; నెల్లవెంట,
కనిన నంతటి, కనిన నేకార్థములు గఁ
బొలిచి యుండును; శ్రీమాతృభూతలింగ ! 74

ఇంచుకంత, ఒకింత, ఇంచుక, ఇసుమంత—ఇవి ఈషదర్థమునకు (కొంచెము; (చాల)కొద్ది-అల్పము-అనుటకు) పేర్లు.

అటులన్, అట్లు—ఇవి తథార్థమునకు (ఆప్రకారము; అవిధము-అనుటకు) పేర్లు.

ఎట్లు, ఎటులు—ఇవి యథార్థమునకు (ఏప్రకారము;ఏవిధము-అనుటకు) పేర్లు.

ఇటులు, ఇట్లు—ఇవి ఏవమర్థమునకు (ఈప్రకారము; ఈవిధము అనుటకు)పేర్లు.

తోడుతోను, తోడ్తోను—ఇవి సద్యోఽర్థమునకు (తత్క్షణమునందు; ఆకాలమునందు; అప్పటి కప్పుడు; వెంటనే-అనుటకు) పేర్లు.

లేదులేదు, కాదుకాదు—ఇవి నఞర్థమునకు (అభావమునకు; అసంభవమునకు; ఎంత మాత్రము అది అట్లు సంభవింప లేదు; జరగినది కాదు-అనుటకు) పేర్లు.

మిన్నక, ఊరక—ఇవి తూష్ణీమర్థమునకు (మౌనమునకు; మాటాడ కుండుటకు) పేర్లు.

ఎల్లవెంటకు, అంతటికి—ఇవి సర్వమునకు; అంతకు; ఎల్లదానికి-అనుటకు) పేర్లు.

ఈషదర్థము — 'కిఞ్చి దీష న్మనాగర్థే' అని (అమ.).

అటులన్ —అట్లన్ (రూపాం.). '... ఏఁగెదఁ గాన కేను మీ। పనిచినయట్లనే భరతుఁ బట్టము గట్టు సవిత్రి ' ధాత్రికిన్' (భా రా అయో.39.). 'అనిన నది యెంత గల ద। ట్లన పేసెద నంచు. ' (సారంగ 3 135.). మొ. (చూ.సూ.ని.అటులు.). 'ఇటులు-ఇట్లు. ఎటులు-ఎట్లు' అనువానినిఁబట్టి 'అటులు' అనుటయే ఇటఁగూడ ఉచితము.

తథార్థము:—'ప్రకారవచనే థాల్' (5 3.23.) తేన ప్రకారేణ తథా. (ఇత్థే యథా.)(సిద్ధా.కౌ.).

సద్యస్సమంబు:—'సద్య స్సపది తత్క్షణే' (అమ )

నఞర్థము:—'తత్సాదృశ్య మభావ శ్చ। తదన్యత్వం తదల్పతా। అప్రాశస్త్యం విరోధ శ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః' అని (మఞ్జూష.మొ.).

తూష్ణీంసమంబు:—'మౌనే తు తూష్ణీం తూష్ణీకామ్' అని (అమ.).

ఆ.వె. మంచిదె, యన వల్లె,యం చనంగను నివి
రెండు సమము లగుచు నుండు; నౌను,
హైసరే, సరే, యటం చన యాథార్థ్య
ము గను బొల్చు; మాతృభూతలింగ! 75

మంచిదె, వల్లె—ఇవి (సమములు-ఏకార్థకములు) అంగీకారమునకు; సమ్మతికి పేర్లు.

ఔను, హైసరే, సరే—ఇవి యాథార్థ్యమునకు (యథార్థము అగును; నిజ మగును-అనుటకు) పేర్లు.

మంచిదె:—మంచిది (రూపాం.). 'వల్లె మంచిది యనంగఁ దగు సమ్మతించుటకును' (సాంబ, మాన.43.). 'మంచిదే యనంగ వల్లె యనంగను' అని (వావి.అపపా.). కొంతమార్పుతో ఇట్టియపపాఠమునే సూ.ని. కూడ ఇచ్చినది. (చూ.వల్లె.).పై సాధుపాఠమునుగూడ(సూ.ని.) ఇచ్చినది (చూ.మంచిదె.).

ఔను:—అగును (రూపాం.) 'కృష్ణసారథికం బగుజిష్ణురథం బప్రతిహతం బగుట యెఱుంగ వలవదె యనుటయు నమ్మహీపతి కతఁ డిట్లనియె-'అది యగు నైనను నను౯ెం। బొద వఁగఁ గాచికొని యిచట నుండుటకంటెన్' (భార.ద్రోణ.3.296.).

[యటంచన:—'....యటం చనంగ యథార్థ। ముగను' (వావి.పా.). నాగ్రహించిన పై పాఠమునకై (చూ.బ్రౌ.హైసరే.).]

గీ. తనరు నంతట, యన సమన్తాత్సమము గ;
నలరు నెల్లప్పు, డనఁగ సదార్థ మగుచు;
న, యన నే, యన నేవకారార్థ మెసఁగు;
భూషితభుజంగ! శ్రీమాతృభూతలింగ! 76

అంతట—ఇది సమన్తాదర్థమునకు (అభితః) అనుటకు; సర్వమునందు;ఎల్లయందు; అన్నిచోట్లను-అనుటకు) పేర్లు.

ఎల్లప్పుడు—ఇది సదార్థమునకు (సర్వకాలమునందు; అన్నివేళలయందు; అహోరాత్రము-అనుటకు) పేరు

అ,ఏ,—ఇవి ఏవకారార్థమునకు (అవధారణమునకు; నిశ్చయమునకు; 'ఇది ఇట్టిదే, వేఱు కాదు' అనెడి నిర్ణయమునకు; ఇతరవ్యవచ్ఛేదమునకు) పేర్లు.

అంతటన్:—'ఈపండ్లు అంతటా లేవు' అని (వ్య.) (బ్రౌ.) ఇచ్చినది. భగవంతుఁ డంతట ఉన్నాఁడు'మొ. (వ్య.) గూడ ప్రసిద్ధము.

సమన్తాత్సమము:—'పరిత స్సర్వతో విష్వ క్సమన్తా చ్చ సమన్తతః'అని (వై జ.శేష.అవ్య.).

సదార్థము.—'సర్వదా సదా'అని (అమ.). ఇట 'సర్వస్మిన్ కాలే'అని (సుధావ్యా.).

ఏ:—(సం.ఏవ.ప్రా.ఎవ్వ.క.త.ఏ.). '...ఏ । తెరువైనం దనయిచ్చతోఁ బడియె నింతేకాక యేఁ బూఁటయే' (భార.ఉద్యో.3.358.) (మొ.). (చూ.సూ.ని.). (సూ.ని.) దీనినిఁగూర్చి ఇట్లనినది-ఈ యర్థమున 'ను'అనుప్రయుక్తమై'ఏను'అనురూపమును, దానిపైఁ బ్రశ్నార్థకమగు 'ఆ' చేరి 'ఏనా' అనురూపమును ఏర్పడినవి. ఇవి ప్రాచీనప్రయోగములలో కనఁబడవు' (అని), 'అళిరుచి కొప్పు కొప్పు శశియందు రమం దిర మోముమోము చం । చలసమ మేను మేను లకుచమ్ములలీల (లఁ?) కు (గు?) చమ్ము లింపు.. .' (ముకుంద.) 1.46పొ. 4పం.). '. .ని । ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ నుచితంబే కండగర్వంబు దు । ర్నీతుల్ యాదవవీరసింహములతో నేనా.. ' (విజ.వి.3.162.) మొ. ప్రయోగము లిచ్చినది. (లకుచము-'గజనిమ్మపండు, కమ్మరేఁగుపండు'-అను రెండర్థములు గలది.).

ఏవకారార్థము:—'ఏ వౌపమ్యే ఽవధారణే' అని (విశ్వ.).

గీ. అలరు మెల్లఁగ, నన శనై రర్థ మగుచు;
నంతరర్థము లో, లోన, యనఁగఁ దనరు;
వెలుపట, బయట, వెలి, నాఁగ వలయును బహి
రర్థము గ; మాతృభూత ! దయాసమేత !

మెల్లఁగ— ఇది శనైరర్థమునకు (తొందఅపడక; మందము గా; తిన్నగా-అనుటకు) పేరు.

లోన్, లోనన్—ఇవి అంతరర్థమునకు (అంతర్భాగమునకు; లోపలిప్రదేశమునకు; నడిమిచోటికి) పేర్లు.

వెలఁపట, బయట, వెలి—ఇవి బహిరర్థమునకు (బాహ్యమునకు; బహిఃప్రదేశమునకు; వెలుపల ఉండుచోటికి) పేర్లు.

శనైరర్థము—'అద్రుతే శనైః' (అమ.).

అన్తరర్థము—'అన్తరాన్తిక మధ్యయోః' (నానా.). 'అన్త' రితి మధ్యే-'అన్తర్బాష్ప శ్చిర మనుచరో రాజరాజస్య దధ్యౌ' (గణ.నామ.14.).

లోన్:—'లోను'కు (రూపాం.) 'లోన్', 'లోను' కు 'కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునో లు క్స్యాత్'అని ('ఊరన్'అనునట్లు) సప్తమ్యంతము గా నిష్పన్నమైనది 'లోనన్' అనునది. (సాంబ.) ఇట్లు వచించినది - '..అంతస్సమాఖ్య లగును లోపల లోన, లో నన..' (దేవ.21.).

వెలుపట:—వెలుపల (రూపాం.) '....బహిరాఖ్య లొప్పును వెలి బయట వెలుపల నాఁగ' (సాంబ.దేవ.21.).

బహిరర్థము—'బహి ర్బాహ్యే' (అమ.).

గీ. దండ, మనఁగ నమోఽర్థ మై తనరు చుండుఁ;
 బొరు, గిరు, గనంగ నికషార్థము గఁ జెలంగు;
 నెప్పు, డనఁగ యదార్థ మై యొప్పు చుండు;
 నప్పు, డనఁగఁ దదార్థ మౌ; నట్లచూడ ! 78

దండము—ఇవి నమోఽర్థమునకు (నమస్సునకు; నతికి; నమస్కారమునకు) పేరు.

పొరుగు, ఇరుగు—ఇవి నికషార్థమునకు (సమీపమునందు; దగ్గఅలో అనుటకు) పేర్లు.

ఎప్పుడు—ఇది యదార్థమునకు (ఏకాలమునందు; ఎవ్వేళను-అనుటకు) పేరు.

అప్పుడు—ఇది తదార్థమునకు (అకాలమున; అవ్వేళను-అనుటకు) పేరు.

దండము:—సంస్కృతమున దీనికి, నానార్థములను (విశ్వ.), 'దణ్డో యమే మానభేదే లగుడే దమసైన్యయోః। వ్యూహభేదే ప్రకాణ్డే ఽశ్వే కోణమన్థానయో రపి॥ అభిమానే గ్రహే దణ్డ శ్చణ్డాంశోః పారిపార్శ్వకే' అని వచించినవి. (వైజ.) కూడ 'దణ్డోఽస్త్రీ శాసనే రాజ్ఞాం హింసాయాం లగుడే దమే। మిథ్యాజ్ఞాయాం సైన్యభేదే'(ద్వ.న.నానా.) అనినది. వీనినిఁబట్టి సంస్కృతమున 'దణ్డ' శబ్దము (నమస్కారార్థకము) లే దనవచ్చును. అందులకే (ఆం.భా.) దీనిని 'అచ్చతెలుఁ' గనినది.అవ్యయవర్గపారమున అవ్యయ మను చున్నది.(ఆం.భా.)ఇదివఱకు '(మొక్కు దండము కౌలు మో డ్పెఱఁగుడు నాఁగఁ జె న్నొందును నతి' (2.175.) అని వచించి, దీనిని వేఱుగా అవ్యయ మని ఇట వచించిన దనిపించును. (ఆం.సం) గూడ 'దండము' తెలుఁ గనియే వచించు చున్నది 'నతికిఁ బే ళ్లొప్పు జోత దండము జోహారు। మ్రొక్కు జేజే యనంగ ..' (మాన.31.). (వేంక.) మాత్రము '.. గిడిగిడి చెంకణాలు జోత। చిన్నిపువు మోడ్పు జోహారు చెయ్యివిప్పు। కొల్పు జాగిల్లు మ్రొక్కు మొగుపు జొహారు। చెంగనాలు గొబ్బిళ్లు జేజే సలాము వెన్నెల యన దండముపేళ్లు' (మాన.47.) అని వచించి సంస్కృత మనుచున్నది దీనిని. అప్పుడు దండప్రణామములోనియేకదేశ మిది అని నామైకదేశన్యాయమున దీని కీయర్థము సిద్ధించిన దన వలయునేమో! (అమ.) (అవ్య) వర్గ మున 'నమో నతౌ'అని 'నమ' శ్శబ్దమును అవ్యయముఁ గా ఉదాహరించినది. పాణినీయము గూడ 'నమ స్స్వస్తి స్వాహా స్వధా ఽలం వష డ్యోగా చ్చ' (2.3.16.) అని 'నమ' శ్శబ్ద మును అవ్యయముఁ గానే అంగీకరించినది, ఇట్టిదే 'దండ'శబ్దమును (నమస్కారార్థకము) అని (ఆం.భా.) ఆశయ మనిపించును. '. పాండురంగా నీకు దండంబు రాజశేఖరా నీకు జేజే.. ' (భీమ. 3.211.). (చూ.సూ.ని.) ఈ-ఒక్క-ప్రయోగమునే (సూ.ని.శ.ర.లు) ప్రద ర్శించినవి. తెలుఁగున 'ఆయనకు నాదండములు చెప్ప వలసినది' అని (వ్య.) ఉన్నది. (బహు.వ.) ప్రయోగముగూడ దీనికి ఉన్న దని ఒకచాటు వచ చున్నది 'వారకాంతల కుఁ బదివేలదండముల్' (చా.ర). 'సాష్టాంగదండముల్' అనియు ఒకచో కానవచ్చు చున్నది 'సాష్టాంగదండముల్‌చయ్యనఁ జేసి' (ప.పీ).(కైవారదుర్భాషణంబులకున్ .'(నై ష.7.89.) మొ. వానివంటి దీప్రయోగ మనవలయును). దీని కగు 'అవ్యయసంజ్ఞావశ్యకతను ప్రయోగ సమ్యక్పరిశీలనమున తెలియవలసి ఉన్నది.'అవె దండము' అనురీతిప్రయోగము లున్న వేమో! 'అవ్యయము, అనవ్యయముగూడ ఇది' అని (ఆం.భా.) వచించినది. (సూ.ని శ ర.(బౌ లు) (అవ్య.) ఇది అనుమాటనే స్పృశింప లేదు. అవ్యయసంజ్ఞాకరణమువలన దీనికి కలుగు

ప్రయోజనము శూన్య మని వారియాశయము కానోపు ; (శుద్ధాం.పా.) మాత్రము దీనిని (అవ్య.) అనినది.

నికషార్థము.—'నికషా త్వన్తికే మధ్యే' అని (విశ్వ.). ఇది అధికరణశక్తిప్రధాన మగు-అవ్యయము. 'సమయా నికషా ఽఽరా చ్ఛబ్దా అధికరణశక్తిప్రధానా ఇతి, సమీపమాత్రవాచిత్వాభావా న్నైభిస్సమాసః । సమీపే ఇతి హి తేషా మర్థః' (చూ.శేఖ,అవ్యయీ.). (ఇరుగు) విణ. ప్రక్క నున్నది. వి. ప్రక్క, సామీప్యము-అని (సూ.ని.) (చూ.ఇరుగు.).

యదార్థము:—'స ర్వైకా ఽన్య కిం య త్తదః కాలే దా' (5.3.15.) అనుసూత్రమున కాలవాచకము లగు 'యద్. తద్' శబ్దములకంటె స్వార్థమున 'దా' ప్రత్యయము. యస్మిన్ కాలే యదా,తస్మిన్ కాలే-తదా-అనురీతిని అర్థములు. (ఇందు, యదా(ఎప్పుడు)అనునది, తదా (అప్పుడు) అనుదాని 'అపేక్ష' కలది.).

గీ. పరఁగు నిప్పు, డనంగ సంప్రతిసమము గ;
నొప్పు నేకత్రతుల్య మై యొక్కట, యన;
నెనయు సర్వపదార్థ మై యేడుగడయు,
నాఁగ; దేహావిభూషితానాదినాగ ; 79

ఇప్పుడు—ఇది సంప్రత్యర్థమునకు (సాంప్రతము; ఈవేళ; ఈసమయమున- అనుటకు) పేరు.

ఒక్కట—ఇది ఏకత్రార్థమునకు (ఒకచోట; ఒకయెడను-అనుటకు) పేరు.

ఏడుగడ—ఇది సర్వపదార్థమునకు (సర్వమునకు; సమస్తమునకు;అంతయును-అనుటకు) పేరు.

ఇప్పుడు:—ఇపుడు, ఇప్డు (మొ.) (రూపాం.) ('....నాశ్రితసంరక్షణాభ్యుత్థితం బైన, పరమపుణ్యంబు చేపట్టు మిపుడు' (శృం.నై.2.77.). 'అమరవరేణ్యుప న్పయిన నావల నెయ్యది యైన నిప్డు ధ। ర్మమహితుఁ డై నధర్మజునమక్షమునం దెఱిఁగించి....' (భార.అర.5.432.).

సంప్రతిసమము:—'కాలేఽస్మి న్నధు నేదానీం సంప్ర త్యేతర్హి సామ్ప్రతమ్ (వైజ.శేష.అవ్య.).

ఏకత్రతుల్యము:—ఏకస్మిన్ (ఏకత్ర) 'సప్తమ్యా త్రల్' (5.3 10.).

ఏడుగడ:—'విణ. (ఏడు+కడ) గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత-అని సప్తప్రకారములు గలరక్షకము' అని (శ.ర.). (ఆం భా.) 'ఏడుగడ నా నియంతసంజ్ఞ' అని (3.22.) లో వచించినది. అది వేఱు. ఈఅర్థమున ఇది ఒకఅవ్యయము. ఇది వేఱు. 'ఏడ్గడ' (రూపాం.). 'వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛాప్రదానక్రియా। హేలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుం డేప్రొద్దు నొప్పారుర। త్నాలంకారము కాంతకున్ మగఁడు నిత్యానంద సంపాది యిం।కేలా వేయును జెప్ప నేడ్గడయుఁ బ్రాణేశుండ తన్వంగికిన్'(హరిశ్చ. 3.164.) (చూ.సూ.ని.).

క. ఒక్కోలన, నొకపెట్టున,
నొక్కుమ్మడి, ననఁగ నొక్కయూఁకువ, ననఁగా
నొక్కంత గా, ననం బెం
పెక్కను యుగపత్పదార్థ; మిందువతంసా ! 80

ఒక్కోలనన్, ఒకపెట్టునన్, ఒక్కుమ్మడిన్, ఒక్కయూఁకువన్, ఒక్కంతగాన్— ఇవి యుగపత్పదార్థమునకు (యుగపదర్థమునకు, ఒక్కమాటు గా; ఒక్కసారి గా; ఏకకాలమున; ఒకేసమయమున-అనుటకు) పేర్లు.

ఒక్కోలనన్.—(ఒక్కోలు+అనన్) అని విభజించి 'ఒక్కోలు' ఈపదము-అనినది ఒకనిఘంటువు, ప్రమాదము 'ఒక్కోలన-ఒకపెట్టున, ఒక్కుమ్మడి, యుగపదర్థము (ఆం.భా.)' అని (బ్రౌ) (చూ.అను). (సూ.ని.శ.ర లు) దీనిని గ్రహించినట్లు కానరా లేదు

ఒకపెట్టునన్: —'ఒకపెట్టన'(వావి.పా.)(పారాం.) (ఆం.శే)ఈపట్టున ఇట్లను చున్నది '. నొక్కపెట్ట ననంగ నువ్వెత్తున ననంగ,యుగపత్పదంబున కొప్పుఁ బేళ్లు'(55 ) (అని). 'ఒకపెట్టున' అనునది (బ్రౌ.ఆం.భా.పా.) (చూ.అను.). ప్రయోగములు రెండిటికి ఉన్నవి- (ఒక్కపెట్ట) '....పాండవసైన్య మొక్కపెట్ట పరఁగి . .' (భార.ద్రో.5.93.) (మొ.). (ఒక్కపెట్టునన్) '....మరుత్తులు బి ట్టెదిరించి యద్రిశృం। గద్రుమసంఘము ల్గరిసి కాఱియ పెట్టినయొ (నొ?) క్కపెట్టునన్' (ఉ.రా.4.327.) (చూ.సూ.ని.).

ఒక్కయూఁకువన్:—'ఒక్కయూక యనంగా' - అని (వావి.పా.) (అపపా.). ('ఊకువ-సారి. ఒక్కసారి గా'-అని(బ్రౌ.). 'ఒక్కయూఁకువన్'ఇది అగు ననిపించినది నాకు. ప్రయోగము గూడ ఇ ట్లున్నది- 'అప్పుడుఁగు లొక్కయూఁకువఁ దెప్పరంబు గా నుప్పరంబున కెగసిన నున్మాలితకీలం బై జాలంబు వెంట రాఁ గొని' (వేంక.పంచ.2.13.). 'ఒక్కయూఁకువన్= ఒక్కమాఱు గా (చూ.సూ.ని.).

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేయుకతనఁ
బరఁగు నిచ్చలు'నవ్యయవర్గ' మిట్లు;
గైకొనుము దీని భక్తసంఘాభిమాని !
మాతృభూత ! జగత్త్రయీమాతృభూత ! 81

[ వ్యాఖ్యకై చూ. స్వర్గ. 68. ]

ఇది

అవ్యయవర్గము

---

# క్రియావర్గము

గీ. ముందు గాఁగ నకర్మకములను దెలిపి
వెనుకను సకర్మకములను వివరపఱచి,
ప్రకృతులను బ్రత్యయముల నేర్పఱతు నిందు;
మాతృభూత ! జగత్త్రియీమాతృభూత ! 82

'ఈక్రియావర్గమునందు, అకర్మకధాతువులను ముందు గా ఉదాహరించి, ఆపైని సకర్మకధాతువులను విశదపఱచెదను.ఆతరువాత వీని కగుప్రకృతులను(ధాతు భాగములను), ప్రత్యయములను (వానికంటె వచ్చుశబ్దవిశేషములను; తిఙ్లను, కృత్తులను) స్పష్టపఱచెదను' అని కవి ఈ వర్గమునందలి ప్రతిపాద్యాంశములను ఈపద్యమునందు ఎన్ని చూపు చున్నాఁడు.

సీ. వెలసెఁ, దనరెఁ, దగెఁ జెలఁగెఁ, జెలంగెను,
బరఁగెను, బొనరెను, మెఱసె, నమరె,
రవణిల్లెఁ, గొఱలె, నడరెను, బరిఢవిల్లెఁ,
గ్రాలెను, వఱలెఁ, దుఱంగలించె,
నొనరె, నెసఁగె, నారెఁ, జనె, నలరె, ననంగ
నొప్పె నన్మాట గాఁ జెప్పఁబడును;
నసియాడె, జవ్వాడె, నాడె, నూఁగెఁ, గదలె,
వణఁకె, నా విలసిల్లు వడఁకె ననుట;

గీ. పండెఁ, బన్నుండెను, బరుండెఁ, బవ్వళించె,
నత్తమిల్లెఁ, బడుండెఁ, దెనమణె,ననఁగ
నలరి యుండును శయనించె ననుట కాఖ్య;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 83

వెలసెను,తనరెను,తగెను,చెలఁగెను,పరఁగెను,పొనరెమ,మెఱసెను, అమరెను, రవణి ల్లెను,కొఱలెను,అడరెను,పరిఢవిల్లెను,క్రాలెను, వఱలెను, తుఱఁగలించెను, ఒనరెను, ఎసఁగెను, ఆరెను, చనెను, అలరెను—ఇవి ఒప్పెను (శోభిల్లెను;ప్రకాశించెను;ఒప్పారెను; పొలిచెను; రాణించెను-అనుటకు) పేర్లు.

అసియాడెను,జవ్వాడెను,ఆడెను,ఊఁగెను,కదలెను,కిణఁకెను—ఇవి వడఁకెను (కంపించెను; చలించెను;కదలాడెను;అల్లలనాడెను-అనుటకు) పేర్లు

పండెను,పన్నుండెను,పరుండెను,పవ్వళించెను,అత్తమిల్లెను,పఱుండెను, తెనమణెను—ఇవి శయనించెను (పవళించెను;పండుకొనెను-అనుటకు) పేర్లు.

చనెన్:—'చను-గమనే, అర్థత్వే చ'-అని (చిన్న.ధాతు.). నిఘంటువు లన్నియు దీనికి ఈయర్థములనే ఇచ్చు చున్నవి.

ఒప్పెన్:—'ఒప్పు - శోభాయాం సమ్మతౌ చ'-అని (చిన్న.ధాతు.).

తెనమణెన్:—తెనెమణి (లేక) 'తేనెమణి' (అనఁగా) నిదురించి (ఆంధ్ర. దీ.) అని (బ్రౌ.) (చూ.అను.). 'తెనెమణు' శయనింమ, పరుండు-'తి త్తొకటియుఁ గొని తెనమణి యుత్తర ముత్తర మటంచు నొకప్రొద్దుకడన్' (ఆము.6.72.). (చి.ని.శ.ర.లు). 'త్రేణి మణి'వేదము వారిపాఠము - అని (సూ.ని.). కొన్నిపుస్తకములయందు 'తెణమణి' అనుపాఠ మున్నది (ఆము.5ఆ.)అని (శ.ర). ('తేణు'రూపాం.) తేఁడు, తెండు-అని వేదమువారు ).[ బడుండెను నమణె . .'అని (వావి. పా. అపపా ).].

శయనించెను:—ఇందులకు (సాంబ.) పర్యాయములను ఇట్లుదాహరించినది . బన్నుండెఁ దెన్నుండెఁ (పారాం. తొన్నుండెఁ) బండుకొనెఁ బరుండెఁ। బవ్వళించెను బండెఁ బడక సేసె। నత్తమిల్లె ననంగ నలరారు శయనించె,ననుటకు' (మాన. 23.). ' .. బన్నుండెఁ దొన్నుండెఁ బవ్వళించె। నత్తమిల్లెఁ బరుండె ననఁ దగు శయనించె। ననుటకు' (వేంక. అం. మాన.47.). 'తొంగుండె' కైన (రూపాం.) 'తొన్నుండె' కావచ్చును 'తలపోయం దమపంచతిన్నియలమీఁదన్ జంగము లోవ్రెల ని। చ్చలుఁ దొంగుండెడుకన్నగాంధ్రుడు విని. .' (కాశి.4.52.).

గీ. అఱచె, వాపోయె, నేడ్చెను, మొఱలిడె, నన
దనరు రోదనమును జేసె ననుట కాఖ్య;
లగ్గ మయ్యెను, లో నయ్యె, ననఁగ స్వవశ
మయ్యె ననుట దనర్చు; వేదాంతవేద్య! 84

అఱచెను, వాపోయెను, ఏడ్చెను, మొఱలిడెను—ఇవి రోదనము చేసెను (వాచఱచెను; వగచెను; విలపించెను; పరిదేవనముచేసెను; ఏడిచెను-అనుటకు) పేర్లు.

అగ్గ మయ్యెను, లోనయ్యెను—ఇవి స్వవశ మయ్యెను (వశపడెను; తనకు లోఁబడెను; అధీనుఁ డాయెను-అనుటకు) పేర్లు.

రోదనమును జేసెన్:—(సాంబ.)గూడ వీనిపర్యాయములను ఇ ట్లుదాహరించినది. ' లఱచె నేడ్చె, వాపోయె మొఱ లిడె వాచఱచె ననంగ, రోదనంబున కగు' (మాన.26.).

స్వవశ మయ్యెను:—(సాంబ.)లో వీనిపర్యాయము లి ట్లున్నవి- ' . లో నయ్యె నగ్గ మయ్యె। లోఁబడె ననఁగ స్వవశాఖ్యలు చను' (మాన26.). ఇట - 'లోపడెను' అని (ముద్రి.పా.). 'లోఁబడెను' అనుటకు నిర్ధారకప్రయోగము ఇ ట్లున్నది - 'కినిసి పాణినాళీకంబు పొనుపుట యును। నంతలోఁబడ కదియు ' (హ.న. 2ఆ.)('అంతలోన్+పడక. అంతన్—లోఁబడక' అని ఛేదము) (చూ.శ ర.).

గీ. ఎడసెఁ, బురివిచ్చె, నెడ మయ్యెఁ, గెడసెఁ జెంగెఁ,
బాసెఁ, గేడించె, నాఁగను బరఁగు చుఁడు
వీడె ననుటకుఁ; దొ ఁగె నా వెలయు చుండు
నొదిఁగె, ననుట; శశాంకకలోత్తమాంగ! 85

ఎడసెను, పురివిచ్చెను, ఎడ మయ్యెను, కెడసెను, చెంగెను, పాసెను, కేడించెను—ఇవి వీడెను (వీడిపోయెను; విడిచిపోయెను; వేఱుపడెను-అనుటకు) పేర్లు.

ఒదిఁగెను—ఇది తొలఁగెను (అపసరిల్లెను; తప్పుకొనెను-అనుటకు) పేరు.

పురివిచ్చెన్:—'పురివిచ్(చ్చు)-పరాగలా'- వెనుకదీయుట. విశ్లేషే చ-విడిపోవుట' - అని (చిన్న. ధాతు.).

పీడెన్:—ఈపట్టున పీనికి పర్యాయములను (సాంబ.) ఇ ట్లిచ్చినది- 'ఎడసె పీడెను బాసె నెడఁ బాసెఁ బురివిచ్చె, వేఱుపడె ననంగ వెలయు చుండుఁ । బ్రత్యేక మయ్యె ననం బలుకులు' (మాన.27.).

ఒదిఁగెన్:—'అఙ్గసంకోచావస్థానే' -దేహము సంకోచించుకొని యుండుట. 'కార్యోపయోగే చ'- పని కుపయోగించుట-అని (చిన్న.ధాతు.). తొలఁగుట-ఒదిగి ఒదిగి ఉన్నారు' - అని(బ్రౌ.).

గీ. పఱచె, వెళ్లెను, బరువె త్తె, జరిగె, నుఱికెఁ,
గదలె, ననఁ బాఱె ననుమాట గాఁ జెలంగుఁ;
జనె, నరిగె, నేఁగె, వెడలెను, సాగెఁ, బోయెఁ,
దరలె, నన నడచె ననుట తనరు; నభవ ! 86

పఱచెను, వెళ్లెను, పరువెత్తెను, జరిగెను, ఉఱికెను, కదలెను — ఇవి పాఱెను (పరువు లెత్తెను; పరువిడెను; ధావించెను; శీఘ్రము గా నడచెను-అనుటకు) పేర్లు.

చనెను, అరిగెను, ఏఁగెను, వెడలెను, సాగెను, పోయెను, తరలెను—ఇవి నడచెను (పనివినియెను; వెలలెను; గమించెను; నడిచెను-అనుటకు) పేర్లు.

పాఱెను:—(సాంబ.) దీనికి పర్యాయములను ఇ ట్లిచ్చినది - '....బాఱె వెళ్లెను బరువెత్తెఁ బఱచెఁ గదలె । నుఱికెఁ దొలఁగె నటమరించె జరిగె ననఁ బ । లాయితుం డయ్యె ననుటకు నలరు చుండు' (మాన. 30.).

వెడలెను,—(ఆం.సం.) ఇ ట్లను చున్నది - 'కలవు వివరింపఁ గా నా । ఖ్యలు వరుసన్ నిర్గమించె ననుటకు ధరలో । వెలువడియె వెళ్లె వెడలెను వెలలె ననన్' (మాన.65.). దీనికి- నిర్గమనే-బయలువెళ్లుట - అని (చిన్న.ధాతు.). 'బయలువెళ్లు' అర్థ మనియే (శ,ర.). ఇది అర్థాంతర మన వలయును.

నడచెను:—దీనిపర్యాయములను (ఆం.సం.) ఇట్లు వచించినది - 'చనుఁ గృతగమనుఁడ నయ్యె ద । ననుటకు నామంబు లగుచు నవని నరిగెదన్ । జనియెదఁ బోయెద నేఁగెదఁ। బనివినియెద ననెడునట్టిపలుకులు' (మాన.41.).

సీ. వచ్చె నం చనుటకు విచ్చేసె, వేంచేసె,
నరుదెంచెఁ, జనుదెంచె, నరుగుదెంచె,
ననఁ జెలంగుచు నుండుఁ; జనె, గంతుగొనెఁ, గూలెఁ,
బెద్దనిద్దురవోయె, బిద్దెఁ, ద్రెళ్లె,
మడిసె, బ్రుంగె, సమసెఁ, గెడగె, ముగిసె, నీల్గెఁ,
దెరలెను, దోరెను, దీఱె, వెళ్లెఁ,
గ్రుంగె, నేఁగెను, బోయె, డింకవేసెను, బ్రగ్గె,
ననఁ జచ్చె ననుమాట కాఖ్య లయ్యె;

గీ. వెళ్లె, వెలువడె, ననఁ దగు వెడలె ననుట;
మసలె, జాగిడెఁ, దడసె, నా మనుచు నుండు
జాగుచేసె ననుటకును; జాఱె, వీడె,
ననఁగఁ జ్యుత మయ్యె ననుట గా నలరు;నభవ ! 87

విచ్చేసెను, వేంచేసెను, అరుదెంచెను,చనుదెంచెను, అరుగుదెంచెను—ఇవి వచ్చెను (ఏతెంచెను, ఏఁగుదెంచెను; ఆగతుఁ డయ్యెను-అనుటకు) పేర్లు.

చనెను, గంతుగొనెను, కూలెను, పెద్దనిద్దురవోయెను, బిద్దెను, త్రెళ్లెను, మడిసెను, బ్రుంగెను, సమసెను, కెడసెను, ముగిసెను, నీల్గెను, తెరలెను, దోరెను, తీఱెను, వెళ్లెను, క్రుంకెను, ఏఁగెను, పోయెను, డింకవేసెను, ప్రగ్గెను — ఇవి చచ్చెను (రూపుమాసెను; కాలముచేసెను; మరణించెను-అనుటకు) పేర్లు.

వెళ్లెను, వెలువడెను—ఇవి వెడలెను (నిర్గమించెను; బయలువెడలెను-అనుటకు) పేర్లు.

మసలెను, జాగిడెను, తడసెను—ఇవి జాగుచేసెను (విలంబించెను; ఆలసించెను-అనుటకు) పేర్లు.

జాఱెను, వీడెను,—ఇవి చ్యుత మయ్యెను (సడలెను; ప్రీలెను; గలిత మాయెను; జాఱిపోయెను-అనుటకు) పేర్లు.

వచ్చెను:—దీని పర్యాయములను (ఆం.సం.కూడ) 'వేంచేసెను వచ్చెం జను। దెంచెను విచ్చేసె నరుగుదెంచె ననఁగ నే। తెంచె నన నయ్యె నాగతుఁ। డంచుం బలుకుటకు నాఖ్య' (లంబర కేశా।)' (మాన.44.) అని వచించినది.

చచ్చెన్:—ఒకకవి వీనిఁ గొన్నిటి నిట్లు ప్రయోగించినాఁడు - 'కడసెన్ దుప్పులు డింకవేసె నెలుఁగుల్ గిట్టెం బులు ల్సింగముల్। గడగొట్టెన్ మనుఁబిళ్లు గంతుగొనె జింక ల్బిద్దె దోరెం గిటుల్। మడిసెం గారెనుపోతు లేదు లిలిగెన్ క్రగ్గెన్ వృకవ్రాతముల్। గడుతు ల్చిక్కె గజాళి చొక్కె నపు డక్కానన్ దుమాధూళి గన్'(సారం.1.107.). ఇట ('జి.కా.') వ్యాఖ్యాతలు-'చిక్కెన్-(పట్టువడెను), చొక్కెన్-సోలి పడిపోయెను'అని వ్యాఖ్యానించినారు. ఇట- ఈరెండుక్రియాపదములు-'చచ్చెను' - అనుటకే పర్యాయము లనఁ దగినవి. దీనికి తరువాతి వచన మి ట్లున్నది- 'భూవరేణ్యుం డయ్యరణ్యాని ననేకమృగవిహంగరూటంబుల నిరాఘాటంబు గా గీటడంచి యెల్లెడలం బెల్లు గాఁ దెల్లినయిట్టి జింక దుప్పి కడితి మనుఁబోతు... గురుపోతు మొద లయినతినుమెకంబులబొందులను శకుంతబృందంబులను బొందు గా నొక్కకందవఁ బ్రోవు వేయించి' (అని). పట్టువడెన్ - అనుదానికి ప్రమాణము గా వీరు (బ్రౌ.)ఇచ్చుచున్నారు. (సూ.ని.)రెండర్థములను దీనికి ఇచ్చియే ఉన్నది. (సూ.ని.) 'చిక్కు' అనుదానికి 'చచ్చుట' అను-అర్థమునకు ప్రమాణము గా ఈ (సారం.) ప్రయోగమునే ఉదాహరించినది.(సూ.ని.) తప్పు వ్రాసిన దని కాఁబోలు। (బ్రౌ.) ప్రమాణ మిచ్చి 'పట్టువడెను' అను-అర్థము వచించినారు వీరు ప్రయోగపరామర్శమునకు పూర్వాపరపరామర్శము చాల నావశ్యకము. పై వచనము 'గీటడించి' అనుట, 'త్రెళ్లినకడితి' అనుచుండుట వీరు గమనించుకొన లేదు, ప్రమాదము. (వేద.వ్యా.) ఇచ్చట సరిగానే ఉన్నది.). ఇంకను గొన్నిపర్యాయములు వీని కి ట్లున్నవి'టెక్కె మెగురఁగొట్టె ...ననఁగఁ బరఁగు మృతునిసమాఖ్యలు'(సాంబ.36.). 'కూలె.. కాలంబు సేసెను....సమసె నాటె.... పే ళ్లగును మృతునకు' (మాన.53.).

వెళ్లెను:—వేంక. దీనిపర్యాయములను ఇట్లు వచించినది-'నిర్గమించె ననుట కాఖ్య లెంచ నౌ వెడలెను। వెలువడెఁ దరలెను వెలలె వెళ్లెఁ....' (మాన.59.).

పీఁడెను:— కొన్నిపర్యాయముల ( వేంక. ) దీనికి ఇ ట్లిచ్చినది-' ...సడలె వదలె। పీడెను జాఱెను వ్రీలె నాఁ జ్యుత మయ్యె,ననుటకు నామధేయము లమరు' (మాన.61.).

ఆ.వె. క్రమ్గ్గె, డొంకెఁ, గుందెఁ, దగ్గె, డీ లయ్యెను,
క్రస్గ్గె, ముడిఁగె, డుంకె, సమసె, క్రుక్కెఁ,
గ్రుంగె, డస్సె, డిందెఁ, గుదిసెఁ, దూలె, నణఁగె,
ననఁగ నడఁగె ననుట యలరు; నభవ ! 88

క్రమ్గ్గెను, డొంకెను, కుందెను, తగ్గెను, డీ లయ్యెను, క్రస్గ్గెను, ముడిఁగెను, డుంకెను, సమసెను, క్రుక్కెను, క్రుంగెను, డస్సెను, డిందెను, కుదిసెను, తూలెను, అణఁగెను—ఇవి అడఁగెను (క్షీణించెను; తగ్గిపోయెను-అనుటకు) పేర్లు.

క్రమ్గ్గె:—'క్రమ్మొగ్గె' (వావి.పా.). (బ్రౌ.పా.) 'క్రమ్గ్గెను'.(చూ.అను.)-(సాంబ.) ఇట్లు వచించు చున్నది- 'డస్సెఁ గుందె ముడింగెఁ దాఁకె ను బ్బడఁగెను, క్రమ్గ్గెఁ గ్రుంగెను డొంకె క్రస్గ్గె క్రుక్కెఁ దగ్గె నన క్షీణదశ కగు' (మాన.49 ).

క్రస్గ్గె:—సగ్గె (రూపాం.) 'సగ్గెఁ గుందె డొంకెఁ దగ్గెను సడలెను। గ్రుంగె ను బ్బణంగె క్రుక్కె వనఁగఁ । దనరుఁ బేళ్లు క్షీణదశ నొందుటకు' (ఆం.సం.70.).

డుంకె:—డొంకె - (వావి.అపపా ) 'క్రస్గ్గె డొంకెను గుందెఁ దగ్గెను డిగె డుంకెఁ, గ్రుంగె క్రుక్కెను ను బ్బణంగె డస్సె। నన క్షీణదశ నొందె ననుటకు'(అని) (వేంక. మాన.65.).

అడఁగె:— (ననఁగఁ) 'దగ్గె ననుట' అని (పారాం.). (సూ.ని ) ఈరెండు పాఠములను ఒక్కొకచో ఇచ్చు చున్నది - (చూ.డయ్యు-అర్థము.4.) (చూ.తూలు అర్థము 9.). [క్షీణించు, తగ్గు; నశించు అర్థ-మనినది (సూ ని.) దీనికి.]

ఆ.వె. మీఱె, హెచ్చరిలెను, మించె, రెక్కొనె, హెచ్చె,
నెచ్చెఁ, బెరిఁగె, ననఁగ వృద్ధిఁ జెందె
ననుట కాఖ్య లగుచు నలరారు చుండు; సు
గంధికుంతలాంబికాసమేత ! 89

మీఱెను, హెచ్చరిలెను, మించెను, రెక్కొనెను, హెచ్చెను, ఎచ్చెను, పెరిఁగెను—ఇవి వృద్ధిఁ జెందెను (ఎచ్చిరిలెను; ఎచ్చిర్లెను; ఎచ్చిరిల్లెను; రే కెత్తెను; కొనలు సాగెను; కొనసాగెను; వర్ధిల్లెను; ఎదిగెను; అభివృద్ధి చెందెను-అనుటకు) పేర్లు.

హెచ్చరిలెను:—'హెచ్చరిలెను'అనియే (ఆం.భా.పా.) అగపడు చున్నది. (సూ.ని.) గూడ దీనిని ఇట్లే ఉదాహరించినది. (సూ.ని.), పార మి ట్లిచ్చినను 'హెచ్చిరిలు, హెచ్చిలు, ఎచ్చిరిల్లు, ఎచ్చిఱు, ఎచ్చిర్లు' అనువానికే 'వృద్ధి చెందుట' అర్థ మను చున్నది. హెచ్చరిలు (ఎచ్చరిలు) అనుదానికి ఈ-అర్థమును ఇచ్చుట లేదు. (బ్రౌ.) 'హెచ్చరిల్లుట, ఎచ్చరిలుట, అభివృద్ధి పొందుట'-అర్థ మని 'ఏయుపాయంబుచే నైన నెచ్చరిలఁగ। నీక రాక్షసకులము రమేశ్వ రుండు।దునుము....' (కలా.6.32.) అను ప్రయోగము నిచ్చు చున్నది. ఇట (సూ.ని.శ.ర.)లు '. నెచ్చిరిలఁగ' అనియే (కలా.) పాఠ మను చున్నవి. (ఆం.భా.) ప్రామాణ్యమునుబట్టి (బ్రౌ.) పారమే ఇట 'సరి' అనిపించును. 'ఎచ్చరిలు' గూడ ఈ-అర్థమున ఉన్న దన వల యును- 'అమగువమోముతోడను। నేమిటినో హెచ్చిరిల్లి హిమకరుఁ డొకనాఁ। డేమో పోలు నఁట। యిఁకం। దామర తాఁ బోలుదు నన దైవమునఁ గదే?' (రాజ.చ. 2.179.) (చూ.సూని.). ఇట 'హెచ్చరిల్లి'అనినను బాధ లేదు. (కాని) 'హెచ్చిరిలు' (ఎచ్చిరిలు) నకు (రూపాం.) అనఁ దగిన 'ఎచ్చిఱు' అనుదానికి నిర్ధారకప్రయోగ మొకటి ఇ ట్లున్నది'మఱునటి నాఁటివేకువ నమాత్యుఁడు మేల్కాఁని వంశ మంతయుం। జెఱచిరి కూఁతురుం గొడుకుఁ జెల్లరె। మీఁదటఁ జంద్రహాసుఁ డె। చ్చిఱినఁ బ్రమాద మౌ నసుచుఁ జిత్తమునం దలపోసి వీని నే। తెఱఁగున నైనఁ జంపెద యతిప్రవరోక్తుల బొంకుచేసెదన్' (జై.భా. 8 93.) (అని). (ఎచ్చిఱు-(ఎచ్చు.) క. ఎచ్చఱు' అని సూ.ని.).

హెచ్చెన్:—దీనికి సాధారణము గా 'అతిశయించెను'అనుఅర్థమునే నిఘంటువులు (విశేషవివక్ష లేక) ఇచ్చు చున్నవి.

ఆ.వె. తనరు ఖ్యాత మయ్యె ననుటకుఁ బేరు గా
నెగడె, ననఁగ వెలయు; నిండె, ననఁగఁ
బూర్ణ మయ్యె ననుట పొలుచు; నెఱసెఁ, బర్వె,
ననఁగ నొలసె ననుట; యద్రిగేహ! 90

**నెగడెను**—ఇది ఖ్యాత మయ్యెను (ప్రసిద్ధి చెందెను;ప్రఖ్యాతి కెక్కెఁను;పేరువడెను-అనుటకు) పేరు.

**నిండెను**—ఇది పూర్ణ మయ్యెను (జలాదులచే పూరింపఁబడెను-అనుటకు) పేరు.

నెఱసెను, పర్వెను—ఇవి ఒలసెను (వ్యాపించెను;పొలసెను; కాంత్యాదులు అంతట ప్రసరించెను-అనుటకు) పేర్లు.

ఖ్యాత మయ్యెను:—(వేంక )ఇందులకు పర్యాయములను ఇట్లిచ్చినది-'నెగడె వెలసెను నిండెను నెరసెఁ బర్వె । నావరించె ననఁగ ఖ్యాత మయ్యె ననెడి । మాటకు' (మాన.65.).

నెఱసెన్:—'నెరసెను' అని లఘురేఫాంతముగూడ ఇది.'ఇందుబింబముమీఁదికందుచందంబునఁ, గురులు నెమ్మొగమున నెరపి యుండ' (భార.విరా.2.138.) (చూ.సూ.ని.).

ఒలసెన్: —'ఒలయు-వ్యాపించు, పర్వు, నెరయు-అని ఈ(అం.భా.కు) (బ్రౌ.) అర్థ మిచ్చినది. (సూ.ని.) 'ప్రసిద్ధ మగు, ఒప్పు' - అని అర్థ మిచ్చు చున్నది (చూ.పర్వు.). ఇది (అర్థాం.) అనవలసినది దీనికి.

ఆ.వె. అగిలె, విచ్చె, విఱిగెఁ, బగిలె, ననంగను
విరిసె ననుట కాఖ్య వెలయు చుండుఁ;
బిగిలెఁ, బీలె, ననఁగఁ బెం పొందు చుండును
జినిఁగె ననుట కాఖ్య; సితసమాఖ్య ! 91

అగిలెను, విచ్చెను. విఱిగెను, పగిలెను — ఇవి విరిసెను (పగులఁబారెను; బ్రద్దలాయెను-అనుటకు) పేర్లు.

పిగిలెను, పీలెను—ఇవి చినిఁగెను (చిరిఁగెను, పికిలెను; బిగువుచే వస్త్రాదులు చీలెను-అనుటకు) పేర్లు.

విఱిగెన్:—'భ్రమ గొనినట్లు మి న్విఱిగి పైఁ బడినట్లు' (తారా. 4.53.) మొ. దీనికి (ఉదా.) అనఁ దగినవి.

విరిసెన్:—'మత్తమధులిట్కోలాహలాన్వితమై విరిసెన్ దిక్కులు' (భీమ.6,92 ).

పిగిలెన్:—('పికిలెన్'-(రూపాం.).) 'పెట్టి ముది గ్రుడ్లు వడకుండఁ గట్టు కాచి। పొదుగుటయు నెరకొని కొన్నిపూఁటలకును । బికిలె....' (వేం.పంచ. 1.750.) (చూ.సూ.ని.).

ఆ వె. అంజె, నళికె, వెఱచె, నదరె, దద్దఱె, దద్ద
టిల్లె, జడిసె, ననఁగఁ జెల్లు భయముఁ
జెందె ననుట కాఖ్యచేఁత; చలించె నం
చనుట బెదరె, ననఁగ నలరు; నభవ! 92

అంజెను, అళికెను, వెఱచెను, అదరెను, దద్దఱెను, దద్దటిల్లెను, జడిసెను—ఇవి భయముఁ జెందెను (భీతిల్లెను; భయపడెను; బీతుగొనెను; అడలెను-అనుటకు) పేర్లు.

బెదరెను — ఇది చలించెను(ఆకస్మికభయముచేత శరీరము కంపించెను (వణఁకెను; అదరిపడెను-అనుటకు) పేరు.

అదరెన్ —(అదరు) 'అదిరెన్' (రూపాం,) 'అదురుదురే పగదాయకుఁ। జెదురుదురే ధైర్య మెడలి జీవితవాంఛన్। ముదురుదురే మూలల నరి। కెదురెదురేకాక శూరు లెవ్వో నైనన్' (చంద్రా. 6.96.) (చూ.సూ.ని.).

[దద్దఱెన్—'. . నదరెఁ దద్దిరె దద్ది। రిల్లె (వావి, అపపా.). 'దద్దిలె....' (బ్రౌ.పా.) (చూ. అను.).].

దద్దటిల్లెన్:—దద్దిల్లె (రూపాం.) అని (శ.ర.).

చేఁతన్.—' .. చేతఁ (జలించె)' (వావి. అపముద్రి.).

బెదరెను:—'బెదురు - ఆకస్మికభయే - 'ఆకస్మికము గ భయపడుట'-అని (చిన్న.ధాతు.).

ఆ.వె. తడిసె, నానె, ననఁగఁ దనరు నార్ద్రం బయ్యె
ననుట కాఖ్య; తెగియె, నఱె, ననంగ
ఛేద మయ్యె ననుట చెలఁగుచు నుండు; సు
గంధికుంతలాంబికాసమేత! 93

తడిసెను, నానెను—ఇవి ఆర్ద్ర మయ్యెను (తడి కలిగి యుండెను; చెమ్మగిల్లెను; తేమగిల్లెను-అనుటకు) పేర్లు.

తెగియెను, అఱెను — ఇవి ఛేద మయ్యెను (తెగిపోయెను; తెగెను; తునిఁగెను; రూపఱెను-అనుటకు) పేర్లు.

తెగియెను:—' మీనమూర్తి నిజశృంగం బెత్తి తీరస్థుఁ డౌ। మనుజాశిప్రభు నేయఁగాఁ దెగియె రంభాస్తంభముం బోలి ' (దశా. 1.264) (చూ.బ్రౌ.).

అతెన్:—'అరుట, తగ్గుట, నశించుట (దీపిక), ఛేదమవుట, తెగుట (ఆం భా.) లేకపోవుట'-అని (బ్రౌ.). దీనికి 'తుది రాజ్యంబు సగమ్మ. . 'అను పద్యములోని 'అది గాదే తెగి బంట వైయఱుము'అను తిక్కనార్యుని ప్రయోగము లక్ష్య మనఁ దగును. 'తెగి-సాహసించి: ప్రాణములపై ఆస విడిచి: ప్రాణాలకు తెగించి-అనుట) బంట వై శూరుఁడ (వై శౌర్యము చూపి-అనుట)-'అఱుము-తెగుము; ముక్కలు ముక్క లగుము, నామరూపములు లేక (నశించి) పొమ్మ'-అనుట చెప్పఁబడు చున్న దన వచ్చును.

సీ. అచ్చివచ్చె, ననంగ నైవచ్చె, ననఁగ మే
లై వచ్చె ననుట యౌ; నావటిల్లె,
ననఁగను గలిగె నం చనఁ దోఁచుఁ; గడతేఱె,
ననఁ గృతార్థం బయ్యె ననుట కొప్పు;
నీడుమీఱె, ననంగ నీడేఱె, ననఁగను
వయసు వచ్చె ననుట వఱలు; నందు
నంత్యంబు నెఱవేఱె, ననుటకుఁ దోఁచును;
బొంగె, నుప్పతిలె, నుప్పొంగె, ననఁగ

గీ. నుబ్బె ననుటకు నర్థ మై యొప్పు చుండు;
నలరు ననుకయ్యె, ననుట జొబ్బిలె ననంగఁ;
బరఁగుఁ జఱు కయ్యె, ననుమాట యొరిమె ననఁగ;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 94

అచ్చివచ్చెను, ఐవచ్చెను—ఇవి మే లై వచ్చెను (అయివచ్చెను; అనుకూలపడెను; క్షేమకారి ఆయెను-అనుటకు) పేర్లు.

ఆవటిల్లెను—ఇది కలిగెను (సంభవించెను; ఏర్పడెను-అనుటకు) పేరు.

కడతేఱెను—ఇది కృతార్థ మయ్యెను (ధన్య మయ్యెను; చరితార్ధ మయ్యెను; కృతకృత్య మయ్యెను; సఫల మాయెను, ప్రయోజనము కల దాయెను-అనుటకు) పేరు.

ఈడు మీఱెను, ఈడేఱెను—ఇవి వయసు వచ్చెను(యౌవనము వచ్చినది ఆయెను; యుక్తవయస్క అయ్యెను-అనుటకు) పేర్లు.

ఈడేఱెను — ఇది నెఱవేఱెను (సిద్ధించెను; సమకూడెను; ఫలించెను-అనుటకు) పేరు.

పొంగెను, ఉప్పతిలెను, ఉప్పొంగెను—ఇవి ఉబ్బెను-అనుటకు (మీఁదికి ఉబికెను; (జలాదులు) పైకి లేచెను-అనుటకు) పేర్లు.

జొబ్బిలెను—ఇది అను కయ్యెను-అనుటకు (కొంచెము పలుచనిది గా; అంతగట్టిది అంతపలుచనిది గా కుండఁగా ఉండెను-అనుటకు) పేరు.

చుఱుకయ్యెను—ఇది ఒరిమెను (తైక్ష్ణ్యము; వాఁడిమి; ఎక్కువప్రకాశము గలిగి ఉండెను-అనుటకు) పేరు.

[వఱలు నందున్:—'వఱలు నెందు....'అని (వావి.అపపా.). (సూ.ని.) పై రెండుపాఠములను ఇచ్చినది-(అందు) (చూ.నెఱవేఱు). (ఎందు) - (చూ.ఈడు మీఱు). 'అంత్యంబు నెఱవేఱె ననుటయుఁ దోఁచును' అనియే పాఠ మగపడు చున్నది. అప్పుడు 'అంత్యంబు' అనునది సప్తమీవిభక్త్యర్థకప్రథమాంత మన వలయును.

[అను కయ్యెన్:—'....నను వయ్యె' (వావి.పా.) (అపపా.).].

గీ. ఒడ్డగిలె, నాఁగ నొకదిక్కు కొరగె ననుట
యెసఁగు; బెండగిలెను, నాఁగ నెత్తువడియె
ననుట తగు; నొల్లఁబోయె, నాఁగను దనర్చుఁ
జిన్నఁబోయె నటం చనఁ; జిత్స్వరూప ! 90

ఒడ్డగిలెను—ఇది ఒకదిక్కునకు ఒరగుటకు (వ్రాలుటకు; ఒకవంకకు వంగుటకు) పేరు.

బెండగిలెను—ఇది ఎత్తువడియెను (బెండువడెను; బెండాయెను; బలహీన మాయెను-అనుటకు) పేరు.

ఒల్లఁబోయెను—ఇది చిన్నఁబోయెను (వాడెను; చిన్నఁగఁబోయెను; వెలవెలఁబోయెను; శోభాహీన మయ్యెను; కాంతి లేని దయ్యెను-అనుటకు) పేరు.

ఒరగు:—'ఒఱగు'అని శకటరేఫాంతముగూడ ఇది. 'ఒకపక్షమునకు చెంది ఉండు' అనునది దీనినుండి ఏర్పడినలాక్షణికార్థము-అనఁ దగినది.

చిన్నఁబోయె:—(వావి.అపపా.). 'చిన్నవోవు-ఖేదే-ఖిన్నుఁ డవుట'-అని (చిన్న.ధాతు.) (శ.ర.). 'అని విన్నవించినప్పుడె। విని చిన్నంబోయె దైత్యవీరుఁడు ..' (దశా.5.32.) ఇట్లే. నం। దనుఁ డొక్కఁడును లేమి సీనగరు చిన్నంబోయె ' (వరాహ. 2.92 ) (చూ. సూ. ని.). చిన్నఁగఁబోవు(రూపాం.)'సంతతి లేనిదుఃఖమున .సరసిజేక్షణ చిన్నఁగఁబోయి యుండు . ' (శివ. 2.19.) (చూ.సూ.ని.).

గీ. ఓసరిలెఁ, దగ్గెఁ, దఱిగె, నా నొప్పుఁ దక్కు-
వాయె ననుమాట; కలిచె, నా నలరు వలచె
ననుట; కసిదేఱె, నాఁగను ఖ్యాతిఁ జెంది
యుండుఁ గన్పట్టె ననుట; సూర్యోత్తమాంగ ! 96

ఓసరిలెను, తగ్గెను, తఱిగెను—ఇవి తక్కు వాయెను (తక్కువపడెను; కొఱఁత వడెను; హీన మాయెను; అల్పతఁ జెందెను; తక్కువ దయ్యెను-అనుటకు) పేర్లు.

కలిచెను—ఇది వలచెను (ప్రియపడెను; ఇష్టపడెను;కోరిక కల దాయెను-అనుటకు) పేరు.

కసిదేఱెను—ఇది 'కన్పట్టెను' అనుటకు (కనఁబడెను; అగపడెను; చూపట్టెను -అనుటకు) పేరు.

కలిచెన్:—'కలచె'నా 'అని (వావి.పా.). (బ్రౌ.పా.) గూఢ ఇదియే ! (చూ.అను.) ఇచ్చట (సూ.ని.) ఇట్లు వచించు చున్నది. 'కలుచు (ల్చు) స. క్రి. మోహించు, వలచు . . గీ -కలిచె నా నలరు వలచె, ననుట '(ఆం.భా 3.96.) ('కలచె' అపముద్రితము)' (అని) (ఆం.భా.) అకర్మకక్రియల వచించుప్రకరణ మిది. (సూ.ని.) 'సకర్మక'మని అర్థ మిచ్చు చున్నది. ఇది ప్రమాదము. (సూ.ని.) ఇందులకు ఇచ్చిన ప్రయోగ మిది- 'కలువక కల్చినట్లు తమకం బెద లేకయుఁ గల్గినట్లు . .తా నొరుఁ గల్వమి నేర్పు వేశ్యకున్' (కుమా. 8.142.) (అని.). ఇచ్చట 'ప్రియపడు; ఇష్టపడి యుండు; కోరిక కలిగియుండు'-అనెడి 'అర్థమే' సుసంగత మని పించును.'తమకం బెద లేకయు-' అనుట 'ఈయర్థమునందు పునరుక్తము కాక యుండును.

'కలువక కల్పినట్లు' ఇష్టపడక, ఇష్టపడినట్లు-(కోరక కోరినట్లు-అనుట.) ఒరున్ కల్పమి-ఇతరు నుద్దేశించి-(ఇతరునిఁగూర్చి) కోరిక ఉండుట లేనిది గా-(ప్రీతి లేనిది గా-ఉండుటను), నేర్పును-అవ వచ్చును ; (లేక) దీనికి రెండర్థములు గల వనుట (సకర్మము-అకర్మమును-ఇది అనుట) సముచిత మేమో ! (పరిశీలనీయము.). ఏ మైనను, ఇది 'సకర్మము' అని (ఆం.భా.ను) ఇందులకు (సూ.ని.) ప్రమాణము గా ఒసఁగుట ప్రమాద మనవలసినదే ; 'వలచు' అనుటకు-'ప్రియపడు'-అను అర్థము కలదు. (అక.) 'వలతు నే భక్తకోటికి వారి జాక్షి' (హర.2.13.) (చూ.సూ.ని.). కలఁచు-అనుదానికిఁగూడ 'కామవికారముగలవానినిఁ గాఁ జేయు' అను-అర్థమును ఇచ్చి (సూ.ని.) స.క్రి. అనినది ప్రయోగములతో.

కసిదేఱెన్ —నిఘంటువులు ఈపదమును గ్రహించి ఈ-అర్థమును ఇచ్చుట లేదు.

సీ. ఓహటించె, ననంగ నోడె నంచును దోఁచుఁ;
గూఁకె, నాఁ గనుపట్టుఁ గ్రుంకె ననుట;
కోలుపోయె, ననంగ బేలుపోయె, ననంగ
మోసపోయె ననుట పొలుచుఁ; దీరె,
ననఁగను నిలిచె నం చని పల్కఁగాఁ దగుఁ;
గెరగొట్టె, ననఁగను గిలకిలఁ బలి
కె ననెడిమాట యొఁ; గేకస ల్గొట్టె, నాఁ
గేకలు వేయుచుఁ గేలు దట్టి

గీ. నవ్వుట చెలంగు; గర్వాడె, నాఁగ మేపు
మేసె ననుట దనర్చును; మెఱయుఁ గసిమ
సంగెఁ, జెలరేఁగె, నాఁగను సమము లగుచు;
భూషితభుజంగ ! శ్రీమాతృభూతలింగ ! 97

ఓహటించెను—ఇది ఓడెను (అపజయమును పొందెను; పరాజితుఁ డయ్యెను - అనుటకు) పేరు.

కూఁకెను—ఇది క్రుంకెను (అస్తమించెను; కనఁబడ కుండఁ బోయెను-అనుటకు) పేరు.

కోలుపోయెను, బేలుపోయెను—ఇవి మోసపోయెను (వంచింపఁబడెను; మోసము పొందెను-అనుటకు) పేర్లు.

తీరెను—ఇది నిలిచెను (నిలువఁబడెను; నిలిచి ఉండెను-అనుటకు) పేరు.

కెరగొట్టెను—ఇది కిలకిల పలికెను (పెద్దధ్వనితో నవ్వుచు మాట లాడె-ననుటకు) పేరు. (కిలకిల, కలకల-అనునవి నవ్వుటయం దగుధ్వనికి అనుకరణములు.)

కేకసల్గొట్టెను—ఇది కేకలు వేయుచు కేలు దట్టి నవ్వుటకు(చప్పటలు గొట్టి కేకలు వేయుచు పరిహసించి నవ్వుటకు) పేరు.

గర్వాడెను—ఇది మేపు మేసెను (గరువాడెను;భుజించెను;తిండి తినెను-అనుటకు) పేరు.

కసిమసఁగెను, చెలరేఁగెను—ఇవి (సమానార్థకములు) (విజృంభించెను; ఎక్కువ సామర్థ్యము చూపెను-అనుటకు) పేర్లు.

ఓహటించెను:—మఱికొన్నిపేర్లను గూడ (ఆం.శే.) దీనికి ఇచ్చినది-'ఐదుపదిచేసె వెనుకముం దయ్యె జుణిఁగె । వీఁగె వెన్నిచ్చె వెనుకంజ వేసె ననఁగ । నోహటించె ననంగఁ బేళ్లొప్పు చుండు । నాహవపరాఙ్ముఖుం డయ్యె ననుట (కభవ ।)' (12).

తీరెన్:— 'శ్రేణుల్ తీరె, బారుల్ తీరె' (మొ.). వానిలోని 'తీరె' ఇందులకు ఉదాహరణము కావచ్చును. 'తీఱెన్' (వావి.అపపా.). పైపారము(ప్రాఁత వ్రాఁత ప్ర.పా.) (చూ సూ ని )

గర్వాడెను:—'గర్పాడెను' అనునది (ఇచ్చటిపా.) అని (శుద్ధాం.పా.).

ఆ.వె. డాఁగురించె, మఱిఁగె, డాఁగె, ననఁగను
దాఁగి యుండె ననుట గాఁగఁ దోఁచుఁ;
బదుకుపడె, ననంగఁ బదికిలఁబడె నను
మాట గాఁ దనర్చు; మాతృభూత ! 98

డాఁగురించెను, మఱిఁగెను, డాఁగెను—ఇవి దాఁగియుండెను(చాటువడెను;మఱుఁగు-పడెను; పొంచి ఉండెను; దాఁగుకొనెను; కానరా కుండ ఉండెను-అనుటకు) పేర్లు

**చదుకుపడెను—ఇది చదికిలఁబడెను (చతికిలఁబడెను;(పిఱుఁదులు నేలకు ఆనించి) కూలఁబడెను-అనుటకు) పేరు.**

డాఁగురించెను:—భార. ప్రయోగ మి ట్లున్నది-'ఏ మటు వోక శౌరి మది నేర్పడ మున్ గని డాఁగు రించెనో । యేమిటి కెందుఁ బోయిరొ (సౌ.1.230.).

చదుకుపడెను:—'చదికిలఁబడు' చదుకుమీఁదినుండి ఏర్పడినదే ! అన నగును (త. 'చదుక్కాల్' జాఱుట) (చూ.సూ.ని.చదుకు.).

చదికిలఁబడెను:—'... పాండవవీరుఁడు రాజుమేన బెట్టిద మగుబాణ మొక్కటి వడిం గొని...' (భార. భీష్మ. 2.110). 'చతికిలఁబడెను' అని (వ్యవ.). నిర్ధారకప్రయోగము ఏదియు దీనికి నిఘంటువులు ఇచ్చుట లేదు. చదికిలఁబడు అనుదాని కైన-అపభ్రంశమే 'చతికిలఁబడు' అన వలయును.

సీ. చేకుఱెఁ, జేకూరెఁ, జేకూడె, నం చన
నేకార్థములు గాఁగ నెసఁగు చుండు;
వసమఱె, వేసారె, విసివె, నటం చన
నేకార్థములు గాఁగ నెసఁగు చుండు;
బొబ్బెట్టె, వాపోయె, బొబ్బరిల్లె, ననంగ
నేకార్థములు గాఁగ నెసఁగు చుండుఁ;
గుదురుపడెను, నెలకొనెను, డెక్కొనె, నన
నేకార్థములు గాఁగ నెసఁగు చుండు

గీ. వెచ్చెఁ; ననఁ గందె, ననఁగను వేఁగె, ననఁగఁ
గమలె, ననఁగను దనరు నేకార్థములు గ;
వేగె, నాఁగను దెలవాఱె, నాఁగ వేవె,
ననఁగ నేకార్థములు గాఁగఁ దనరు; నభవ ! 99

**చేకుఱెను, చేకూరెను, చేకూడెను—ఇవి (ఏకార్థకములు-ఒకేఅర్థము కలవి - సమానార్థకములు) లభించెను; సమకూడెను; ప్రాప్తించెను; కలిగెను-అనుటకు) పేర్లు.**

**వసమఱెను,వేసారెను, విసివెను — ఇవి ఏకార్థకములు) (శ్రమపడెను; ఆలసట చెందెను; బడలెను; చాలశ్రమము కలవాఁ డాయెను-అనుటకు) పేర్లు.**

బొబ్బట్టైను, వాపోయెను, బొబ్బరిల్లెను—ఇవి (ఏకార్థకములు) బొబ్బరించెను; గట్టి గా అఱచెను-అనుటకు) పేర్లు.

కుదురుపడెను, నెలకొనెను, డెక్కొనెను—ఇవి (ఏకార్థకములు) (పాదుకొనెను; నెలవుకొనెను; నాఁటుకొనెను; స్థిరపడెను; నిలిచి యుండెను; ప్రతిష్ఠిత మాయెను; కదల కుండ దృఢము గా ఉండెను-అనుటకు) పేర్లు.

వెచ్చెను॰ కందెను, వేఁగెను, కమలెను—ఇవి (ఏకార్థకములు)(క్రాఁగెను; తాపము నందెను; తాపముచే (వేఁడిమిచే) వర్ణాంతరమును (మఱియొకరంగును) పొందెను-అనుటకు) పేర్లు.

వేగెను, తెలవాఱెను,వేవెను—ఇవి (ఏకార్థకములు) (పొడిచెను; ఉదయ మాయెను; (సూర్యాదులు) ఉదయించెను-అనుటకు) పేర్లు.

వేసరు:—'వేసాఱు, వేసఱు' నిర్వేదే 'విసుకుట' - అని (చిన్న.ధాతు.). దీనిని (అర్థాం.) గా నిఘంటువు లిచ్చినవి. 'వసమఱు' అనుదానికి 'స్వాధీనత తప్పు' అనియే అర్థ మను చున్నవి (సూ ని మొ.).

బొబ్బట్టె:—'బొబ్బరించు-ఉత్క్రోశే గట్టి గా నఱచుట' అని (చిన్న ధాతు.).

నెలకొనెను:—'వ్యాప్తౌ, అవస్థానే చ-వ్యాపించుట, నిలుచుట' అని (చిన్న.ధాతు.)

కందెను.—ఆం.భా. (1.49) లో తాపమునకు (అగ్గివేఁడిమికి) నామము గా 'కందు' ఇచ్చినది. (బ్రౌ.) 'వెచ్చుట-కమలుట, కందుట' అను చున్నది(చూ అను) (సూ.ని.) వెచ్చు-అనుదానికి 'క్రాఁగు; తప్త మగు' అని అర్థ మిచ్చి ప్రమాణముఁ గా ఈ(ఆం.భా.)ను ఉదాహరించినది. ఏతత్పరిశీలనమున వీని కన్నిటికి సమన్వయ మేర్పడునట్లు పై రీతిని నావ్యాఖ్య సాగినది.

తెల్లవాఱెను.—తెలాఱెను (రూపాం.) ఒకకవి దీనిని ఇట్లు ప్రయోగించినాఁడు 'అఁకటను బోపఁ జాలవే యంగడింట। గంట తాకట్టు గా నుంచి కడుపునిండఁ। గుడువు మిచ్చట నీడ్గిలఁబడి తెలాఱు। దాఁక నొఱలినఁ గలుగదు తథ్య మనిన' (చెన్న. 2.42) (చూ సూ.ని.తెలవాఱు.).

ఆ.వె. డిల్లపడె, ననంగఁ జెల్లును ధృతి వీడె
　　నునుట; జాగుచేసె ననుట కొప్పుఁ
　　దడసె, ననఁగ; మిడిసిపడె ననుటకుఁ దగు
　　మిడుకుమాలె, ననఁగ; మిహిరభూష!

డిల్లపడెను—ఇది ధృతి వీడెను (ధైర్యము వదలెను;వ్యాకులపడెను;కలఁత చెందెను; క్షోభపడెను-అనుటకు) పేరు.

తడసెను—ఇది జాగుచేసెను (ఆలస్యముచేసెను; మసలెను; ఆలసించెను-అనుటకు) పేరు.

మిడుకుమాలెను—ఇది మిడిసిపడెను (మిట్టిపడెను; త్రుళ్లిపడెను; ఎగిరిపడెను-అనుటకు) పేరు.

డిల్లపడెను.—'డిల్లపడు-'భయాదులచే సత్త్వహీన మగు'అని (శ.ర.). 'నిశ్చేష్టతాయామ్ - నిశ్చేష్టం డవుట-అని (చిన్న.ధాతు.).

మిడిసిపడెను.—'మిట్టు, మిట్టిపడు, మిడియు, మిడిసిపడు-'హఠా దుత్పతనే'- ప్రసభము గా నెగయుట-అని (చిన్న.ధాతు.).

మిడుకుమాలెను:—'మిడుకుమాలు-చచ్చు'-అని (సూ.ని.). ప్రయోగ మి ట్లున్నది '. ..సూతు, నిరువదేనమ్మలఁ దురగచతుష్కంబు, మిడుకుమాలఁగ నేసి మిన్ను ముట్ట। నార్చిన ...'(ఉ. హరి. 3.53.) ఇది (అర్థాం.) అనఁ దగినది. ఈ-అర్థమున (మిడుకు+మాలు) అని, నామము ధాతువు కలపిన-ఒకవిధ మగుశబ్దపల్లవ మిది. (ఆం.భా.) ప్రదర్శించినది 'మాలు' ధాతువు అనుప్రయుక్తము గాఁ గల 'మిడుకు' ధాతు వన వలసినది.

సీ. ఆశ్చర్యమును జెందె నను మాట కర్థ మై
తటకాపడె, ననంగఁ దనరు చుండు;
వనిచె, నాఁగఁ జిగిర్చె ననుటయు వికసించె
ననుటయు నర్థ మై యలరు చుండు;
మోహరించె, ననంగ మొనఁ జేసె నని తోఁచుఁ;
బ లెక్కె, ననఁ దగుఁ బండె ననుట;
నివ్వటిల్లె, ననంగ నిండారె, ననఁ బూర
టిల్లె, నా సమము లై యుల్లసిల్లుఁ;
గీ. దొప్పతిలఁ బండె, నాఁగను దోఁచుఁ దట్టు
విఱుగఁ బండె ననుటకును; విఱుదివిచె, న
నంగ వెనుదీసె ననుట దనర్చి యుండు;
భూశిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ !

తటకాపడెను—ఇది ఆశ్చర్యమును జెందెను (అచ్చెరుపడెను; విస్మయపడెను; అబ్బురపడెను; ఆశ్చర్యపడెను-అనుటకు) పేరు.

ననిచెను—ఇది చిగిర్చెను (పల్లవించెను; చిగురొత్తెను; చిగిరించెను; చిగురు వెట్టెను; చిగురాకులు గలది గా ఆయెను-అనుటకు), వికసించెను; విరిసెను; పూలు పూచెను-అనుటకును) పేరు.

మోహరించెను—ఇది మొనఁజేసెను (పన్నెను; వ్యూహము గా ఏర్పడెను-అను టకు) పేరు.

పక్కెక్కెను—ఇది పండెను (పలము - (మొ.) పక్వ మాయెను; పరిపాకస్థితికి వచ్చెను-అనుటకు) పేరు.

నివ్వటిల్లెను,నిండారెను, పూరటిల్లెను—ఇవి(సమములు-సమానార్థకములు) (పూర్ణ మాయెను; నిండెను (జలాదులతో కుండ మొ.) అవకాశము లే కుండ ఉండెను-అనుటకు) పేర్లు.

తొప్పఁదొలఁబండెను—ఇది తట్టు విఱుగఁ బండెను (ఒకప్రక్కకు ఒఱగునట్లు (పడి) పండెను; అధికము గా పండెను-అనుటకు) పేరు.

పిఱుదివిచెను—ఇది వెనుదీసెను (వెనుకకు పోయెను; పరాఙ్ముఖ మాయెను-అను టకు) పేరు.

తటకాపడెను:—దీనిమీఁద నైనకృదంతనామమే 'తటకాపాటు'. (అం.భా.) దీనిని (1.132.) లో ఉదాహరించి 'ఆశ్చర్యము'-అర్థ మనినది. నిర్భరాశ్చర్యమునకు వేఱుగా 'నివ్వెఱ' ఇచ్చినది. (సూ.ని.) 'తటకాపాటు' నకు నిర్భరాశ్చర్యము; నివ్వెఱపాటు, నిశ్చేష్టత' అర్థము - అని (1.132.)అం.భా. ప్రమాణ మను చున్నది. ప్రమాద మనిపించును. ఇచ్చటఁగూడ పైక్రియకు 'ఆశ్చర్యపడు, నివ్వెఱపడు, నిశ్చేష్టత నొందు' అను చున్నది. (అం భా.) ఇట స్పష్టము గా ఆశ్చర్యము చెందుటయే అర్థ మను చున్నది. (బ్రౌ.) ఈఅర్థమే చెప్పి 'కుటిలాలకయొయ్యా రము। తటకాపడి చూచెఁ జూపుతమి దీరంగన్' (దశా. 7 48.) ప్రయోగమును, 'లంకాపుర రాజ్యలక్ష్మి దటకాపడి చూచుచు నున్నయ త్తఱిన్' అని (దశా.) మఱియొకప్రయోగమును ఇచ్చినది. (చూ.అను.). ఇఁక (శ.ర.) ఈక్రింది (సారం.) ప్రయోగము ఇచ్చి(తటకాపడు-

చేష్టలుతక్కు) అని అర్థ మొసఁగినది. (శ.ర.) చూపిన ఈప్రయోగము చూపియే 'నివ్వెఱ పడు, నిశ్చేష్టత నొందు' అర్థ మనినది దీనికి (సూ.ని.). 'నివ్వెఱ'ను నిర్భరాశ్చర్యపరముఁ గా వేఱుపఱచు చున్న (ఆం.భా.) (సూ.ని.శ.ర.లు) చెప్పు చున్న 'నిశ్చేష్టత నొందు'అను - అర్థ మును దీనికి అంగీకరింపదు. (సూ.ని.శ.ర.లు) ప్రమాణముఁ గాఁ గొనిన (సారం.) ప్రయో గము ఇది -'కంతుఁడొకాక యారజనికాంతుఁడొ లేక జయంతుఁడో ! యితం । డెంతవిలాస మెంతకళ యెంతయొయార మటంచు విస్మయా । క్రాంతమనంబుతోడఁ బులకల్ దొలఁకం గను ఱెప్పవేయ క । క్కాంత మహాభిలాషఁ దటకాపడి చూచెఁ గుమారశేఖరున్' (2.37.). 'నిశ్చేష్టత నొందిచూచెను' అనుటకంటె 'ఆశ్చర్యపడి మహాభిలాషతో చూచిన దనుటయే ఉచిత మనిపించును 'చేష్టలు లేనప్పుడు మహాభిలాషతో చూచుట ఎట్లు? మనస్సు విస్మయా క్రాంత మైనట్లే, చూపును మహాభిలాషచే విస్మయపరవశ మైన దని వచించుటకే 'తటకా పడి....చూచె'ననుట జరిగిన దనిపించును. ఇదిగాక, దీనికి (తటకాపడు-అనుదానికి) కలఁత పడు, కంగారుపడు'-అనుఅర్థము చెప్పవలసినప్రయోగములు గూడ ఉన్నవి (చూ.సూ.ని.). అందులకే అర్థాంతరము గా దీనినిఁగూడ ఇచ్చియే ఉన్నది (సూ.ని.). అదియే యిట దీనికి సముచిత మగు-అర్థ మనిపించు చున్నది. 'మహాభిలాషతో త్రొక్కిసలాడుచు (ఔత్సుక్యములో) చూచెను'అని అర్థము. అందులకే పూర్వటీక-తటకాపడి-తొట్రుపడి (కంగారుపడి) అని అర్థ మిచ్చినది. ఇట (జి.కా.వ్యాఖ్య) పూ.టీ. త ప్పని తాను (శ.ర.) అర్థమే ప్రమాణ మనుచు ఈ (ఆం.భా.)నుగూడ జోడించినది. వీనికి సంగతి ఎట్లో? శ.ర. ఆం.భా. ఏకార్థకములు కావు.

వనిచెను.—దీనికి 'కోరకిత మగు' మొగ్గయెత్తు-అను అర్థముగూడ పూర్వము అం.భా. వచించి నది (చూ.2.35.) 'వికసించు'-అనెడి-అర్థముచే, చిత్తవికాసాదులేకాక పుష్పవికాసాదులును సంగ్రహింపఁబడిన వనవచ్చును - 'ప్రావృషేణ్య పయోధర ప్రభవ మైన । గాలి వనిచిననీప వృక్షంబువోలె' (శృం. నై.3.48.) మొ.

మోహరించెను:—దీనికి (ఆం.శే.) ఇట్లర్థ మిచ్చినది 'మోహరించెను దండెత్తె మొనసె దాడి ! చేసెఁ బో టొగ్గెఁ గోల్తలఁజేసె మాఱు । కొనియె దళమొత్తె ననఁగఁ జె ల్లొనరు । నాహవో ద్యోగ మొనరించె ననుట (కభవ)' (13). 'మోహరించు-రణోద్యోగే' రణోద్యోగము 'సేయుట' - అని (చిన్న.ధాతు.). 'మొనచేసుట, ఎదిరించుట' - అని (బ్రౌ.) (చూ.అను.). (ఆం.శే.) (అర్థాం.)అనఁ దగినది. ఆహవోద్యోగమే రణోద్యోగము. ఎదుర్కొనుట, ప్రతిఘ టించుట-దీనికి అర్థ మనవలయును. ప్రయోగములను (సూ.ని.)ప్రదర్శించుచున్నది రెండర్థము

లకు. (ఆహవోద్యోగము) - 'మూఁడుకన్నులవేల్పుతో మోహరించి। నేఁడు దేహంబు లేక యున్నాఁడు తాను। వేయికన్నులవేల్పుతో విగ్రహించి। వనిత యిం కేమి గా నున్నవాఁడొ మరుఁడు'(శృం.నై. 4.23.). (వ్యూహము గా ఏర్పడు) 'ఐనను గ్రౌంచవ్యూహవిధానంబున మోహరించి... ' (భార.భీష్మ 2.25.) మొ.

తొప్పఁదిలఁబండెను:—'తొప్పరిలఁ బడెను' అని (బ్రౌ.ఆం.భా.పా.) (చూ అను.). నిఘంటు వొకటి ఇక్లే పాఠ మిచ్చి 'ఆనత మగు' అని అర్థము చెప్పినది గూడ.

గీ. వగచె, దురపిల్లె, వందురెఁ, బల్లటిల్లెఁ,
బొక్కె, నన నంగలార్చె నాఁ బొల్చి యుండుఁ;
బలుకఁబాఱె, ననం దెల్లఁబాఱె ననుట
కలరి యుండును; మాతృభూతాభిధాన ! 102

వగచెను, దురపిల్లెను, వందురెను, పల్లటిల్లెను, పొక్కెను—ఇవి అంగలార్చెను (పరితపించెను; దైన్యముతో శోకించెను; దుఃఖపడెను-అనుటకు) పేర్లు.

పలుకఁబాఱెను—ఇది తెల్లఁబాఱెను (తెల్లనయ్యెను; తెల్లపడెను; తెల్లఁదనము పొందెను; భయాదులచే వివర్ణ మాయెను; పాలిపోయెను-అనుటకు) పేరు.

అంగలార్చెన్:—'అంగలార్చు-దైన్యరోదనే'-దైన్యము గా ఏడ్చుట-అని (చిన్న ధాతు). అంగ లార్చుట-దుఃఖపడుట, ఏడ్చుట. అంగలార్పు-దుఃఖరూప మైనవిచారము-అని (బ్రౌ.).

పలుకఁబాఱెను:—'పలకఁబాఱె......' అని (వావి.పా.). (ఆం.భా.పా.) గా ఈయకపోయినను 'పలకఁబాఱుట'యే (బ్రౌ) గ్రహించినది. (సూ.ని.శ.ర.లు) బహుప్రయోగములతో 'పలుకఁ బాఱు' అనియే గ్రహించినవి. 'పల్కఁబాఱు' (రూపాం.) 'చెక్కులు పల్కఁబాఱెఁ గడు చిట్టుము లయ్యె మొగంబు వాడెఁ జ। న్మక్కులు నల్పఁ గూడె. ... ' (ద్వా.3.28.) (ప్రాఁతప్రతిపా.) (చూ.సూ.ని ).

గీ. బీఱువోయె, ననంగను మీఱు వ్యర్థ
మాయె ననుటయు మెల్లన పోయె ననుట;
గుంపుగూడె, ననెడిపలు కొప్పు చుండు
మల్లడిగొనె ననంగను; మాతృభూత ! 103

**బీఱువోయెను**—ఇది వ్యర్థ మాయెను (పొల్లవోయెను; రిత్తవోయెను; విఫల మాయెను-అనుటకు), (మెల్లన పోయెను) (తిన్నఁగా; నెమ్మదిగా నిమ్మళము గాఁ; మందము గా వెళ్లెను-అనుటకును) పేరు.

**గుంపుగూడెను**—ఇది మల్లడిగొనెను (గుంపు గా (సమూహము గా) చేరెను-అనుటకు) పేరు.

బీఱువోయెను—(అం.శే) మఱికొన్నిటినిఁగూడ దీనికి పర్యాయములఁ గా ఒసఁగినది - 'అఱడి వోయెను బీఱుబోయెను రిత్తవోయెను వీసరవోయె ననఁగ। నుడివోయెఁ బొలివోయె నుడి వోయె ననఁగను, వ్యర్థ మయ్యె నటంట కాఖ్య లయ్యె' (16.).

ననెడిపలుకు: - 'ననం బలు కొప్పు చుండు' అని (వావి.పా.). దీనిని సంస్కరించి కాబోలుఁ (సూ ని.) 'ననం బల్క నొప్పు చుండు' అని ఒకచో ఉదాహరించినది (చూ.మల్లడిగొను.). ఇందు యతిభ్రంశము ఏర్పడినది, గమనింప లేదు. పైనాగ్రహించినపాఠమును గూడ ఇచ్చినది (సూ ని.) (చూ.గుంపుగూడు.). మల్లడిగొను-అనుదానికే 'గుంపు గూడు' అర్థము అనుచున్నది (బ్రౌ.). 'మల్లడి-మల్లడిగొనుట-అనఁగా మెల్లన బోవుట, గుంపు గూడుట' - అని. (చూ.అను.). దీనిఁబట్టి చూడ పై (వావి.పా.) (బ్రౌ పా.) అయి ఉండు ననిపించు చున్నది.

గీ. పణఁతపడె, ననఁ దగును దవడనరాలు
పట్టుకొనె ననుటకు; బడల్పడియె, ననఁగఁ
జాఁపచుట్ట గఁ బడె నని తోఁపఁబడును;
భూరిభవభంగ! శ్రీమాతృభూతలింగ! 104

**పణఁతపడెను**—ఇది దవడనరాలు పట్టుకొనెను (వాత్యాదులచే దౌడనరాలు ఆడ కుండ బిగిసికొనెను-అనుటకు) పేరు.

**బడల్పడెను**—ఇది 'చాఁపచుట్ట గఁ బడెను' (చాఁపచుట్టవంటిచుట్ట గ పడియుండెను-అనుటకు) పేరు.

**బడల్పడియెన్**:—దీనికి (బ్రౌ.) ప్రయోగము ఇట్లు ఒసఁగినది-'చిల్వకుఁ బాలు పోసి ముంగడ వసియింపఁ జేసి చిరకాలముఁ బెంచిన మే లెఱుంగు నే। కడఁగి బడల్పడం గఱచుఁగాక।

కృతజ్ఞులె దుష్టమానసుల్' (పం 1.796.). (చూ.అను.పడల్పడుట ). (బ్రౌ.)'పడల్పడుట' గ్రహించి ఇది ఉదాహరించినను 'బడల్పడుట' గానే ప్రయోగమందు వచించినది

గీ. చెలఁగుఁ బఱివోయె, ననఁగను జెదరె ననఁగ;
నయిదు పదిచేసె, నన ముందఱడుగు వెనుకఁ
బె ట్టె ననుటకుఁ బేరు గా వెలయు చుండు;
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 105

పఱివోయెను—ఇది చెదరెను (చెడెను; పా డయి పోయెను; (పదార్థగ్రహణ)శక్తి లే కుండఁ బోయెను-అనుటకు) పేరు.

అయిదు పదిచేసెను—ఇది ముందఱియడుగు వెనుకఁ బెట్టెను (ఐదు పది చేసెను; వెనుకంజ వైచెను; వెనుకకు మరలెను; ఓడిపోయెను-అనుటకు) పేరు.

పఱివోయెను:—(చిన్న.ధాతు.) ఇట 'పఱిపోవు-(ష.) అక్రమణే (అ.) అసమ్యగ్భావే చ' చెడి పోవుట-అనినది. (బ్రౌ.)'పఱిపోయె (అనఁగా)చేరె (ఆం ఖా.)'అనుచున్నది. దీనినిఁబట్టి 'చేరె ననఁగ' అని (బ్రౌ.పా.) అగు ననిపించును. (పఱిపోవు). ప్రయోగము లి ట్లు న్నవి- 'మిఱిమిట్లు గొని చూడ్కి పఱిపోవ వెలిఁగి ప,రిభ్రాంతి సేసెఁ గిరీటకాంతి'(భార.విరా.4.180) ఇట 'వెనుకకు మరలు' అనుఅర్థ మిచ్చినది (సూ ని ). 'దృష్టి చెదరు, మనసు చెదరు'మొ. (వ్యవ ) ఇట 'చెడిపోవు; పా డయి పోవు, పదార్థగ్రహణశ క్తి లే కుండఁ గా పోవు' అనుటయు సమంజసమే' అనిపించును. మఱియొకప్రయోగము ఇ ట్లున్నది - 'అఱచేతులఁ బెడకేలం।జఱచియుఁ గూర్పరకరోరజానునిహతులం । బఱచియు వారు సముద్ధతిఁ । బఱివోవక పోరి రలఘుపాటవదృఢతన్'(హరి. పూ. 9.121.) (సూ.ని.) 'వెనుకకుఁ బోవు, మరలు - అర్థ మను చున్నది (సూ.ని.) 'తగ్గు, క్షీణించు' అను అర్థము 'పఱివోవు నకు' వేఱు గా ఇచ్చినది. 'సముద్ధతిన్, పఱివోవక-తగ్గక, ఒకరికొకరు తీసిపోవక' అనినను ఇట సరిపడు నని పించును. ఇది గాక 'సముద్ధతి పఱివోవక' ఔద్ధత్యము 'చెడక' అనినను గా దనదు.

అయిదు పది చేసెన్:—ఆయిదు పది చేయుట - అనఁగా ముందుకాలు వెనుకకాలితో చేర్చిన యెడల రెంటివ్రేళ్లును కలపి పది యగును-వెనుకంజవేయు, వెనుదీయు' అని (సూ.ని ) వివ

రించినది దీనిని. (శ.ర.) దీనిని ఇట్లు సమన్వయించు చున్నది - 'ఓడిపోవువారును చేతులు కూర్చి మ్రొక్కెదరుకనుక. దీనికి ఓడిపోవుట - అనునర్థము కలిగెను. (అని). ఈ (శ.ర.) 'నమస్కరించి' అను అర్థము దీనికి చెప్పుటకు క్రింది (ఆము.) ప్రయోగమును ఉదాహరించి నది ప్రమాణము గా. 'ఉరవడిఁ బోరికై కవచ మొల్లరు మంత్రములందుఁ దక్కను । స్థిర భుజశక్తి నైదు పది సేయరు దత్తిన తక్కఁ, మంటికై । పౌరల రథీశుఁ డీ కమలబుద్ధి ఖఖారికఁ దక్కఁ, వజ్రదోః । పరిఘవశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్' (2.34.). ఇట దానపర మగు-అర్థమున 'నమస్కరించు' అర్థ మనినది (శ.ర.). రెండవయర్థమందుఁ గూడ పర్యవసితార్థము గా 'ఓడిపోవుట' అను - అర్థము సిద్ధించును. 'నమస్కరించు' అను నదియే ఇటను వాచ్యార్థ మనినది (శ.ర.). ఇట(దానార్థమున) అయిదు పది చేయుట-అయిదు పది గా ఇచ్చుట; ఎక్కువ గా ఇచ్చుట- అని అర్థము చెప్పు చున్నారు చాలమంది వ్యాఖ్యాతలు. (ఆం.శే.) గూడ ఇట 'ఐదుపదిచేసె వెనుక ముందయ్యె జుణిఁగె । వీఁగె వె న్నిచ్చె వెను కంజ వేసె ననఁగ । నోహటించె ననఁగఁ బే ళ్లొప్పు చుండు । నాహవపరాఙ్ముఖుం డయ్యె ననుట (కభవ)'(12) అను చున్నది, (ఆం.భా.)కర్త పై (సూని.) వివరించినట్లే అభిప్రాయ పడినాఁడు దీనికి. 'నమస్కరించు' అనుఅర్థ మభిప్రేతము కాదు ఈతనికి. ఆము. ప్రయో గముకడఁగూడ రెండవవ్యాఖ్యానమే (ఎక్కువ గా ఇచ్చును-అనునదియే) ఈతని కిష్టము. 'నమస్కారార్థక మిది యని మఱియొకప్రయోగ మేదియు నిఘంటువులు చూపుట లేదు (ఆము ) ప్రయోగము (స్వరసము గా) అన్వార్థముచే సిద్ధము.

గీ. చేను కావించెఁ బైరిడెఁ జెట్లు గొట్టె
ననెడిమాటకుఁ బొడిగొట్టె, ననఁగఁ జెల్లు;
మస్తరించె, ననంగను మనుసు జేతు
లప్పళించె నటంచుఁ; జంద్రార్థ చూడ ! 106

**పొడిగొట్టెను**—ఇది చేను కావించెను; పైరిడెను; చెట్లు గొట్టెను (చేను సిద్ధము చేసి పైరు పెట్టుటకు చేనిలోనిచెట్లు కొట్టివేసెను-అనుటకు) పేరు.

**మస్తరించెను**—ఇది చేతులు అప్పళించెను (చేతులతో తట్టెను; గట్టిగా తాఁకెను-అను టకు) పేరు.

బొడి గొట్టె:—'బొది కొట్టె' (వావి.పా.) (అపపా.). 'పొడిగొట్టు - దే.స క్రి. (పొడి+కొట్టు) చేనియందలిచెట్లు కొట్టు - అని (శ.ర.). పొడిగొట్టుట-చేనుగావించి పై రిడ చెట్లు గొట్టుట-అని (బ్రౌ.). అకర్మకధాతుప్రకరణ మిది. 'అకర్మకధాతువు ఇది' అనక తప్పదు. అకర్మకధాతు లక్షణ మి ట్లున్నది-'ధాతో రర్థాన్తరే వృత్తే ర్ధాత్వర్థే నోపసంగ్రహాత్। ప్రసిద్ధే రవివక్షాతః కర్మణో ఒకర్మికా క్రియా' (అని). ధాత్వర్థసంగృహీతకర్మక మగు 'అకర్మక' మిది. (సూ.ని.) 'పొడి' కడ 'పొడిగొను'ను జన్యముఁ గా చూపినది. (ప్రత్యేక) పదము గా చూపి అర్థ మిచ్చుట మఱచినది.

మస్తరించెను·—(శ.ర.) (స.క్రి.) ఇది అను చున్నది. (సూ.ని) (స.క్రి.) ఇది అను చున్నది. (సూ.ని.) దీనికి 'అస్ఫాలనముచేయు; తట్టు; చేతు లప్పళించు - అని అర్థ మిచ్చి సకర్మక మని ఈ'ఆం.భా'ను ప్రమాణముఁ గా ఉదాహరించు చున్నది. ఇది అకర్మకధాతుప్రకరణము. 'ఛేతులు అప్పళించు' అనెడి శబ్దపల్లవముతో (ఆం,భా.) చేసెడి అర్థవివరణము 'అకర్మధాతు' విది' అని స్పష్టపఱచు చున్నది. అథర్వణాచార్యుని 'అనుశాసనము' ఇ ట్లున్నది - 'క్రియాయా ఉపచార స్స్యా। త్ప్రథమాపదసంగతౌ। అకర్మకత్వం ప్రాయ స్స్యా త్పర త్రోభయసమ్మతిః' అని (చూ.అహో.క్రియా.48.సూ.వ్యా.). ఈక్రిందిప్రయోగము ఇందులకు ఉదాహరణ మన వచ్చును- 'కనఁ దగుతెల్లమానికపుఁగప్పుల నొప్పెడుచప్పరాలలోఁ। దనపొడ వైననీడఁ గని తాళక యేనుఁ గటంచుఁ గొమ్ములం। జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసినము త్తెపుపింగపుంగ మిం। గనుఁగొని పాఱు వేల్పుదొరగొ రతఁ దౌదల మస్తరింపఁగన్' (యయా.1.77.) ఇచట బౌదలయందు చేతితో తట్టఁగా' అని అర్థము. (సూ ని.) (స.క్రి ) గా దీనిని ఇచ్చినది. మఱియొకప్రయోగమును ఇ ట్లిచ్చినది (సూ.ని.). హస్తమున 'హస్తిమస్తంబు మస్తరించి। వెలయుశ్రీహరిశుభము గావించు మాకు' (వాల్మి.1.116.). హస్తముతో హస్తిమస్తంబునందు 'తట్టి'అనుట ఇటను సంగతమే।

క. పురు లోమె, నాఁగ క్షాత్త్రము
మెఱయించె నటంచుఁ దోఁచు; మీఱుచు నుండున్
సొరిగె, నన సొగసె, ననఁగను
సురిగె, నన న్వాడె ననుట; సోమవిభూషా! 107

పురు లోమెను—ఇది క్షాత్త్రము మెఱయించెను (పరాక్రమమును చూపించెను - అను టకు) పేరు.

సొరిగెను. సొగసెను. సురిగెను — ఇవి వాడెను (మ్లాన మాయెను; వడలెను శోషించెను; వికాసము లేకుండెను-అనుటకు) పేర్లు.

పురులోమెను.—'పురులోముట' అని (బ్రౌ.). (త.పౌరలంబు.పురులు+ఓము) అని (సూ.ని.).

సురిగెన్.—దీనికి ఈయర్థ మీయక అర్థాంతరము లిచ్చి సానుస్వారము-అనినది (శర.). ప్రయోగము లిట్లున్నవి 'అంగజ నీలోచనారవిందంబులు సురిఁగి యున్నవి గాని సొంపు లేదు' (వీర 2 68.)(మొ.)(చూ.సూ.ని.). 'సొరుగు, సొగయు' అనువానికిఁగూడ ఈఅర్థ మిచ్చుట లేదు (శ.ర.). ప్రయోగము లున్నవి - 'సొగయుకన్నులతోడఁ దొగలు ముడిఁగె' (దశా. 9. 424.) (చూ.బ్రౌ.) 'పాంథజనములు కొమ్మలప్రాపుఁ జేర। సొరిగి యొండొంటిలతకూన లొరిగి పడఁగ' (దశా.9.145.). ఇట (టీక) 'వాడి' అని అర్థ మిచ్చినది (చూ.బ్రౌ.).

వాడెను:—(ఆం.శే.) ఇట్లను చున్నది-'వాడెఁ గసుగందె ననఁ బయిలోడె ననఁగ। విన్నవోయె ననంగను జిన్నవోయె। ననఁగఁ బెల్లగు నివి భిన్నుఁ డయ్యె ననుట (కంధకాసురహరణ)' (ఆం.శే.28.).

గీ. ఒరులు చెప్పినవెనుకఁ దా నొకటి చేసె
ననెడిమాటకు మొం డొడ్డె, ననఁగఁ దోఁచు;
మల్లచఱచె, ననంగను మను భుజంబు
లప్పళించె నటంచు; సూర్యావతంస ! 108

మొం డొడ్డెను—ఇవి ఒరులు చెప్పినవెనుకను తాను ఒకటి (వేఱుగా; చెప్పిన; దానికి భిన్నముగా) చేసెను (మూర్ఖత్వము (మొండితనము) వహించెను - అనుటకు) పేరు.

మల్లచఱచెను—ఇది భుజములు అప్పళించెను (భుజాస్ఫాలనము చేసెను;భుజముపై (దండపై; మోచేతిపై భాగముపై) పెద్దధ్వని యగునట్లు అఱచేతితో కొట్టెను-అనుటకు) పేరు.

మొం డొడ్డెను:—మెం డొడ్డెను 'పురు లొడ్డెను' మొ.వానిని(బ్రౌ.) (మొ.)ఉదాహరించినవి (చూ. ఒడ్డు).(బ్రౌ.)'మొండు' గ్రహించి,'మొండు'అనగా భిన్నత్వమును మోనగాఁడును (ఆం.వా.) అను చున్నది. 'మొం డొడ్డెను' అనుదానినిఁబట్టి 'మూర్ఖత్వము' అను అర్థమున 'మొండు

ఉన్న దనిపించును. (సూ.ని.) గూడ 'మొండు' గ్రహించినదికాని 'విణ. కొంత తెగినది (కాలు,ముక్కు-మొ.) అనుచు 'ముక్కుక రామానుజుండు శూర్పణఖ । ముక్కును జెవులును మొండు సేయుటయును' (రం.రా.బాల.6పొ.16పం.) (చి.ని.పా.) 'మోడు సేయుటయు' (ముద్రి.పా.) 'మొండి సేయుటయు' (శ,ర.పా.)' అను చున్నది. (శ ర) కూడ 'మొండి'కి (రూపాం.)గా 'మొండు' గ్రహించినది. ఇఁక 'మొండు' అనుదానికి 'ఛిన్నత్వము' అర్థ మని (ఆం.భా.) అను చున్నందున 'మొండి, మొం డన ఛిన్నత్వ మొనరెను' (2.124లో) అని (బ్రౌ.పా.) అగు నని తెలియవచ్చును. 'మొం దొడ్డెను' అనుచో 'మొండు' అనుదానికి లాక్షణికము గా (కాలుసేతులు వేఱుపడుటవంటి) వేఱుపాటు; కలయమి. అది కలిగి ఉండు వాఁడు-అనుఅర్థ మనవచ్చును, ఈ 'మొం డొడ్డు'నుబట్టి (2.124 )లో బ్రౌ.పాఠమే(ఆం.భా) అభిప్రేత మనవచ్చును. లేదా, భావప్రధాన నిర్దేశము గలశబ్దపల్లవ మిది-అన వలయును. పరి శీలించిన-అ ట్లనుటయే యుక్త మని తోఁచు చున్నది.

గీ. అతిశయముఁ జేసె ననుమాట కాఖ్య గాను
బొలిచియుండును బొంపిరివోయె, నాఁగఁ;
గనులు చెదరంగఁ జీకట్లు గ్రమ్మె ననుట
కలరు మిఱుమిట్లుగొనె, నన; నద్రి నిలయ ! 109

పొంపిరివోయెను—ఇది అతిశయమును చేసెను (అతిశయించెను; అధికమాయెను-అనుటకు) పేరు

మిఱుమిట్లుగొనెను—ఇవి కన్నులు చెదరునట్లు చీకట్లు క్రమ్మెను (అధికతేజస్సును చూచినప్పుడు కన్నులు మిక్కిలిచలనము కలిగి గాఢాంధకారము కలవి గా అగును. అ ట్లాయెననుటకు) పేరు.

అతిశయము:—'ఉత్కర్షో ఽతిశయే' (అమ.). ఇట 'అతిశయనమ్-శీఙః 'ఏ రచ్' (3.3.56 )' (భావే) అని (సుధ).

పొంపిరివోవు:—'....గురుపతిబలముం । బరిమార్చునట్టిసత్త్వము । పురుహూతా ! యిమ్ము కరుణ పొంపిరివోవన్' (హర.7.24.) (చూ.సూ.ని.).

మిఱుమిట్లు:—(మిట్లు+మిట్లు) - 'అందదుకుప్రభృతులు యథాప్రయోగంబు గ గ్రాహ్యంబులు' (బాలవ్యా.సంధి.42.). మిఱుమిట్టులు' 'మిర్మిట్లు' (రూపాం.)-(మిఱుమిట్టులు) - 'మిక్కిలి

తేఁటిచూడ మిఱుమిట్టులు గొల్పుఁ జరించునప్పు డమ్మక్క ; తళుక్కునన్ మెఱసిన ట్లగు.." (విజ.3.14.). (మిర్మిట్లు) - 'బెరసి మొగిళ్లు నెత్తురువాన గురిసెను, మెఱుఁగులు దెసలఁ మిర్మిట్లుగొలిపె' (భాగ.3.604.) (చూ.సూ.ని.).

క. కనిపించె, ననెడి మాటకు
  వినిచె ననం జెల్లు చుండు; వీఁగె, ననంగాఁ
  దనరును గర్వించె నటం
  చని; త్రిశిరఃపురనివాస ! యాదృతదాసా ! 110

కనిపించెను— ఇది వినిచెను (వినఁబడెను; వినవచ్చెను-అనుటకు) పేరు.

వీఁగెను—ఇది గర్వించెను (గర్వపడెను; గరువము కలవాఁ డాయెను- అనుటకు) పేరు.

కనిపించెను:— ఈపదమును నిఘంటువులు ఈయర్థమున గ్రహింప లేదు. 'ఎక్కడఁ జూచినా వానిపేరు కనిపిస్తున్నది' అని (వ్యవ.).

వీఁగెన్:—దీనికి 'నిక్కు, ఉత్సహించు'-అనురీతియర్థములనే (సూ.ని.మొ.) ఇచ్చినవి. 'ఉత్సహించు'-అనుటకు వీ రిచ్చినప్రయోగము లి ట్లున్నవి- 'వీఁగి తనతల్లిదాస్యంబు నీఁగఁ బూని' (భార.1.3.).'ఎల్ల విభాగించి యిచ్చినం దమతమవృత్తుల నుండక వీఁగి పాండు ధృతరాష్ట్ర నందనుల్' (భార.1.35.) ఇచ్చట నంతటను 'గర్వించు' అనునర్థము సరిపడు ననిపించును. మొదటిప్రయోగమున, వీఁగి-గర్వించి, ఇంద్రునిని; ఇంద్రునిబలమును తృణప్రాయముఁ గాఁ జూచి' అనుటయే ఇట పూర్వాపరపరామర్శమున యుక్త మనిపించును. భారతవ్యాఖ్యాతలు శ్రీ చదలవాడవారు గూడ 'వీఁగి=గర్వించి' అనియే ఇట అర్థము చెప్పినారు. ఇఁక రెండవ ప్రయోగముకడఁగూడ ('....తమతమవృత్తుల నుండక) వీఁగి - గర్వించి; బలమున 'మే మెక్కుడు, మే మెక్కుడు' అని తలఁచి ఒకరి నొకరు తృణీకరించి; లెక్కసేయక' అనుటయే సముచిత మనిపించును.అందులకే ఇచ్చటఁగూడ చదలవాడవారివ్యాఖ్య 'గర్వించి'అనియే అర్థ మిచ్చినది. భాగ.ప్రయోగ మొకటిగూడ (సూ.ని.) ప్రదర్శించి, దీనికి ('వీఁగు'కు)ఉత్సహించి-అర్థ మనినది. ఆప్రయోగ మిది. 'ఏకాంతామణియందు వీఁగి కనెనో యేకాంతుఁ డీ కాంతునిన్' (ఉ.10.30.). ఇచ్చట 'ఉత్సహించు' అను-అర్థమే సమంజస మనిపించును.

'వీనిఁ గనెనో ...' అని (పారాం.) ఉన్నది కాని, 'ఈకాంతునిన్ వీనిన్ కనెనో' అనుట సంగతము గా లేదు. 'వీఁగు'నకు గర్వము-అను-అర్థ ముండుటకు 'విఱ్ఱవీఁగు) ఒకనిదర్శనము- 'వెఱ్ఱు లై యతని భావించి బాంధవులు । విఱ్ఱవీఁగెద రాస విడిచెద రింక' (అభి.166) మొ. (చూ.(బ్రౌ.) గర్వమునకు లక్షణ మి ట్లున్నది - 'ఐశ్వర్యరూపతారుణ్యకులవిద్యాబలైరపి । ఇష్టలాభాదినా ఒన్యేషా మవజ్ఞా గర్వ ఈరితః' (స.త.సి.ప.ల.సం).

గీ. సోలె, ననఁగను దగు వాడి వ్రాలె ననుట;
మనును సొమ్మలు వోయె, సొమ్మసిలె, ననఁగ
మూర్ఛఁ జెందె నటం చనఁ; బొంచె, ననఁగ
దాఁగుకొనియుండె ననుమాట దగు; మహేశ !		111

సోలెను—ఇది వాడి వ్రాలెను (బడలిక చెంది వివశుఁ డయి నేలకు - ఒరగెను-వంగెను-అనుటకు) పేరు.

సొమ్మలువోయెను, సొమ్మసిలెను — ఇవి మూర్ఛను చెందెను (మూర్ఛిల్లెను; మూర్ఛవోయెను; సొమ్మవోయెను; స్మృతి తప్పి ఉండెను-అనుటకు) పేర్లు.

పొంచెను—ఇది దాఁగుకొని ఉండెను (దాఁకొనెను; మఱుఁగువడి కానరా కుండ ఉండెను-అనుటకు) పేరు

సొమ్మలు వోయె:—'సొమ్మల వోయె'- వావి.అపముద్రి.). 'సొమ్మలఁ బోయెను' అని (బ్రౌ. పా.) 'పొలసి యతండు తేరిపయి సొమ్మలు వోయె నచేతనస్థితిన్' (ఉ హరి.4 ఆ.) (చూ. శ.ర.సొమ్మలు వోవు.). శబ్దపల్లవములఁగూర్చి అధర్వణుఁ డి ట్లను చున్నాఁడు - 'క్రియాః ప్రసిద్ధా బహవ శ్శబ్దపల్లవసంజ్ఞికాః । ప్రథమాయా ద్వితీయాయా స్సమ్బన్ధ స్తత్ర సమ్మతః॥ తయో ర్విధి ర్యథాయోగం తత్సమా ద్వైకృతా దపి। క్రియాయా ఉపచార స్స్యా త్ప్రథమా పదసఙ్గతౌ॥ అకర్మకత్వం ప్రాయ స్స్యా త్పర త్రోభయసమ్మతి ః' (చూ.అహో.48సూ.వ్యా.).

గీ అఱచె,అంపిలె,ననఁ గూసె ననుట వెలయు;
సరిగ నెదిరించె ననుమాట చనును మాఱు
మసలె,ననఁగను; బొప్పె,నా మనును వ్యాఘ్ర
మారవముఁ జేసె ననుట; చంద్రార్ధచూడ !		112

అఱచెను,అంపిలెను—ఇవి కూసెను (ప్రేలెను; వాగెను; వదరెను; ప్రలాపించెను-
అనుటకు) పేర్లు

మాఱుమసలెను—ఇది సరిగ ఎదిరించెను—(సమానము గా ప్రతిఘటించెను; నీ
వెంత యనిన నీ వెంత యనెను; మాఱు మలసెను - అనుటకు) పేర్లు.

రొప్పెను—ఇది వ్యాఘ్రము ఆరవమును (ధ్వనిని) చేసెను (కాండ్రు కాండ్రు మని
అఱచెను-అనుటకు) పేరు.

[సరిగ:—'సరిగె' (వావి. అపముద్రి.)]

అంపిలెన్.—'అంపిల్లుట-వాపోవుట. వాపోవుట-ధ్వని గా రోదనము చేసుట, అక్కఱ లేనిమాట
లాడుట (దీపిక.). అని (బ్రౌ.).

గీ. లంబనం బాయె ననుట కైవ్రాలె, ననఁగఁ
బొలుచుఁ; దగుఁ బొడమె,ననంగఁ బుట్టె ననుట;
కాయె,నయ్యె,ననంగఁ జెన్నలరుఁ గలిగె
ననెడిమాటకు; మాతృభూతాభిధాన ! 113

కైవ్రాలెను—ఇది లంబన మాయెను (వ్రేలెను; వ్రేలాడెను (సూర్యబింబాదులు)
క్రిందికి ఒరగెను (వంగెను) అనుటకు) పేరు.

పొడమెను—ఇది పుట్టెను (జనించెను-అనుటకు) పేరు.

ఆయెను,అయ్యెను—ఇవి కలిగెను (సంభవించెను; ఒనగూడెను; ప్రాప్తించెను-అను
టకు) పేర్లు

కైవాలు —కైవ్రాలు (రూపాం.) 'ప్రొద్దు కైవాలు దాఁక నప్పడఁతు లుండి. ....'(శుక.3.93.)
(చూ.సూ.ని.). 'లంబమానదివాకరమండలంబు' అనురీతినిఁ గవులవాక్కులు బహుల
ములు గా దృష్టములు (చూ.మను.మొ.). '.. ప్రాయ మింతకును మిగులఁ గైవ్రాల
కుండ. ' (కాశీ 1,7.). మొ.ప్రయోగములందు (సూ.ని.) 'కైవ్రాలు'కు 'గతించు, కడచు'
అర్థ మను చున్నది. ఇది పైయర్థమునుండి ఏర్పడిన-ఒక విశేషార్థ మనవచ్చును.

ఆ.వె. మళ్లె, మరలెఁ, దిరిగె, మగిడె, ననంగను
క్రమ్మఱిలె నటంచుఁ గానఁబడును;
వినిచె, ననఁగఁ దోఁచు వినఁబడె నం చని;
మహితగుణసమేత! మాతృభూత! 114

మళ్లెను, మరలెను, తిరిగెను, మగిడెను—ఇవి క్రమ్మఱిలెను (వెనుకకు మరలి పోయెను; పరావృత్తుఁ డాయెను-అనుటకు) పేర్లు.

వినిచెను—ఇది వినఁబడెను (వినవచ్చెను; విన నాయెను-అనుటకు) పేరు

వినిచెన్·—(ఇది) సకర్మకమును గలదు 'విను' మీఁద అగు ప్రేరణ మది 'వినఁజేయు, వినిపించు' అని అర్థము 'సంతసముఁ జెంది భూసురుఁ। డంతన్ విజయాస్పదమున కరిగి ధరిత్రీ। కాంతునిఁ బొడగాంచి శుభో। దంతము వినుచుటయు నతఁడు హర్షముఁ జెందెన్' (కవిజ. 3.3) (చూ.సూ.ని). (ఆం.భా.) పైని ఇచ్చిన (అ.క్రి.) కి ప్రయోగములు బహులములు గానే ఉన్నవి-'....దివ్యవాణి దా వినిచె ధరాధినాధునకు విస్మయ మందఁగఁ దత్సభాసదుల్' (భార ఆది 4 104) మొ

ఆ.వె. చిక్కుపడియె, దొరకెఁ, జేపడె, నగపడెఁ,
దవిలెఁ, బట్టువడియెఁ, దగులువడియె,
నబ్బె, నన గృహీత మయ్యె ననం దగు;
మహితగుణసమేత! మాతృభూత! 115

చిక్కుపడియెను, దొరకెను, చేపడెను, అగపడెను, తవిలెను, పట్టువడియెను, తగులువడియెను, అబ్బెను—ఇవి గృహీత మయ్యెను (పట్టుకొనఁబడెను; చేతఁబడెను; హస్తగత మాయెను; చిక్కెను-అనుటకు) పేర్లు

చిక్కుపడియెన్:—ఈ పదమునకు ఈ-అర్థమును (శ.ర.బ్రౌ.లు) ఈయ లేదు. (సూ.ని.) ఇచ్చి ఈ (ఆం.భా.నే) ప్రమాణముఁగా కొనినది. (సాంబ.) దీనికి పర్యాయములను చాలపటుకు ఇట్లే ఇచ్చినది-'అగపడెఁ జేపడె నబ్బె దొరకెఁ జిక్కెఁ, దగిలెఁ దగుల్కొనెఁ దగులువడియెఁ। బట్టువడియెఁ జిక్కువడెఁ దవిలె ననంగ,నమరు గృహీతాఖ్య (లజిచె..)' (అని).

ఆ.వె. దోఁపువోయె, ననుట దోఁచు నులివడె న
నంగ; దిమ్మపడె, ననంగ డిందు
వడియె ననుట దోఁచు; విడఁబడె, ననఁగను
దనరు విడువఁబడియె ననుట; కథవ ! 116

దోఁపువోయెను—ఇది నులివడెను (దొంగిలింపఁబడెను; అపహరింపఁబడెను-అనుటకు) పేరు.

దిమ్మపడెను—ఇది డిందువడెను (మత్తుగొనెను;మత్తు (మత్తత) కల దాయెను; దానిపని అది చేయుటకు అనుకూలపడక ఉండెను-అనుటకు) పేరు.

విడఁబడెను—ఇది విడువఁబడియెను (విచ్చలవిడి గా ఉండెను; కట్టు వదలించుకొని నిరంకుశము గా (యథేచ్ఛము గా) ఉండెను-అనుటకు) పేరు.

దోఁపువోయెను:—(సూ.ని.) 'దోపువోవు'నకు 'నులివడు'అర్థ మిచ్చి ఈ (ఆం.భా.నే) ఉదాహరించినది. 'నులివడు'కడ మరల ఈ(ఆం.భా.నే) ఇచ్చి'దోఁపుడువడు'అని వివరణ మిచ్చినది. 'దోఁపుపడు'కడ(దోఁపు+పడు) 'కొల్ల నొందు,దొంగిలింపఁబడు' అనినది.'దోఁపుడు'నకు ఐన పర్యాయమే 'దోఁపు'. '....దోఁపుడు నాఁగను దోఁపు నాఁగ। దొంగతీక మనంగ దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు'(ఆం.భా.2.292).'నులిగొను' అనుదానికి(ఆం.శే.) 'పెనఁగొనె గిటికొనియెను..నులిగొనె నన నాఖ్య లఁగును వలయిత మయ్యె ననుటకును..'(67.)అను మన్నది. 'నులిగొను' 'నులివడు' వే అన వలయును. లేదా,'చుట్టు ముట్టి ఏతట్టునకును బో నీక నిర్బంధించి సర్వస్వము దొంగిలింపఁబడుట దీనికి అర్థ మన వలయును. ప్రయోగములు 'దోఁపు' నకు ఇ ట్లున్నవి-'దోఁపు నిచ్చువాఁడు తోడన నెఱదాత। దోఁచుకొన్నవాఁడు ద్రోహి యయ్యె. (వేమ.3.69.) '....దెంపు గనఁగఁ బలికి। నిలిపి దోఁ పిచ్చువారు నై తొలఁగి రపుడు' (ఆము.6.77.) (చూ.సూ.ని.).

దిమ్మవడెను:—'దిమ్మవడు-డిందువడు-అని, 'డిందువడు'కడ 'దిమ్మవడు, మత్తుగొను'-అని వివరణ మిచ్చి ఈ(ఆం.భా.నే) ఇచ్చినది (సూని.). 'సొమ్మ వోయి దిమ్మ వట్టినది'.(వానికి సొమ్మ వోయినది దిమ్మ వట్టినది) (వ్యవ.) (చూ.సూ.ని.). 'డిందె-తగ్గె' పర్యాయము లని (ఆంభా.3.83).

గీ. పొదివెఁ, గవిసెను, గ్రమ్మెఁ; నాఁ బొలుచు నావ
రించె ననుమాట గాను; మలంచెఁ, జుట్టె,
గిఱికొనెను, బ్రమ్మెఁ, బరిగొనె, గ్రిక్కొనె, నన
వెలయు వేష్టించె ననుటకు; వేదవేద్య ! 117

పొదివెను, కవిసెను, క్రమ్మెను—ఇవి ఆవరించెను (కప్పెను; మూసివేసెను-అనుటకు) పేర్లు.

మలఁచెను, చుట్టెను, గిఱికొనెను, ప్రమ్మెను, పరిగొనెను, గ్రిక్కొనెను — ఇవి వేష్టించెను (చుట్టుకొనెను; పరివేష్టించెను; చుట్టును అలముకొని (క్రమ్ముకొని) ఉండెను-అనుటకు) పేర్లు.

[సకర్మకక్రియలు ఇచ్చటినుండి (117ప.నుండి) ప్రారంభ మగుచున్నవి.]

వేష్టించెను:—(సాంబ) '...వేడె మొనరించెఁ గ్రమ్మెఁ బొదివెఁ। జుట్టుకొనె నావరించె నానిట్టినుడులు। వేష్టనంబున కమరు' (మాన 21.)అని 'క్రమ్మె' 'చుట్టుకొనె' అనువానిని సమానార్థకములఁ గా (విశేషవివక్ష పాటింపక) వచించు చున్నది. ఇట సాంబ. 'ఆవరించెను' అనునది 'తెలుఁ'గనుట గమనింపఁ దగి యున్నది.

పరిగొనె:—(సూ.ని.)'బరిగొనె'అని(సరళాది)యే ఇచ్చటిపాఠ మను చున్నది. దీనికి ప్రమాణముగా'....కరములు మూఁపు లూఁదుకొని కన్నెలు చన్నులబంటి నొండొరుల్। బరిగొని నిల్వఁదత్పరిధి...' (వసు.3.136.) పద్యమును ఉదాహరించినది. '....తత్పరిధి ....' అను అనుప్రాసము, (అనవలసి వచ్చిన ఒకప్పుడు) 'పరిగొను' అనుటకే ఇది నిర్ధారక మనును. 'బరిగొను' - ఇది అనుటకు నిర్ణాయకము గా మఱి ఏదియు (సూ.ని.)ఇచ్చుట లేదు. (బ్రౌ) 'పరిగొను' (ఆం.భా.పా.) ఇచ్చి 'పరిగొన్నపచ్చకప్రపుదుమారము రేఁచి' (పం.4.288) ప్రయోగముకూడ ఇచ్చినది (చూ.అను.).

ఆ.వె. మెసవెఁ, దినియెఁ, గుడిచె, మెక్కె, బోనేసెను,
నమలె, నారగించె, నా భుజించె
ననుట కాఖ్య లగుచు నలరారు చుండును;
మాతృభూత ! భక్తమాతృభూత ! 118

మెసవెను, తినియెను, కుడిచెను, మెక్కెను, బోసేసెను, నమలెను, ఆరగించెను— ఇవి భుజించెను (సాపడెను; పసాపడెను; భోజనముచేసెను - అనుటకు) పేళ్లు.

భుజించెను:— (అం.సం.కూడ) కొన్నిపర్యాయములను ఇందులకు ఇట్లు ఇచ్చినది - 'మెసవె నారోగిణ మొనర్చె మెక్కెఁ దినియెఁ। గుడిచె నారగించెను బసాపడియె నమలె। సాపడె ననంగ నొప్పు భోజనముసేసె। ననుట కివి యాఖ్య లై'(మాన.22.) ఇట్లే (సాంబ.మొ.).

సీ. పొందె, హత్తెఁ, గలసెఁ, జెందెఁ, దార్కొనెఁ, గూడె,
బెరసెఁ, గ్రిక్కిఱిసెను, బెనఁగె, దొరసె,
నందెఁ, గదిసెఁ, జేరె, నన నంటె నని తోఁచు;
వాక్రుచ్చె, నుడివెను, బలికె, నాడె,
ననె, ననఁగ వచించె నం చను; విలసిల్లు
వినియె నాఁ జెవి దోరపెట్టె, నాఁగ
నాలకించెను, వినె, నాలించె ననఁగను;
బూనెఁ, దాల్చెఁ, దొడిగె, మోచె, నాఁగఁ

గీ. దాల్చె, నా గొదగొనె, ననఁ దనరు నావ
హించె ననుమాట గా; వెడలించె, రొప్పె,
పీచెఁ; దఱిమెను, దోలెను, వెళ్లఁదన్నె,
ననఁగ నుచ్చాటనముఁ జేసె ననఁ దగు; భవ। 119

పొందెను, హత్తెను, కలసెను, చెందెను, తార్కొనెను, కూడెను, బెరసెను, క్రిక్కిఱిసెను, పెనఁగెను, దొరసెను, అందెను, కదిసెను, చేరెను—ఇవి అంటెను (తాఁకెను; తగిలెను; ముట్టెను, స్పృశించెను-అనుటకు) పేర్లు.

వాక్రుచ్చెను, నుడివెను, పలికెను, ఆడెను, అనెను,—ఇవి వచించెను (నొడివెను; భాషించెను; చెప్పెను-అనుటకు) పేర్లు.

చెవి దోరపెట్టెను, ఆలకించెను, వినెను,ఆలించెను—ఇవి వినియెను (చెవియొగ్గెను; చెవి వాలఁబెట్టెను; శ్రవణముచేసెను-అనుటకు) పేర్లు.

పూనెను,తాల్చెను, తొడిగెను, మోచెను, తార్చెను, గొదగొనెను—ఇవి ఆవహించెను (మోసెను; వహించెను; ధరించెను-అనుటకు) పేర్లు.

వెడలించెను, రొప్పెను, పీచెను, తఱిమెను, తోలెను, వెళ్లఁ దన్నెను—ఇవి ఉచ్చాటనముఁ జేసెను (ఉత్పాటించెను; స్వస్థానమునుండి లేవఁ గొట్టెను - అనుటకు) పేర్లు.

పెనఁగెన్:—వీనికి ఈఅర్థ మిచ్చి సకర్మకముఁ గా నిఘంటువులు గ్రహించుట లేదు (సాంబ) కూడ దీనికి ఈఅర్థమును ఇచ్చినది (చూ.మాన.26.).

అంటెన్:—(సాంబ.) దీనికి కొన్నిపర్యాయములను ఇట్లే ఇచ్చినది.‘....గలసె బెరసెఁ గూడె హత్తె దొరసె। నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె నంటె ననఁగ। నమరు సక్తాఖ్య’ (మాన. 26.) (సక్తాఖ్య) సక్తమగు-తగులుకొను; విడువ కుండు; బాగుగా తాఁకి ఉండు - అనుట) ఇచ్చట-‘కలసెఁ బెరసె’ అనునది (వావి.అప ముద్రి ) (ఆం సం ) కూడ ‘ఎలసె బెరసె హత్తె నెనసె నదికెఁ జెందెఁ। బొందె దొరసెఁ గూడె నొందెఁ జెనకె। ననఁగ సక్త మయ్యె ననుట కివి యాఖ్య లగు’ అనినది. (చూ మాన 36.)

వచించెన్:—దీనికి కొన్నిపర్యాయములను చాలవఱకు ఇట్లే (వేంక.) ఇచ్చు చున్నది.‘ ..నాడె వాక్రుచ్చె, నుడివెఁ జెప్పె నొడివెను బలికె ననె।నన వచించె ననుట కాఖ్య లమరు చుండు’ (మాన 49.).

వినియెన్.—దీనికివి కొన్నిపర్యాయములను (వేంక.) ఇట్లు ఇచ్చినది - ‘వినియె నాలించెఁ జెవి వాలఁ దెట్టె నాల। కించె నూఁకొనె వినెను నంకించె ననఁగ। వినిచె నన శ్రుత మౌట కొ’ (మాన.49.).

వినెన్:—సర్వలక్షణసారసంగ్రహము ఇట్లను చున్నది.‘చనియెఁ గనియెఁ గొనియె ననుటకుఁ జనెఁ గనెఁ। గొనె నటంచుఁ జెప్పఁ గూడ దనుచుఁ। బలికె నూత్నదండి పరికింప వినియును। గలవు కృతుల’ (చూ.ప్ర.ఆ.). అహోబలపతియు వీనిని సాధువు లని (అధర్వణమునుబట్టి) (‘చనెన్, వినెన్’ ఇత్యాది ప్రయోగోఽపి ప్రబన్ధేషు వర్తతే’ అనుచు) సాధించినాఁడు (చూ. ‘అ ద్యః క్రియాసు ష్వినా సర్వః’ అనుసూత్రమువ్యాఖ్య.).

ఆవహించెన్:—దీనికిఁ గొన్నిపర్యాయములను (వేంక.) ఇట్లు వచించినది 'ఆవహించె ననుటఁ కానెఁ బూనెను మోచెఁ,దాలిచె నన నొప్పుఁ....'(మాన.50.).

పీచెన్:—ఒకటికి రెండు నిఘంటువులు (వేంక.ఆం.భా.) (ఇట్లు) ఈఅర్థ మిచ్చినను (బ్రౌ.), ఇచ్చు చున్నను (సూ.ని.) దీనికి ఈఅర్థము వచింప లేదు.

ఉచ్చాటనముఁ జేసెను:—కొన్నిపర్యాయములను దీనికిని (వేంక.) ఇట్లు ఇచ్చినది—'..దోలె పీచె। వెడలించె రొప్పెను వెలలఁబన్నెఁ దఱిమె,నాఁ బొల్చు నుచ్చాటనమ్ముచేసె। ననుటకుఁ....' (మాన.50,) ఇట్లే 'వెడలించె, వెళ్లఁగొట్టెను దోలె వెలలఁబన్నెఁ। దఱిమె రొప్పె ననంగఁ దనరు నుచ్చాటనం। బొనరించె ననుటకుఁ..' (సాంబ.మాన.27.). ఈ నిఘంటువులను ఇంత గా ఉదాహరించుట వీనికిఁ గల (ఆం.భా.) సంవాదమును తెలియఁ జెప్పుటకే.

[కలసెన్:—'కలిసెన్' (పారాం.).].

గీ. అడ్డగించెఁ, దటాయించె, నానె, నాఁగె,
నిలిపె, నరికట్టె, ననఁగను వెలయు చుండు
వారణముఁ జేసె ననుటకు; మీఱు చుండుఁ
దన్నె,ననఁ దాఁచె ననుటకై; ధాతృవంద్య! 120

అడ్డగించెను, తటాయించెను, ఆనెను, ఆఁగెను, నిలిపెను, అరికట్టెను—ఇవి వారణము జేసెను (నివారించెను; అడ్డుపెట్టెను; ఆటంకపఱచెను-అనుటకు) పేర్లు.

తన్నెను—ఇది తాఁచెను (కాలితో కొట్టెను-అనుటకు) పేరు.

వారణముఁ జేసెను:—'నివారించె ననుట కలరు। నడ్డగించెఁ దటాయించె నాఁగె నిలిపె। నాఁచె నరికట్టెఁ బోనీక యాఁపు చేసె। నాఁక యొనరించె నను పేరు (లంబుజాక్ష!)' (వేంక. మాన. 50.).

తాఁచెన్:—(వేంక.) ఇందులకు ఇట్లే కొన్నిపర్యాయములను ఒసఁగినది- '....కంఘ్రి। తాడన మొనర్చె ననుట కొఁ దాఁచెఁ దన్నె।నడుగుతాటించెఁ గాళ్లచే నడఁచె ననఁగ...'(మాన.60.). 'తన్ను'కు 'పాదతాడనము'-అర్థ మని (సాంబ.కూడ) అను చున్నది (చూ.మాన.38.). (శ.ర.) ఈయర్థమునే దీనికి ఇచ్చినది-'ఒడిసి తల పట్టి తిగిచి మహోగ్రవృత్తి। కొంకు కొస రించుకయు లేక కూలఁ దాఁచె' (భార.విరా.2ఆ.). ఇట (సం.భా.)' అ థైనాం పశ్యతో

రాజ్ఞాం పాతయిత్వా పదాఽవధీత్' అను చున్నది (చూ.శ.ర.తాఁచు) ఐనను - 'దె_త్తముతో తన్నినాఁడు'-మొద లగువ్యవహారమునుబట్టి (వ్యావహారికము గా) కొట్టు (బాఁదు) అనికూడ అర్థము అనినది (సూ.ని.) (చూ.తన్ను-2 అర్థము.). 'ప్రహరించెను' అనుటకు వేఱు గా ఈపద్యనిఘంటువులు పర్యాయముల వచించు చుండుటనుబట్టి-వ్యావహారికార్థము వీనికి సంమతము కా దనవచ్చును ' .. ప్రహరించె ననుటకు వరలు నాహ్వాయములు, మొ_త్తెఁ గొట్టెను వ్రేసె మోఁదె ననఁగ '(వేంక.మాన.61.) మొ. ఆం భా. ఇట్లే 'మొ_త్తెఁ గొట్టెను వ్రేసె మోదెను మరిపె నాఁ. ప్రహరించె ననుటకుఁ బరఁగు చుండు' (3.124) అనినది వేఱు గా.

గీ. పురికొలిపె, నంచెఁ, బు_త్తెంచెఁ, బుచ్చెఁ, నంపెఁ,
బంచెఁ, బంపెను, బంపించెఁ, బనిచె. ననఁగ
నలరు నంపించె ననుమాట కర్థ మగుచు;
భూతిలసితాఁగ ! శ్రీమాతృభూతలింగ !		121

పురికొలిపెను, అంచెను, పు_త్తెంచెను, పుచ్చెను, అంపెను, పంచెను, పంపెను, పంపించెను, పనిచెను——ఇవి అంపించెను (పోవఁజేసెను; వెళ్లన ట్లొనర్చెను; పయనింపఁ జేసెను-అనుటకు) పేర్లు.

అంచెన్: ..(వేంక.) కూడ ' ప్రస్థితుఁ జేసె, ననుట కనిచెఁ బంచె నంపె నంచెఁ । బుచ్చెఁ బు_త్తెంచె వెలు మనెఁ బొ మ్మనె నన' (మాన.63.) అనినది. ఇట్లే (ఆం.సం.) 'అనిపె ననిచెఁ బనిపెఁ బనిచె నంపెను బంపెఁ । బుచ్చె గెలువు మనియెఁ బొ మ్మటనియె । ననఁగ నివి సమాఖ్య లగును ప్రస్థాపించె । ననెడుక్రియకు ...' (మాన.72.) అని, ఈప్రస్థానము యుద్ధమున కైన ప్రస్థాన మనునట్లు వచించిన దనిపించును 'గెలువు మనియె' అనుటనుబట్టి. కాని 'గెలువు' మనుటకుఁగూడ 'పోవు' అనెడి అర్థ మున్నట్లు క్రిందిప్రయోగమును ఉదాహరించినది (సూ.ని.). '.... .జడలోనిరత్న మిందు మనుచు । నిచ్చి తెలతెలవాఱఁగ వచ్చె గెలువు । మనిలజా ! యంచు దీవించి యనుపుటయును' (రామా.6.198.).

సీ. కనుఁగొనెఁ, దిలకించెఁ, గాంచెఁ, జూచెను, గనె,
		ననఁగను గనియె నం చనఁ జెలంగు;
నానె, నం చనఁ గ్రోలె, ననఁ ద్రావె, ననఁగ నా
		స్వాదించె ననుట కై వఱలు చుండుఁ;

బీల్చె, జుఱ్ఱె, ననంగ వెలయుఁ దద్భేద మై;
వెదకె, నారసె, రోసె, వెనకె, నెమకెఁ,
బరికించెను, దడవె, నరసె, ననంగ న
న్వేషించె ననుటకు వెలయుచుండుఁ;

గీ. దూకొనెను, జొచ్చెఁ, జొరఁబాఱెఁ, దూఱె, దూనె
ననఁ దటారించె ననుమాట కర్థ మగును;
గాఁడె, గ్రుస్సెను, దొలిచెను, నాడె, ననఁగ
నాటె ననుమాట కర్థ మౌ; నాగభూష ! 122

కనుఁగొనెను, తిలకించెను, కాంచెను, చూచెను, కనెను—ఇవి కనియెను (కన్గొనెను; దరిసించెను; వీక్షించెను; ఈక్షించెను; ఆలోకించెను; అవలోకించెను; పొడగనెను-అనుటకు) పేర్లు.

ఆనెను, క్రోలెను, త్రావెను—ఇవి ఆస్వాదించెను (ఆస్వదించెను; పానముచేసెను; త్రాగెను-అనుటకు) పేర్లు.

పీల్చెను, జుఱ్ఱెను—ఇవి తద్భేదమునకు (అస్వాదవిశేషమునకు) చప్పుడు గాకుండ త్రాగెను-అనుటకు) పేర్లు.

వెదకెను, ఆరసెను, రోసెను, వెనకెను, నెమకెను, పరికించెను, తడవెను, అరసెను—ఇవి అన్వేషించెను (వెతకెను; గాలించెను-అనుటకు) పేర్లు.

తూకొనెను, చొచ్చెను, చొరఁబాఱెను, తూఱెను, దూనెను—ఇవి తటారించెను (ప్రవేశించెను-అనుటకు) పేర్లు.

కాఁడెను, గ్రుస్సెను, తొలిచెను, నాఁడెను—ఇవి నాటెను (గ్రుచ్చెను (బాణాదులను) లోపలికి దిగునట్లు చేసెను-అనుటకు) పేర్లు.

కనుఁగొనెన్:—'కనుఁగొనెఁ దిలకించెఁ గాంచెఁ జూచెఁ గనియెఁ, ననఁ బొల్చు వీక్షించె ననుట...
(వేంక.మాన.51.) అని ఇక్కడ వచించినది.

ఆనెన్:—' .. నానెఁ ద్రాగెఁ ద్రావెను గ్రోలె, ననఁగఁ బానముచేసె ననుట కొనరు' (సాంబ. మాన.30.).

వెనకెన్:—'వెలచె'-(వావి.పా.) 'వెదకు'నకు (రూపాం.) వెనకు. ('వెదకఁడు'నకు (రూపాం.) 'వెనకుడు' ఇచ్చినది (ఆం.భా.) చూ. 2.173.). 'తనకుఁ బగ యగుప్రొద్దును వెనకి కనక। కనలుచీఁకటిరక్కసి కన్నులందుఁ। దొరుఁగు'కనకన'మను నిప్పుఁదునుక లనఁగఁ। బొడిచె నెడనెడ మిడుఁగుఱుఁబుర్వు లంత' (యయా. 2ఆ.) (చూ.శ.ర.). దీనినిఁబట్టి ఇది 'వెనకె' అగు నని తోఁచినది. నిఘంటువులు 'వెలచు' గ్రహించి ఈఅర్థమును ఈయ లేదు. 'వెదకె నారసె రోసె వెతకెను నెమకెను, బరికించెను దడవె నరసె ననఁగఁ। దనరు చుండు నన్వేషించె ననుట. .'అని (వేంక. మాన. 60.) 'వెతకు' మఱియొక (రూపాం.) దీని కనినది.

తూఱెన్:—'తూఱు'గానే (శ.ర.సూ.ని.) గ్రహించినవి. (సూ.ని.) 'దూరు' అని కొందఱు సరళాది గా గ్రహించినారు - అనినది. 'దూకొనెఁ జొచ్చెను దూరెను జొరఁబాఱె, ననఁగఁ బ్రవేశించె ననుట కమరు' (వేంక.మాన 61.). ఇట్లే (సాంబ మాన 41.) ఇందు శకటరేప యుతముగానే ఇది యున్నది -'వేటొకవిల్లు పుచ్చుకొను వేగములోనన కౌరవేంద్రుమైఁ।దూఱ పాములుపుట్టలోనికిం। దూఱినయట్లు గా .. ' (భార.భీష్మ.2.398.).

నాడెను:—(సూ.ని.) పై అర్థమున దీనిని (అ.క్రి.) గా ఇచ్చి ఈ(ఆం.భా.)ను ఉదాహరించినది. దీనికి పర్యాయములఁ గా 'కాఁడెన్, గ్రుస్సెను, తొలిచెను' అనువానిని ఇచ్చు చున్నది. సకర్మకప్రకరణ మిది,(అ.క్రి.)అనుట ప్రమాదము. ఈ(సూ.ని )తానే'గ్రుయ్యి'కడ 'గ్రుచ్చు' (స.క్రి.) (బాణాదులను నాటు-అని ఈ(ఆం.భా.)ను ప్రమాణముఁ గా ఇచ్చు చున్నది. ఇట్లే 'తొలుచు' కడఁగూడ.

[తటారించెను.—'... దటాకించెమ' (వావి.పా.). ఈపాఠమునే (సూ.ని.) ఒసఁగినది (చూ. తూకొను).(బ్రౌ.) 'దూఱొనుట, ప్రవేశించుట, లోపలికి చొచ్చుట, ౘారించుట (ఆం.భా )' అను చున్నది- (చూ.అను.దూకొనుట). ఇందువలన (ఆం.భా.బ్రౌ.పా.) 'తటారించు' అను నదియే ! ఇదియే నాచే గ్రహింపఁబడినది. 'తటాకించు' (ఆం.భా.పా.)గా ఇచ్చిన (సూ. ని.)

ఐనను 'తటాకించు' అనుదానిని 'పదము' గా తాను గ్రహింప లేదు. 'చొచ్చు, ప్రవేశించు' అనునవి (అ.క్రి. లు గా (శ.ర.) అను చున్నను, (స.క్రి.లు) గా (సూ.ని.) ఇచ్చియే ఉన్నది.]

సీ. నుగ్గాడెఁ, బరిమార్చె, నులిమెను; దెగటార్చెఁ,
జదిపెఁ, జంపెను, సదమద మొనర్చెఁ,
జక్కాడె, నుఱుమాడెఁ, జాఁగఱలాడెను,
బిలుకుమార్చెను, ద్రుంచెఁ, బీఁచ మడఁచెఁ,
బెంచె, మన్నిగొనెను, బెంపె, వెంపర లాడె,
మారిమసంగెను, మడిపెఁ, దునిమె,
గగ్గులకాడులు గావించె, ముగియించె,
నులిచెను, బగ దెంచె, నుఱుముఁ జేసె,

గీ. నడఁచెఁ, జెండె, ననంగఁ బొం దగు వధించె
ననుటకు సమాఖ్య లై; సాకె, మనిచెఁ, బెంచెఁ,
బెనిచె, బ్రతికించెఁ, గాచె, నేదె, నన నొనరుఁ
బ్రోచె ననుమాట; శ్రీమాతృభూతలింగ! 123

నుగ్గాడెను, పరిమార్చెను, నులిమెను, తెగటార్చెను, చదిపెను, చంపెను, సదమద మొనర్చెను, చక్కాడెను, నుఱుమాడెను, చాఁగఱలాడెను, పిలుకుమార్చెను, త్రుంచెను, పీఁచ మడఁచెను, పెంచెను, మన్నిగొనెను, పెంపెను, వెంపరలాడెను, మారిమసఁగెను, మరిపెను, తునిమెను, గగ్గులకాడులు గావించెను, ముగియించెను, నులిచెను, పగ దెంచెను, నుఱుముఁ జేసెను, అడఁచెను, చెండెను—ఇవి వధించెను (రూపుమాపెను; కెడపెను; గీ టడఁగించెను; పొలియించెను; మడియించెను; సంహరించెను; హతము గావించెను-అనుటకు) పేర్లు.

సాకెను, మనిచెను, పెంచెను, పెనిచెను, బ్రతికించెను, కాచెను, ఏదెను — ఇవి ప్రోచెను (పోషించెను; కాపాడెను; రక్షించెను-అనుటకు) పేర్లు.

పెంచెన్:—పెరుఁగునకు ప్రేరణరూపము ఇది -అని కొందఱు. పూసలలో దారము పెరిఁగినది-అని (వ్యవ.) (చూ.వసు వ్యా. 1.28.) పెనుచు-పెంచు-పెంపు-అనువానిలోని 'పెనుచు'నకే

వ్యతిరేకలక్షణచే ఇట్టియర్థము సంపాదిత మైనది (వ్యవ.) లో అనవచ్చును. 'పెరుఁగు' 5 అర్థమునందు (సూ.ని.) 'పెరుఁగు-తెగు,ఛిన్న మగు'అనెడి అర్థమునఁగూడ ఇది సబిందుక మనుచు, ఇట్లే అనినది. (వసు.) ఈఅర్థమున (పెంచు-పెంపు) రెండిటినిఁ బ్రయోగించినది- '....అప్పట్టునం । బుట్టుంగెంపున నింపు మీఱురవిపెంపుం బెంపి.....' (వసు.4.55.) ('పెంచు'నకై -చూ.1.28 ).

గగ్గులకాడులు:—'గగ్గులుకాడును గావించె' అని (బ్రౌ.పా.) (చూ.అను.) 'గ్గగ్గులుకాడును గావించె' అని (వావి.పా.). (వేంక.) ఇట్లను చున్నది 'నుగ్గాడెఁ బరిమార్చె నులిమెను జక్కాడె, మన్నిగొనియె సదమద మొనర్చెఁ ।  . జంపెఁ బిలుకుమారిచెను జా.గఱలాడెఁ బగదెంచె నుఱుముచేసెఁ । దునిమె మడిపె ముగించెను ద్రుళ్లడంచెఁ । ద్రుంచె గగ్గులకాడు గావించె నులిచెఁ । జెండె పెంపరలాడె నాఁ జెలఁగుఁ బేళ్లి।వి యగును వధించె ననుటకు' (మాన.54.) 'గగ్గులకాడులు గావించె-అని (సూ.ని.ఆం.భా.పా.) (చూ.గగ్గులకాడు). ఇదియే పైని నాచే గ్రహింపఁబడినది. 'గగ్గులకాడు' దే.వి. ధాన్యము రాల్చినకంకులసమూహము; దానివంటిది. నిస్సార మైనది-అని (శ ర.సూ.ని.). 'పిగ్గువడి విరియఁబాఱిరి । బగ్గనఁ బొరి వచ్చువీరభద్రునిఘాటిన్।నుగ్గు లయి యి(య.?) పురుషపు రయి। గగ్గులకాడై వికావిక లయి యమర్త్యుల్' (కాశీ.7.89.) (చూ శ.ర.). (గగ్గులకాడులు కావించు-నిస్సారులు గా చేయు; చంపు-అని దీనికి అర్థము.).

సీ. అదలించె, గద్దించె, నడలించె, ననఁగను
గదిమె, నం చనుమాట గాఁ జెలంగుఁ;
గొనియాడెఁ, బొగడెను, గొండాడె, నగ్గించె,
ననఁగను వినుతించె ననుట దోఁచు;
మొత్తెఁ, గొట్టెను, వ్రేసె, మోఁదెను, మరి(డి?)పె, నాఁ
బ్రహరించె ననుటకుఁ బరఁగు చుండు;
వెలయును దేలించె, బెల్లించె, నూటించె,
ననఁగ నెక్కించె నం చనెడిమాట;
యెంచెను, లెక్కించె, నెన్నె, ననంగను
నెగడుచు నుండు గణించె ననుట;

గీ. కడఁగెఁ, గిట్టెను, డాసెను, గదిసెఁ, గవిసెఁ,
జేరె, దగ్గఱె, ననఁ దారసించె ననఁగ
వెలయుఁ; గోపానఁ బెదవిని విఱిచె ననుట
కవుడుగఱచె, నటంచు; నహార్యనిలయ ! 124

అదలించెను, గద్దించెను, అడలించెను—ఇవి గదిమెను (గర్జించెను; బెదరించెను; భయపడునట్లు పెద్ద గా అఱచెను-అనుటకు) పేర్లు.

కొనియాడెను, పొగడెను, కొండాడెను, అగ్గించెను—ఇవి వినుతించెను(స్తుతించెను; నుతించెను; కైవార మొనర్చెను-అనుటకు) పేర్లు.

మొత్తెను,కొట్టెను,మోఁదెను,మడిపెను—ఇవి ప్రహరించెను (అడిచెను; బాఁదెను; తాడించెను; తాడనము చేసెను; వ్రేసెను-అనుటకు) పేర్లు.

తేలించెను, బెల్లించెను, ఊటించెను—ఇవి ఎక్కించెను (ఉబ్బించెను; ఉబ్బవేసెను; ఇచ్చకము లాడెను; ముఖస్తుతి చేసెను; ముఖప్రీతివాక్యము లాడెను-అనుటకు) పేర్లు.

ఎంచెను, లెక్కించెను, ఎన్నెను—ఇవి గణించెను (గణుతి చేసెను; లెక్కపెట్టెను; గణనచేసెను-అనుటకు) పేర్లు.

కడఁగెను, కిట్టెను, డాసెను, కదిసెను, కవిసెను, చేరెను, దగ్గఱెను—ఇవి తారసించెను (సమీపించెను; దగ్గఱెను; దగ్గఱించెను-అనుటకు) పేర్లు.

అవుడు గఱచెను—ఇది కోపాన పెదవిని విఱిచెను (లోపలికి పెదవి మడఁచెను; (వంచెను) బొడు గఱచెను; కోపముచే ఓష్ఠము కొఱకెను-అనుటకు) పేరు.

గదిమెను.—ఇందులకు (వేంక.) పర్యాయములను ఇట్లు పేర్కొనినది-'గర్జించె ననుట కాఖ్యలు సెల్లు నుఱిమెను, గద్దించె నదలించె గదిమె ననఁగ' (మాన.57.) (సాంబ. కూడ) 'గద్దించె నదలించె గదిమెను నుఱిమె నా,గర్జించె ననుట కౌ' (మాన. 35.). ఈనిఘంటువులు ఒకటికి రెం డి ట్లను చున్నను (సూ.వి.) 'ఉఱుము, గర్జించు'- అనువానికి 'తర్జించు' అనెడి ఈఅర్థమును ఈయ లేదు.

వినుతించెన్:—(ఆం.సం.) 'వినుతి యొనరించె ననుటకుఁ । దనరున్ నామంబు లగుచు ధరపై నగ్గిం।చెను గైవారము సేసెన్।గొనియాడెను బొగడె ననఁగఁ గొండాడె ననన్' (పూన.66) అనినది ఇట్లే (వేంక. మాన 59.).

మరిపెన్: — 'చంపు' అనుఅర్థమున 'మడుపు' సుప్రసిద్ధము 'మడిపెఁ మనిపె ' అని (ఆం. భా. 3 123.). 'రడయో రభేదః'అని దాని కైన(రూపాం ) ఇది అనిపించును, (ఆం.భా.) దానికే 'ప్రహరించు' అను (అర్థాం.) ఇట ఇచ్చిన దనవచ్చును. నిఘంటువులు ఏవియు ఈఅర్థమున దీనిని గ్రహించుట లేదు. 'మడిపెన్' అనియే ఇట (ఆం.భా.పా )అని 'మడిపెన్'అను దానికే (అర్థాం.) ఇది అని అవి అభిప్రాయపడిన వేమో।

ప్రహరించెను:—'ప్రహరించె ననుటకు వలలు నాహ్వాయములు, మొత్తెఁ గొట్టెను వ్రేసె మోఁదె ననఁగ' (వేంక.మాన.61.).

గణించెన్:—'....నెంచె గణుతి యిడె నెన్నికపెట్టె న,నంగ గణనచేసె ననుట కొప్పు' (వేంక. మాన.65.).

కడఁగెన్:—దీనికి (శ.ర.) (సూ.ని.) ఈఅర్థమును ఇచ్చుట లేదు. (బ్రౌ.) ఇచ్చినది (చూ. అను.).(ఆం.శే.)'అభిముఖుఁ డగు'అనెడి అర్థమును దీనికి ఇచ్చినది ' గడఁగెఁ దొడఁగెను జెలరేఁగెఁ గాలు ద్రొక్కెఁ । గవిసెఁ గదిసె ననంగ నాఖ్య లయి యొప్పు । నభిముఖుం డయ్యె ననుటకు' (17.) అని. ఇది (అర్థాం.) అనఁ దగినది. 'సకర్మకప్రకరణ' మిది అగుటనుబట్టి ఈ (ఆం.భా.)కు ఇది అర్థ మన రాదు.

తారసించెన్:—'తారసిల్లుట, సమీపించుట (దీపిక) 'పూర్వపశ్చిమసముద్రములువలె తారసిల్లినన్' అని (బ్రౌ.).

అవుడు గఱచెన్.—'ఔడు' శబ్దమునకు'పెదవిక్రిందిచోటు'అర్థ మను చున్నది (శ ర.).(సూ.ని.) 'పెదవి'అర్థ మని 'పెదవిని కఱచుట' 'ఔడు గఱచుట'కు అర్థ మను చున్నది. 'అలిగి యౌడు గఱచి యాఁకటిపెలుచన । నిలువ లేక' (భార.ఆది 6.291.). ఇట (సం భార.) స్పష్టము గా 'త్రిశిఖాం భ్రుకుటిం కృత్వా సందశ్య రదనచ్ఛదమ్' (ఆది. 177, 31 ) అను చున్నది (చూ. సూ.ని.ఔడు.), ('అవుడు' (రూపాం.) ఔడు.) (ఆం.భా.కర్త) 'కోపాన పెదవిని విఱుచుట' దీనికి అర్థ మనినాఁడు. పండ్లతో గట్టిగా స్పృశించి లోపలికి పెదవిని (పెదవివెనుకప్రదేశ

ము ను)వంచుటయే ఈ విఱుచుట. అదియే (పెదవిని) కఱచుట. రెండును ఇంచుమించు గా సమానార్థములే అనవచ్చును. 'అవుడు-పెదవిని. కఱచి-విఱిచి' అని ఇది(స.క్రి.). గా వ్యాఖ్యాతము(అం.భా.)చే.

[ఊటించెన్‌—(సూ.ని.) 'ఊటించు' గ్రహించి ఈఅర్థమును ఇచ్చి ఈ (అం.భా. ను) ప్రమాణముఁ గా ఒసఁగినది. (బ్రౌ.) గూడ ఇట్లే అన్నది (చూ.అను.). 'బెల్లించు' కడ మాత్రము (సూ.ని.) 'బెల్లించె నూఱించె ననఁగ'అని (అం.భా.పా.) గా ఇచ్చినది. ఇది ప్రమాద మనిపించును.

[కవిసెన్‌—'చవిసె'అని (వావి.అపముద్రి.)].

గీ. అరసె, నాఁగ విచారించె ననుట కొప్పుఁ;
బూసెఁ, బట్టించెఁ, జమిరె, నాఁ బొలుచు నలమె
ననుట; కెదిరించె ననుటకు నఱిమె, ననఁగఁ
బొలుచు చుండును; శ్రీమాతృభూతలింగ ! 125

అరసెను—ఇది విచారించెను (ఆలోచించెను; పరిశీలించెను; పరికించెను; ఉచితానుచితముల విమర్శించెను-అనుటకు) పేరు.

పూసెను, పట్టించెను, చమిరెను—ఇవి అలమెను (అలఁదెను; విలేపించెను; గంధాదులను శరీరమునకు తాచెను (లేపనము చేసెను) అనుటకు) పేర్లు.

అఱిమెను—ఇది ఎదిరించెను (మార్కొనెను; ఎదుర్కొనెను (ఎదురు గా నిలిచి యుద్ధమునకు సిద్ధపడెను) అనుటకు) పేరు.

అరసెన్:—'....నరసె నాఁ బే రగు నార్తి వారించె వి,మర్శించె ననుటకు' (అం.సం.నానా. 23.).

[జమిరెన్:—'జమలె' (వావి.అపముద్రి.).].

[అఱిమెన్ :—'అఱమె' (వావి.అపముద్రి.).].

గీ. ఎలిచెఁ, దలఁచె. ననం జను నెంచె ననుట;
చీరె, నన ను_త్తరించె, నాఁ జించె, ననఁగ;
ఛేదనముఁ జేసె ననుటకుఁ జెలఁగు చుండు
భూతిలసితాంగ ! శ్రీమాతృభూతలింగ ! 126

ఎలిచెను, తలఁచెను—ఇవి ఎంచెను (భావించెను; తలపోసెను; అనుకొనెను-అనుటకు) పేర్లు.

చీరెను, ఉ_త్తరించెను, చించెను—ఇవి ఛేదనము చేసెను (ఛేదించెను; ఖండించెను; త్రుంచెను; (ఉ_త్తరీయాదులను) త్రెంచెను-అనుటకు) పేర్లు.

ఎలిచెన్:—(సూ.ని.) (శ.ర.) దీనిని గ్రహింప లేదు. (బ్రౌ.) దీనిని గ్రహించి, ఎలుచుట-తలఁచుట, ఎంచుట(ఆం.భా.)-అనినది. 'ఎంచు'నకు- 'ఎనుచు' అనురూపమునుగూడ (బ్రౌ.) ప్రదర్శించినది (చూ.అను.) (ఆం.భా.పా.) 'ఎలిచె' అనునదియే అని స్పష్టము గా వచించుచున్నది (బ్రౌ.).

చీరెన్:—'చీఱె' అని (వావి.పా.). (శ.ర.) ఇ ట్లను చున్నది-'అలఘురేఫము గా ఒకానొకఁడు వ్రాసి యున్నాఁడుగాని, దానికి ప్రయోగము దొరకినది కాదు' (అని.). (సూ ని.) లఘురేఫముతోనే దీనిని ఉదాహరించినది (చూ.చీరు-3వ అర్థము.)

ఉ_త్తరించెన్:—'దోవతులచాఁపు ఉ_త్తరింపుము'అని(వ్యవ.) 'త్రుంచు'ను ఈఅర్థమునందు సోమన ప్రయోగించు చున్నాఁడు. 'అలవరించి చతుర్విధాహారములఁ । దుష్టిచేసి దుకూలముల్ ద్రుంచి త్రుంచి । కట్ట నిచ్చిన' (ఉ.హరి.4 115.) (చూ.సూ.ని.త్రుంచు.) (నం.) 'ఉ_త్తరించు'అను దానికే తెలుఁగున విశేషార్థసంపాదనము కలిగి 'తెనుఁ' గిది ఐన దనవచ్చును. పూర్వము ఇట్టివి ఉదాహృతములు.

ఛేదనముఁ జేసెను.—(ఆం.శే.) ఒ ట్లను చున్నది-' .నాహ్వయంబులు ఛేదించె ననుట కయ్యెఁ। జించె నన వ్రచ్చె నన వ్రక్కలించె ననఁగ' (64.).

గీ. ప్రామెఁ, దొలఁచెను, వెలచెను, దోమె, రుద్దె,
ననఁగ నిర్మల మొనరించె ననుట యొప్పు;
నెసకొలిపె, రేఁచె, నాఁగను నెసఁగు చుండ
ప్రేరణముఁ జేసె ననుమాట; యిందుజూట 127

ప్రామెను, తొలఁచెను, వెలచెను, తోమెను, రుద్దెను—ఇవి నిర్మల మొనరించెను (మురికి పోవఁజేసి(పాత్రాదులను జలాదులచే) శుభ్రపఱచెను;శుద్ధిచేసెను-అనుటకు) పేర్లు.

ఎసకొలిపెను, రేఁచెను—ఇవి ప్రేరణమును చేసెను (ప్రేరేఁచెను; పురికొలిపెను; (యుద్ధాదులకు) ప్రోత్సాహపఱచెను-అనుటకు) పేర్లు.

తొలఁచెను:—'... దొలిచెను-(వావి.పా.) సూ.ని.పా.గూడ ఇట్టిదే (చూ.రుద్దు). 'పాత్రను తొలిచెను'అని వ్యవహారము. ఐనను ఇది 'తొలఁచు'అనియే ప్రయోగములు అను చున్నవి 'నవ లావణ్యరసంబు పళ్లెరములోనం బోసి యగ్రంబునన్। భవదీయాస్య మొనర్చి యార్చి పిదపం బ్రాలేయరుఙ్మండలం। బు వినిర్మించె విరించి యచ్చిలుము వో పూఁబోడి యీచిహ్న మం। బువులం దాతఁడు చేఁ దొలంచుమిసిమిం బుట్టెన్ సరోజాతముల్' (నైష. 8.193.) మొ. (చూ.సూ.ని.). 'తొలఁచు' అనుటయే యుక్త మనిపించినది. 'తొలిచెను' అనుదానిని వేఱుగా ఉదాహరించినది (ఆం.భా.) (చూ.3.122.).

ప్రేరణముఁ జేసెను:—(ఆం. శే.) ఇ ట్లను చున్నది- ('పేరేఁచెను బురికొలిపెను।దారిచె ననఁ జోదనకుఁ దగు నాఖ్యలు'(ఆం.శే.40.).

గీ. తెలచె, నెరఁగె, నెఱంగె, జాఁగిలెను, మ్రొక్కె,
నన నమస్కారమును జేసె ననుట కొప్పు;
మీఱె, ననఁ గడచె, ననఁగ మించె ననుట
పొలిచి యుండును; శ్రీమాతృభూతలింగ ! 128

తెలచెను, ఎరఁగెను, ఎఱంగెను, చాఁగిలెను, మ్రొక్కెను—ఇవి నమస్కారమును చేసెను (నమస్కరించెను;చేమోడ్చెను; దండముపెట్టెను-అనుటకు) పేర్లు.

మీఱెను, కడచెను—ఇవి మించెను (అతిశయించెను; అతిక్రమించెను; దాఁటెను; (తనకంటె) ఇతరుని తక్కువవానిని జేసెను-అనుటకు) పేర్లు.

తెలఁచెను:—'తెలిచె'-అని (బ్రౌ.పా.) 'దేవానాంప్రియయుల మ్రొక్కి తెలుతుఁ గుకవులన్' (రాఘ.1ఆ.) ఇట (శ.ర.) ఇ ట్లను చున్నది. 'తెలచు'-దే.స.క్రి. 'తెలుచు'యొక్క (రూపాం.).

ఇట్లు అకారమధ్యము గా గ్రంథములయందు కానఁబడు చున్నది. ఆపక్షమున ఇది 'వెలచు' క్రియవంటిది గా నుండవచ్చును (చూ. తెలచు.)' (అని.).

నమస్కారమును జేసెను:—'....గే ల్మొగిచెఁ గొలిచె। నెఱఁగెఁ జేమోడ్చె నన నమస్కృతి యొనర్చె। ననుట కివి యాఖ్య లగు' అని (ఆం.నం.మాన.31.).

గీ. కనుపుగొట్టె,ననంగను దనరు నూఁచ
ముట్టు గాఁ గొట్టె ననుమాట; పట్టుపట్టె
ననెడమాటకుఁ దగుఁ గచ్చుకొనె, ననంగఁ;
బుంగవతురంగ ! శ్రీమాతృభూతలింగ ! 129

కనుపుగొట్టెను—ఇది ఊఁచముట్టు గా కొట్టెను (నిశ్శేషము గా-కొట్టెను; తునుకలు తునుకలు గా చేసెను; ఖండించెను-అనుటకు) పేరు.

కచ్చుకొనెను—ఇది పట్టుపట్టెను (పంతము పట్టెను;కార్యదీక్ష వహించెను-అనుటకు) పేరు.

కనుపుగొట్టెను.—'...దైత్యుల నూఁచముట్టు గాఁ గొట్టినశౌర్యధుర్యునకు. . .రామభద్రునకుఁ బైపయిఁ జేకుఱుఁగాక భద్రముల్' (జైమి. 6.55.). ఇట 'ఊచముట్టు గా కొట్టిన' అనుట 'కనుపుగొట్టిన' అనుటయే ! (కనుపుగొట్టిన)-ఒక్కనినేని మిగుల నీయక రాక్షసు లందఱను ముక్కలు ముక్కలు చేసిన (రూపుమాపిన) రామభద్రునకు'అని అర్థ మనిపించును. 'కొట్టు' నకు 'ఛేదించు'అనెడి అర్థము గూడ ఉన్నది. 'కొట్టు' (స.క్రి.) ప్రహారే చేదనే చ: ప్రహరించుట, ఛేదించుట (తల కొట్టె-చెట్టు కొట్టె)-అని (చిన్న.ధాతు ). 'కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల డొక్కయని యేరుపాటు లేక వండం దఱిగినయెడలును' (భార. భీష్మ.3.248.). బ్రౌ. కనుపుగొట్టుట, చిందరవందర చేసుట, యవాయుదలు చేసుట, తునుక తునకలు చేసుట-అనుఅర్థములను 'కనుపుగొట్టు'నకు ఇచ్చినది. 'భంగపఱచు' అనికూడ అర్థమనినది దీనికి (శ.ర.).

[పట్టు పట్టెన్:—'పట్టుకు పడె ననెడి....' అని (వావి.అపపా.). 'కచ్చుకొనుట-అనగా పట్టుకో బడుట' అని. (బ్రౌ.). (సూ.ని.) 'కచ్చుకొను' అనుదానిని (అ.క్రి.) గా వచించు చున్నది.

ప్రయోగము ఒకటి ఇట్లున్నది 'ఉచ్చైశ్శ్రవ మగుతనపై। విచ్చలవిడి నెక్కురౌతు వృద్ధశ్రవుఁడై। హెచ్చె నని వేల్పుతేజిం। గచ్చుకొని హసించు వీటఁ గల్గుహయంబుల్' (చమ 1.30.) (చూ.సూ.ని.). 'వేల్పుతేజిని - దేవతాశ్వమునుగూర్చి. కచ్చుకొని-పట్టుపట్టి; పంతముపట్టి-(హయంబులు హసించును)' అని అన్వయము. (శ.ర.) 'తెలుచు' కడ ఇట్లని నది 'దేవానాంప్రియుల మ్రొక్కి తెలుతుఁ గుకవులన్' (కుకవులన్ - కుకవులనుగూర్చి. 'కుకవులకు' అనియు ప్రయోగము (రాఘ.1ఆ.) (అని). ఇట్టిదే ఇది. ఇట - అనన్తరక్రియ 'కచ్చుకొను. తదనన్తరక్రియ 'హసించు'. (సూ.ని.) 'వేల్పుతేజిని' అనుదానికి (వ్యవహిత క్రియ యగు) 'హసించున్' అనుదానితోనే అన్వయ మనుకొనికాఁబోలు ! 'కచ్చుకొను' అనుదానిని (అ.క్రి.) గా పరిగణించుటయేకాక, ఈ (ఆం. భా.)ను ప్రమాణముఁ గాఁ గూడ ఇచ్చు చున్నది. (ఆం.భా.) ఒనర్చిన అకర్మకసకర్మక క్రియావిభాగమును (సూ.ని.) సరిగా గుఱుతించుకొననందున కలిగినప్రమాద మిది అనిపించును.].

గీ. పెట్టెఁ, గీలించె, నాఁగను వెలయు చుండు
నుంచె ననుపల్కునకు; నేదె, నుజ్జగించె,
ననఁగ విడిచె ననెడిమాట కతిశయిల్లు;
భూరిభవభంగ ! శ్రీమాతృభూతలింగ ! 130

పెట్టెను, కీలించెను—ఇవి ఉంచెను (ఉనిచెను; ఉండఁజేసెను-అనుటకు) పేళ్లు.
ఏదెను, ఉజ్జగించెను—ఇవి విడిచెను (వదలెను; పీడెను; త్యజించెను; విసర్జించెను-అనుటకు) పేర్లు.

కీలించెన్:—(సూ.ని.)(సం.స.క్రి.) అని తత్సమధాతువు గా దీనిని ఇచ్చి ఇట్లు వ్రాయు చున్నది- '(ఇది 'కీల' అని సంస్కృతధాతువునుబట్టి తత్సమము గా గ్రహింపఁబడెను, కాని (ఆం.భా. యయాతి) గ్రంథములలో నుండుటఁబట్టి తెలుఁగు గా కూడ కనఁబడు చున్నది)' (అని.).

ఏదెన్:—(సూ.ని.) 'ఏదు'కు ఈఅర్థమును ఈయ లేదు. 'ఉడుగు'అర్థమిచ్చి (అ.క్రి.) అనినది. (2.) అర్థము గా, 'లేని దగు: పోయిన దగు'- అని వచించి-'శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే। దంగంబుల్ మెఱుఁగేద వించుకయు మాహారాష్ట్రసామంతు

సా। రంగుం దోలి తురంగముం గొనినసంగ్రామంబునం దృ ప్తస। ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపం పై చన్న సైన్యంబునన్' (నిర్వ.1.43.) అనుప్రయోగము నొకదానిని ఉదాహరించినది. ఇది (అం.భా.) చెప్పినఅర్థము చెప్పినను సరిపడునదియే ; 'అంగంబుల్ మెఱుఁగు ఏదవు' అవయవములు కాంతిని విడిచినవి కావు=(అనఁగా) కాంతిహీనములు కాలేదు - అని అనుటయే ; ఇఁక రెండవప్రయోగ మొకటి ఇ ట్లున్నది- 'ముట్టఁబడి దీర్ఘసూత్రుం। డి ట్టట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ। బట్టువడెఁ దనదుదెండము। పట్టు వదలి చకితవికలభావేంద్రియుఁ డై' (భార.శాంతి.198.)-'దీర్ఘ సూత్ర స్తు మందాత్మా । హీనబుద్ధి రచేతనః. మరణం ప్రాప్తవాన్ మూఢో । య థై వోపహతేన్ద్రియః' (సం. భార శా.137. అధ్యా. 17శ్లో.). మూలంబునందలి 'హీనబుద్ధిః' అనుదానికే 'ఉపాయ మేది'అని అనువాదము 'హీన బుద్ధిః=విడువఁబడిన-(బుద్ధి) నిశ్చయాత్మకాన్తఃకరణవృత్తి-కార్యసాధక మగు ఒకనిర్ణయమునకు రాఁ గలయాలోచన (అదియే ఉపాయము) (అది) కలిగినవాఁ డై' అని అర్థము. ఇఁక అనువాదమునను, 'ఉపాయము ఏది=ఉపాయమును విడిచి' (అనఁగా)ఉపాయము(కార్య సాధక మగునొకనిర్ణయము) లేనివాఁ డై అనుటయే ; (అం. భా.) అర్థమునకు ఇది విరుద్ధ మేమియుఁ గాదు. ఈఅర్థమునం దిది యిట్లు (స.క్రి.)గానే సమన్వయ మగు చున్నది. ఈ రెండుప్రయోగములనే ఇట (సూ.ని.) ఇచ్చినది (సూ.సూ.ని.ఏదు).

క. ఒప్పించె, నొప్పగించెను,
నొప్పరగించె, నన మూఁడు నొకయర్థం బౌఁ;
గప్పె, నన మూసె ననుచుం
జెప్పఁబడుఁ గవులచేతఁ; జెవ్వందీశా ! 131

ఒప్పించెను, ఒప్పగించెను, ఒప్పరగించెను—ఇవి (సమానార్థకములు) (వశపఱిచెను; అధీనముచేసెను; అప్పగించెను-అనుటకు) పేర్లు.

కప్పెను— ఇది మూసెను (ఆచ్ఛాదించెను; మఱుఁగుపఱిచెను; కనఁబడ కుండఁ జేసెను-అనుటకు) పేరు.

ఒప్పరగించెను.—ఇది 'అర్పించెను' అనువానినుండి ఏర్పడిన - 'ఒప్పగించెను' అనుదానికి (యాపాం.) అనఁ దగినది-'వర్ణలోపాగమా నైకే సర్వస్మిం స్తద్భవే పదే' అని (అధ.కా.).

కప్పెను:—(సూ.ని.) దీనికి బంధించు, మూయు - అని అర్థ మిచ్చి ప్రయోగము ఇట్లిచ్చినది- 'పలుకఁ డసత్యము దూఱం । బలుకఁడు బెట్టిదము గాఁగఁ బలుకఁడు వాదం । బులుకుఁ జొరఁడు వాణి యనం । గలవాకిలి యట్టిబుధుఁడు గప్పం జాలున్' (భార.శాం.5.322.). ఇట (ఆం.భా.) 'చెప్పంబడెఁ గవులచేత' అనుటనుబట్టి 'కవిప్రయోగైకవిషయ-మిది' యనవలసి యున్నది. 'వాకిలి మూసెను' అని (వ్యవ.) ఉన్నను 'వాకిలి కప్పెను' అను (వ్యవ.) ఈ - అర్థమున లేదు.

సీ. కౌనె, మారెఁ, జదిపె, నాఁగను గొట్టె నని తోఁచుఁ;
దఱిగె, ననం జను నఱకె ననఁగఁ;
గోరాడెఁ, జిఱిమెను, గొండాడె, నాఁగను
దుమ్ము రేఁచె నటంచుఁ దోఁచు చుండుఁ;
జెనకె, నంటెను, సోఁకెఁ, జెనసె, ముట్టె, ననంగఁ
దాఁకె నటం చని తనరు చుండుఁ;
జెరిపెఁ, దాచెను, దాపెఁ, జెక్కెఁ, దూర్చె, ననంగఁ
జొనిపె నటం చని తనరు చుండు;

గీ. నెనఁగు నొడియించె, ననఁగఁ దీయించె ననుట;
చీరె, ననఁ బిల్చె ననుపల్కు చెల్లు చుండు;
రాల్చె, జాడించె, ననఁగను రహికి నెక్కు
విదిలిచె నటన్నపల్కు గా; వేదవేద్య ! 132

కౌనెను, మారెను, చదిపెను—ఇవి కొట్టెను (కొట్టి చంపెను-అనుటకు) పేర్లు

తఱిగెను—ఇది నఱకెను(ఖండించెను; ముక్కలు ముక్కలు గా కోసెను-అనుటకు) పేరు.

కోరాడెను, చిఱిమెను, కొండాడెను—ఇవి దుమ్ము రేఁచెను (దుమ్ము పైకి ఎగురు నట్లు కావించెను-అనుటకు) పేర్లు.

చెనకెను, అంటెను, సోఁకెను, చెనసెను, ముట్టెను—ఇవి తాఁకెను (తగిలెను; అంటెను; స్పృశించెను-అనుటకు) పేర్లు.

చెరివెను, తాచెను, తాపెను, చెక్కెను, తూర్చెను — ఇవి చొనిపెను (కూర్చెను; పొదిగెను; ఖచించెను; రత్నాదులను సువర్ణాదులతో సంఘటించెను-అనుటకు) పేర్లు.

ఒడియించెను—ఇవి తీయించెను (లాగించెను; వృక్షాదులను పెల్లగిల్లఁ జేయించెను; పాదు ఊడి పైకి లేచి వచ్చునట్లు చేయించెను-అనుటకు) పేరు.

చీరెను—ఇది పిల్చెను (ఆహ్వానించెను; ఆమతించెను; పిలిచెను-అనుటకు) పేరు

రాల్చెను, జాడించెను — ఇవి విదిలిచెను (దులిపెను; దుమ్ము మొదలగువానిని రాలునట్లు (క్రిందఁ బడునట్లు) చేసెను-అనుటకు) పేర్లు.

మారెన్:—ఈ (ఆం.భా.)ను ఇచ్చి దీనికి 'కొట్టు' అనియే అర్థ మనినది (సూ.ని.). ప్రయోగములను ఇట్లిచ్చినది 'విరహుల మారుమారుఘనవీరబలం బని పాంథకందర। ల్దఱుగురమా కుమారునడిదా లని రాగవియోగజాతకా। తరగుణదాత్మమన్మధపతా కని తేంట్ల నదల్చి కమ్మఁదా। మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్' (వేంక.పంచ.4.150.). ఈప్రయోగమునందు 'మారు'అనుదానికి 'కొట్టి(బాధించి,చిత్రవధ మొనర్చి)చంపు'అనుఅర్థమే ప్రకరణపుష్టి కలది గా కాన్పించు చున్నది. మఱియొకప్రయోగము ఇట్లున్నది 'మార। నిను శంకరుఁడు పలుమాఱు మార। వలసి క్రమ్మఱ బ్రతికించఁ దలఁచె నకట: యట్టియవివేకము నఁజూమీ। గట్టుఁబట్టి।చెట్టు(?)జట గట్టి భైక్షంబుఁ బట్టఁ గడఁగె'(కృష్ణ.4.90.). ఇచటఁగూడ (పలుమాఱు) 'మారన్‌వలసి' 'కొట్టి (బాధించి) చంపుట (వలసియు) (ఆవశ్యక మయియు) అని అర్థము చెప్పుట సంగత మనియే తోఁచినది. 'కొనెన్' అనునది 'మారెన్' అనుదానికి పర్యాయము గా 'ఆం.భా.' వచించు చున్నది. (ఆం.భా.) వీనికి 'కొట్టు' అని అర్థ మిచ్చినను 'ప్రహణార్థములను (3.19.)లో (ఆం.భా.)వేఱు గా వచించి ఉండుటనుబట్టి (అజహత్స్వార్థ లక్షణతో) 'కొట్టిచంపు' అర్థ మనవలసి వచ్చినది. (బ్రౌ.) 'కొనియెను, వధించెను' అను చున్నది. పదార్థకములఁ గూడ (ఆం.భా.) (3.118లో) ఇచ్చినది. అందులకే పైరీతి విది వ్యాఖ్యాత మైనది.

చిఱిమెన్:—దీనిని అలఘురేఫయుతముఁ గానే (సూ.ని.) గ్రహించి (ఆం.భా.పా.) గూడ అట్లే ఇచ్చినది. ఇఁక 'కొండాడు' కడ (సూ.ని.) లఘురేఫయుతముఁ గా(ఆం.భా.పా.)ను ఉదాహరించుట ప్రమాద మనిపించును.

చెరివెన్, చెక్కెన్:— (ఆం.శే.) వీనికి 'సంఘటించుట కాఖ్య లై జాను మీఱుఁ।జెరివెఁ దుఱి

మెను గిల్కొల్పెఁ జెక్కె నన(గ' (34.)అని 'సంఘటించుట' అర్థ మనినది. ఇది (అర్థాం.) అనఁ దగినది పీనికి.

ఒడియించెన్:—ప్రయోగము ఇ ట్లున్నది '.. యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు, నొడియించుకొని యేఁగు చున్నదాన' (పారి.4.58.). ఇట 'పరిమళోల్లాసవ్యాఖ్య' 'ఒడియించుకొని' 'అపహరించుకొని' అని అర్థము చెప్పినది. ఇది ఈసందర్భమునకు సముచితము గా కనిపించుట లేదు. (ఆం.భా.) ఏచించిన 'తీయించు' (లాగించు: వేర్లతోఁ గూడ పెకలించు) అను అర్థమే ఇచ్చటి సత్యభామాగంభీరవీరగర్వాలాపముల కెంతయో పరిపుష్టి చేకూర్చునది గా ఉన్న దనుట సహృదయవేద్యము.

[కొనెన్: —'గొనెన్' (వావి.అపముద్రి.)].

[దాచెన్.—'దాఁచెన్' (వావి.అపముద్రి.).].

[విదిలిచెన్ —విదలిచెన్' వావి.అపముద్రి.) 'దోవతిధూళి విదుల్చుచు లేచి' (హరిశ్చ.2భా.) (చూ.శ.ర.).]

సీ. నివిరెను,దడవె,నా నిమిరె నం చని యొప్పు;
నచ్చె,ననం దగు నమ్మె ననుట;
సోడుముట్టె, ననంగ శోభిల్లు నంతట
వ్యాపించె ననుట; యియ్యకొనె, నూల్కొ-
నె,ననఁగ సమ్మతించె ననుట రాజిలు;
పంచె,ననఁ దగు వండె ననుట
వంచె ననుటయును; వానించు,ననఁగను
బైనిఁ దేలించుట పరఁగు చుండుఁ;

గీ. బాఱఁజూచె,ననంగఁ దప్పకయె చూచె
ననుటకును దోఁచు; నోనాడె,ననఁగ నొవ్వ
నాఁడె ననుట చెలంగుఁ; దనర్చు పీడె,
మానె,నన విడిచె ననుట; మాతృభూత ! 133

నివిరెను, తడవెను—ఇవి నిమిరెను (చేతితో దువ్వెను; రాచెను-అనుటకు) పేర్లు.
వచ్చెను—ఇది నమ్మెను (విశ్వసించెను; ఆప్తుఁ డని తలఁచెను-అనుటకు) పేరు.

**నోడుముట్టెను**—ఇది అంతట వ్యాపించెను (బ్రహ్మరంధ్రమును (మాడుపట్టును) తాఁకెను; తల కెక్కెను; మిన్ను ముట్టెను; అతిశయించెను అనుటకు) పేరు.

**ఇయ్యకొనెను, నూల్కొనెను**—ఇవి సంమతించెను (ఈయకొనెను; అంగీకరించెను; ఒప్పుకొనెను; ఒడఁబడెను-అనుటకు) పేర్లు.

**వంచెను**—ఇది వండెను (వంటచేసెను; పచించెను), వంచెను (వంగునట్లు చేసెను; నమ్రముఁ గా ఒనర్చెను-అనుటకు) పేరు.

**వానించెను** — ఇది పైనిఁ దేలించెను (జలాదులలో మునుఁగక పైకి తేలునట్లు చేసెను-అనుటకు) పేరు.

**పాఱఁజూచెను**—ఇది తప్పకయె చూచెను (దృష్టి చెదర కుండ (తొలఁగకుండ అట్టె చూచెను-అనుటకు) పేరు.

**నోనాడెను**—ఇది నొవ్వనాడెను (నోఁబలికెను; నొచ్చు (దుఃఖపడు) నట్లు మాటాడెను-అనుటకు) పేరు.

**వీడెను, మానెను**—ఇవి విడిచెను (వదలెను; విరమించెను; చాలించెను-అనుటకు) పేర్లు.

సంమతించెను:—కొన్నిపర్యాయములను నిఘంటువులు దీనికి ఇట్లిచ్చు చున్నవి- 'మైకొనియె నియ్యకొనె నొడంబడియె నొప్పె। ననఁగ నంగీకరించుట కాఖ్య లయ్యె' (ఆం. శే. 34.), ...కెనఁగు మంచిది కా నిమ్ము, వల్లె యనఁగ సమ్మతిల్లుటకును' (వేంక టాన 67 ప.).

వంచెను:—దీనికి మొదటియర్థమును నిఘంటువులు ఇచ్చుట లేదు.

వానించున్:—బ్రౌ. వానించుట-అనఁగా పైని తేలించుట (ఆం.భా.) అనినది. (సూ ని.శ ర.లు) దీనికి ఈఅర్థమును ఈయ లేదు

తప్పకయెచూచెను.—'భయ మింత లేక తప్పనిచూపుచేఁ జూచి చూడనియట్టిమాడ్కిఁ జూచు' (కవి.రా. 2.13.) (చూ.సూ.ని.తప్పు)

నోనాడెన్:—'నోనాడ నేసె' అనుదానికి-'దుఃఖపడేలాగు పొడిచినాఁడు' అని (బ్రౌ.) (చూ. అను.) 'నోఁబలుకు'కు ప్రయోగ మిచ్చు చున్నది (బ్రౌ) 'ఖరభాండముగాక యెందు క్షీర

మొక టంచు నోఁ బలుకుచున్' (పంచ. 1.280.) (చూ. బ్రౌ. అను.) నోఁబలుకువంటిదే 'నోనాడు'.

ఆ.వె. ఓసరించె, ననఁగ నోరసేసె ననుట
వెలయు; విలిచె, ననఁగఁ ఓలిచె ననుట
యలరు; విలిచె, ననఁగ నమ్మె నం చనఁ దోఁచు;
మహితగుణసమేత ! మాతృభూత ! 134

ఓసరించెను—ఇది ఓరసేసెను (ప్రక్కకు ఒరగించెను;ఒకవంకకు తొలఁగఁ జేసెను-అనుటకు) పేరు.

విలిచెను—ఇది పిలిచెను (పిల్చెను; ఆహ్వానించెను), అమ్మెను (విక్రయించెను; వెలకు వస్తువులను ఇచ్చెను-అనుటకు) పేరు.

[ఓర సేసెన్:—'ఓరఁజేసె'అని (వావి.అపపా.) 'క్రియాః ప్రసిద్ధా బహవః శబ్దపల్లవసంజ్ఞికాః'-అనుకారికారికావ్యాఖ్యానసందర్భమున అహోబలపతి ఇట్లను చున్నాఁడు—'. . కదియఁబడి చదికిలఁబడె'ఇత్యాదీనాం నాన్తానా మపి ద్వితీయాన్తత్వేనైవ గ్రహణమ్ । ఏతాదృశాని రూపాణి ద్వితీయాసమ్బన్ధే అకర్మకత్వ ఉదాహరణమ్'(అని.). ఇది సకర్మకప్రకరణము.].

ఆ.వె. ఖోఁజె, ననఁగ వెలయు ముంటఁ జీల్చె ననుట
చెప్పె ననుట ఫలముఁజెందె ననుట
పరఁగుఁ బొరసె ననఁగ; మఱువెట్టె, ననఁ దగు
మఱుఁగువెట్టె ననుట; మాతృభూత ! 135

ఖోఁజెను—ఇది ముంటను చీల్చెను (ప్రత్తి నార ము న్నగువానిని నలుసులు లే కుండ సన్నము గా తీసి బాగుచేసెను; ప్రోఁజెను), చెప్పెను (వచించెను;పలికెను), ఫలమును చెందెను (కార్యసిద్ధి పడసెను), పొరసెను (పొందెను-అనుటకు) పేరు.

మఱువెట్టెను—ఇది మఱుఁగువెట్టెను (మఱుఁగుచేసెను; దాఁచెను; కప్పిపుచ్చెను-అనుటకు) పేరు.

ఖోఁజెను:—ముంటఁ జించుట,చెప్పుట,ఫల మందుట,పొరయుట - (ఆం.భా.) అని బ్రౌ. (చూ. అను.). దీనినిఁబట్టి 'ముంటఁ జించె'అని (బ్రౌ.పా.)అని తోఁచు చున్నది. (సూ.ని.శ.ర.లు).

దీనికి మొట్టమొదటియర్థమునే ఇచ్చినవి. 'ప్రోఁజు' (రూపాం.) 'ప్రత్తినిఁ బ్రోఁజుచున్ వడికి బ్రాహ్మణుఁ డిచ్చుపవిత్రతంతువుల్... ' (ఉ.హరివ.4.70.) (చూ.సూ.ని.).

ముంటన్.—'మూఁడు'కు 'మూండు' రూపము గలదు (చూ.శు.సం.6.841.) (ఇది ఔపవిభక్తికము.) దీనికి ఏర్పడిన (రూపాం.) 'ముండు' దానికి (ఔ.) 'ముంటన్' - అనవచ్చునేమో ; నారచు న్నగునవి మూఁడువ్రేళ్లతో పట్టి చీరుట లోకదృష్టము.

మఱుఁగుపెట్టెన్:—మఱుఁగుఁ బెట్టెను' (వావి.పా.) అప్పు డిది 'మఱుఁగుఁ జొచ్చితిని'(మొ.) వానివంటి దన వలయును.

సీ. వంచించె ననుటకుఁ బండించె, ననఁగను
గికురించె, ననఁగను గేరు చుండు;
దీకొనె, ననఁగను డీకొనె, ననఁగ నె
దుర్కొనె నంచును దోఁచు చుండుఁ;
బురపురఁ బొక్కె, నాఁ దఱచు గా వెతలను
జెందె నం చనుమాట చెలఁగు చుండు;
వార్చె, నాఁ గడిగె నుపాసించెఁ గెడసె సు
ద్దేశించె నాఁగను దేజరిల్లు;

గీ. వెలయు వెన్నాడె, నాఁగను వెంబడించె
ననుటకు; వెలార్చె, వెదచల్లె, ననఁగఁ జల్లె
ననుటకుఁ జెలంగు; వినఁడాయె ననెడిమాట
కలరుఁ బెడచెవిఁ బెట్టె నం చని; మహేశ ! 136

వండించెను, కికురించెను—ఇవి వంచించెను (మోసగించెను; బేలుపఱచెను; మోసము చేసెను-అనుటకు) పేర్లు.

దీకొనెను, డీకొనెను—ఇవి ఎదుర్కొనెను (మార్కొనెను: అభిముఖము గా అయి తాఁకెను-అనుటకు) పేర్లు.

పురపురఁ బొక్కెను—ఇది తఱచు గా వెతలను చెందెను (ఎక్కువ గా దుఃఖ పడెను; మిక్కిలి బాధపడెను-అనుటకు) పేరు.

వార్చెను—ఇది కడిగెను (ప్రక్షాళించెను; కడిగికొనెను; జలాదులచే శరీరాదులను శుభ్రపఱచెను), ఉపాసించెను (సేవించెను; భజించెను; (భక్తితో) కొలిచెను), కెడ సెను (ఎడసెను; పాసెను; ఎడమాయెను; పీడెను), ఉద్దేశించెను (భావించెను; అనుకొనెను; తలఁచెను-అనుటకు) పేరు.

వెన్నాడెను—ఇది వెంబడించెను (వెంటఁబడెను; వెంటనంటెను-అనుటకు) పేరు.

వెలార్చెను, పెదచల్లెను—ఇవి చల్లెను (పొఱఁజల్లెను; విత్తనములు లో నగు వానిని నలుదిక్కులయందు పడునట్లు వేసెను-అనుటకు) పేళ్లు.

పెడచెవినిఁ బెట్టెను—ఇది వినఁడాయెను (ఆలకించి విన కుండెను; పెడచెవులఁ బెట్టెను; ఆదరించి వినలేదు-అనుటకు) పేరు.

పండించెను:... 'అంచు నతండు పల్క దరహాసితఁ జెక్కిలిఁ గొట్టి లెస్స పం। డించితి వోయి దాసరి ...'(ఆము.6.40.).

పెదచల్లెను:—'వేఁడిమి దిక్కుల పెదచల్లుకొనుచు' (ద్వి.రామా.1412.) 'వదనంబు దెఱచిన వర దంతకాంతి । పెదచల్లినవిధాన వెన్నెలఁ గాయు' (ప్రభులింగ.లీల-4.14.) (చూ.బ్రౌ.).

గీ. మించు తిక్కించె,నన(గ నిక్కించె ననుట;
చనును పారువఁ జూచె,నాఁ జక్కఁగాను
జూచె ననుటకు; సలిపె,నాఁ దోఁచుఁ జేసె
ననెడిమాటకు; మాతృభూతాభిధాన ! 137

తిక్కించెను—ఇది నిక్కించెను (ఉబ్బించెను; ఉబికించెను; పైకి ఉబుకుట (ఎత్తుగుట) కలదానినిఁ గా చేసెను-అనుటకు) పేరు.

పారువఁ జూచెను—ఇది చక్కఁగాను చూచెను (సూటి గా కాంచెను; లక్ష్యము తప్ప కుండ సరిగా చూచెను-అనుటకు) పేరు.

సలిపెను—ఇది చేసెను (ఒనరించెను;కావించెను;ఒనర్చెను;ఆచరించెను - అనుటకు) పేరు.

పొరువఁ జూడెను:—'పొరువ'గ్రహించి (సూ.ని.)'గుఱుతు' అర్థ మని క్రిందిప్రయోగమును ఇచ్చినది 'కలికి జక్కవలు సీవలిగుబ్బలకు నుబ్బి, పఱతెంచెఁ బొరువపట్టె నేమొ!' (ఉ.రా. 6.63.).

క. పటుతాళించె, ననంగను
నటు నిటు బెళుకంగఁ జూచె ననుటకుఁ దోఁచుం;
జిటికె, ననంగను విలసిలుఁ
జిటికెలు వేసె ననుమాట; చెవ్వందీశా! 138

పటుతాళించెను—ఇది అటు నిటు బెళుకంగఁ జూచెను(భయాదులచే చలనము కలుగు నట్లు ఆదిక్కు ఈదిక్కు చూచెను-అనుటకు) పేరు.

చిటికెను—ఇది చిటికలు వేసెను(ఆవులింతలు వచ్చినప్పు డది అంగుళిస్ఫోటనములు ఆచరించెను; చిటికరించెను-అనుటకు) పేరు.

బెళుకంగన్:—(శ.ర.) 'దెళఁకు' అని గ్రహించి 'చలించు' అని అర్థ మిచ్చినది. 'బెళుకు' అనియు ఈఅర్థమునందు కలదు- 'లళుకులు గుల్కుచెక్కు-కనుఁదమ్ముల నగ్రుమరందబిందు వుల్! దొలఁక....' (దశా.4.52.) (సూ.సూ.ని.).

ఆ.వె అడిగెఁ, బలికె, వండె, నడ్డగించెను, గోసె,
ననఁగ నిట్లు కొన్ని యగు ద్వికర్మ
ధాతువులు గఁ దెలియఁ దగువాని నెల్లను;
మహితగుణసమేత! మాతృభూత! 139

అడిగెను, పలికెను,వండెను,అడ్డగించెను,కోసెను—ఇట్లు కొన్ని అగున్(ఉండును). వానిన్ ఎల్లన్ (వానిని అన్నిటిని) ద్వికర్మధాతువులు (ప్రధానకర్మము, అప్రధాన కర్మము-అనెడి) రెండువిధము లగు కర్మములు - కలధాతువులు కన్, తెలియన్ తగున్-ఎఱుఁగనగును.

అకర్మకధాతువులను సకర్మకధాతువులను వచించి, ద్వికర్మకధాతువుల నిఁక (ఆం.భా.కర్త)దిఙ్మాత్రము గా ప్రదర్శించినాఁడు. . .పైవానికి ఉదాహరణములు ఇవి. (అడిగెను) మాణవకుని(మాణవకునివలన) మార్గమును అడిగెను; అడిగి తెలిసెను-అనుట. (పలికెను)- పుత్త్రిని (పుత్త్రినికొఱకు) ధర్మమును పలికెను. (వండెను) బియ్యమును (బియ్యముతో) అన్నమును వండెను. (అడ్డగించెను) గోవును గోష్ఠమును (గోష్ఠమునందు) అడ్డగించెను; ఎక్కడకు పో నీక నిలిపెను. (కోసెను) వృక్షమును (వృక్షమునుండి) ఫలములను కోసెను (అని).

ద్వికర్మధాతువులు:—తృతీయా, చతుర్థీ, పఞ్చమీ, సప్తమీవిభక్తులకు అర్థములు వరుసగా, కరణ హేతువులు, తాదర్థ్యము, అపాదానము, అధికరణము - అనునవి (... కారణముగా). వానిని వక్త వివక్షింపనప్పుడు ('అకథితం చ' (1.4.51.) అనుపాణినిసూత్రమున) ఏర్పడినకర్మము అప్రధానకర్మము. అట్టిదానితోఁ గూడిన సకర్మకధాతువులు ద్వికర్మకధాతువులు. నన్నయ 'సర్వవిభక్తి సంస్కృతతుల్యా'అని సూత్రించినాఁడు. అహోబలపతి ఈసూత్రమునకు ఉదాహరణములు 'ద్వికర్మకధాతువులు గూడ'అని వ్యాఖ్యానించుచు 'గోవులఁ బాలు పితికెన్-ఇత్యాదౌ ద్వితీయా'అనినాఁడు. ద్వికర్మధాతువులు సంస్కృతమున ఇట్లు పరిగణితము లైనవి. 'దుహ్ యాచ్ పచ్ దణ్డ్ రుధి ప్రచ్ఛి చి బ్రూ శాసు జి మథ్ ముషామ్। కర్మయు క్స్యా దకథితం తథా స్యా న్నీ హృ కృ ష్వహామ్'(అని.). వరుస గా వీనికి ఉదాహరణములు ఇవి- "గాం దోగ్ధి పయః" (ఆవును పాలును పితుకు చున్నాఁడు (ఆవునుండిఅనుట )."బలిం యాచతే వసుధామ్" (బలిని వసుధను (భూమిని) యాచించు చున్నాఁడు-(వసుధకై అనుట.). "తండులా నోదనం పచతి" (బియ్యమును అన్నమును వండు చున్నాఁడు. (బియ్యముచే-అనుట.). "గర్గాన్ శతం దణ్డయతి' (గర్గులను నూఱురూపాయలను (అపరాధద్రవ్యము గా) పుచ్చుకొను చున్నాఁడు(గర్గులనుండి - అనుట.). "వ్రజ మవరుణద్ధి గామ్" (వ్రజమును (పసులకొట్టమును) గోవును నిలుపు చున్నాఁడు(వ్రజమునందు-అనుట.) "మాణవకం పన్థానం పృచ్ఛతి" (మాణవకుని (బాలుని) మార్గమును అడుగుచున్నాఁడు (మాణవకునివలన-అనుట.) (అడుగుటకు అడిగి తెలిసికొనుట అర్థము). 'వృక్ష మవచినోతి ఫలాని' (చెట్టును ఫలములను కోయు చున్నాఁడు (చెట్టునుండి - అనుట.). 'మాణవకం ధర్మం బ్రూతే' (మాణవకుని ధర్మమును చెప్పు చున్నాఁడు (మాణవకునికొఱకు-అనుట.). 'మాణవకం ధర్మం శాస్తి'

(మాణవకుని ధర్మమును శాసించు చున్నాఁడు (మాణవకునికొఱకు-అనుట.) 'శతం జయతి దేవదత్తమ్' (నూఱిటిని దేవదత్తుని వశపఱచుకొను చున్నాఁడు. (నూఱిటిచే-అనుట)."సుధాం క్షీరనిధిం మథ్నాతి" (సుధను క్షీరనిధిని (పాలసముద్రమును) త్రచ్చు చున్నాఁడు (సుధకై-అనుట.). 'శతం ముష్ణాతి దేవదత్తమ్" (నూఱిటిని-నూఱురూప్యములను దేవదత్తుని దోఁచు కొను చున్నాఁడు.(దేవదత్తునినుండి-అనుట.). 'గ్రామ మజాం నయతి' (మేఁకను గ్రామమును అపహరించు చున్నాఁడు (గ్రామమునందు-అనుట). "గ్రామ మజాం కర్షతి" గ్రామమును మేఁకను లాఁగు చున్నాఁడు (గ్రామమునందు - అనుట). ఈదుహ్యాదులు అర్థపరములు, స్వరూపపరములు కావు. కావున, 'బలిం భిక్షతే వసుధామ్'-అనునట్లు, బలిని వసుధను వేఁడు చున్నాఁడు-అనురీతివియు ద్వికర్మకములే ; సంస్కృతవ్యాకరణము పరిగణించిన దుహ్యాదులు, వానిపర్యాయములే తెలుఁగునను యథాప్రయోగము గ ద్వికర్మకధాతువు లని తెలియవలయును' వీనిలోనివానినే (ఆం.శా.) కొన్నిటిని ఉపలక్షణవిధితో ఉదాహరించినది. (ఆం.కౌ.) కర్మ ఏడువిధము లనుచు క్రిందిరీతిని వివరించినవి- ' ..గర్తకుఁ గ్రియచేతఁ గడు నిష్టముగఁ బొందఁ దగినది కర్మాఖ్యఁ దనరునదియె।ఈప్సితకర్మ మనీప్సితకర్మంబు నలయీప్సితానీప్సి తాఖ్యకర్మ । మకథితకర్మంబు నక్కర్తృకర్మం బభిహితకర్మం బనభిహితకర్మ ; మనుచుఁ గర్మంబు సప్తాహ్వయంబులచేతఁ దగుఁ దెల్పెదను వరుసగ వినుండు । జనపతి యన్నంబు సాపడియెడు నన నీప్సితకర్మాఖ్య నెసఁగు చుండు । మును మూర్ఖుఁడు విషంబు దినియె ననఁగ నివి యయ్యనీప్సితకర్మ యగుచుఁ దనరు । దొరకొని గాలుండు ముప్ప గప్పినపాయ సాన్నంబు మెసవిడి ననఁగ నివియె । యూహింప నీప్సితానీప్సితకర్మాభిధానంబుచేతను దనరు మిగుల । నాదేవదత్తుఁడు యజ్ఞదత్తు నెలగొంగడి నడిగెడి నని వడి గ రెండు । కర్మంబు లు నుప నకథితకర్మం బగు చుండును గృతులందు నూహ సేయ । మూర్ఖశిష్యుఁడు గ్రామ మునుగూర్చి పోయెడిని గురుండు తచ్ఛిష్యుని మదినిఁ దలఁ । పుచు గ్రామమునుగూర్చి పోఁ జేయు చున్నాఁ డనిన శిష్యుఁ డలకర్మతను గనియెను । గనుక నిట్టిది కర్మకర్తనామంబుచేతను దనరారు చుండును గణింప । శ్రీయజ్ఞదత్తుచేఁ జాఁప వడి నల్లఁబడు చున్న దనఁ జాఁప ప్రథమ యైన । కతన నిదియె యభిహితకర్మనామధేయంబుచేఁ బొల్పు గ నలరు చుండు । యజ్ఞదత్తుఁడు చాఁప నల్లు చున్నాఁ డనుకరణి యనభిహితకర్మ మయ్యె' (అ: )

ప్రోవఁబడెను — ఇది ప్రోచుధాతువునకు కర్మార్థకరూపము. (కర్మమును చెప్పుచు వచ్చినలకారము గలరూపము-అనుట.).

ప్రోపించెను — ఇది ణిజర్థకరూపము (ణిజర్థము - ప్రేరణ. దానినిఁ దెలుపుచు వచ్చిన 'ఇంచుకు్క' తోడిరూపము ఇది అనుట.).

ప్రోచు టాయెను — ఇది భావార్థకరూపము (ధాత్వర్థమాత్రమును వచించునట్టిరూపమిది యనుట.) [ఇట్లే-పొదువఁబడెను, పొదివించెన్, పొదువు టాయెను-మొ.].

ఇఁక ఇట దిఙ్మాత్రము గా కర్మార్థక్రియాదులను వచించు చున్నాఁడు అం భా. కర్త.

కర్మార్థము:—తెనుఁగున కర్మార్థక్రియకు 'పడు' (జి) చేరును. 'పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు' అని (బాలవ్యా. క్రియా. 49.). ఇట్టి క్రియ ప్రయోగింపఁబడునప్పుడు 'కర్మకు' ప్రథమావిభక్తి, కర్తకు తృతీయావిభక్తి కలుగును.

ణిజర్థరీతి:—సంస్కృతవ్యాకరణమున 'హేతుమతి చ' అని ప్రేరణార్థమున 'ణిచ్' ప్రత్యయము విహితము. అణిజర్థప్రేరణమునందు సాధారణము గా తెలుఁగున 'ఇంచుకు్క'విహిత మైనది. 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' (బాలవ్యా. క్రియా. 70.). చుగాగమాదులు ఇందు విశేషవిహితములు. ఇవి అన్నియు 'ణిజర్థకము' లనఁబడు చున్నవి. ఇట్టిది ణిజర్థరీతి.

భావార్థము:—సంస్కృతమున భావార్థధాతుకప్రయోగములు చాలఁ గలవు. తెలుఁగున అట్టివి విరలములు. (సం.) 'రామేణ అభూయత క్షితౌ' (మొ.). అట్టిదే తెనుఁగున (ప్రభువుచే) 'ప్రోచు టాయె' (మొ.). సంస్కృతమున 'అకర్మకధాతువులకే ఈభావార్థకప్రయోగము. అట్టినియమము ఇట ఉన్నట్లు తోఁపదు. బహువచనము వేఱు గా వీనికి ఉండదు.

ప్రోచు టాయెను:—ఆంధ్రకౌముది '...భావకర్మార్థముల్ దెలిపెడ నగుట యనఁగ। బ్రభువుచేత నొసంగఁబడుట యనఁగ నిట్టి, నుడులు లక్ష్యము లై యలరు' అనినది. ఇట్లే 'కుడుచు టాయెను' (మొ.).

గీ. భావమునఁ బ్రోవు, ప్రోచుట, ప్రోవడ; మనఁ
బరఁగుఁ; గర్మార్థమునఁ బ్రోవఁబడినది, యన
వఱలుఁ; గర్త్రర్థమునఁ బ్రోచువాఁ, డనంగ
మను సుబన్తంబు లీ జాడ; మాతృభూత! 142

ప్రోవు, ప్రోచుట, ప్రోవడము—ఇవి భావమున పరఁగును (ఇట్టివి ధాత్వర్థ మాత్రమును బోధించు కృదన్తసుబన్తములు-అనుట.).

ప్రోవఁబడినది—ఇది కర్మార్థమున వఱలును(ఇట్టివి కర్మార్థమును వచించుక్రియాజన్యవిశేషణము లగుసుబన్తము లనుట.).

ప్రోచువాఁడు—ఇది కర్త్రర్థమున వఱలును (ఇట్టివి కర్తను చెప్పెడిక్రియాజన్య విశేషణము లైనసుబన్తము లనుట.).

ఈక్రియావర్గము క్రియకు సంబంధించిన దగుటనుబట్టి కృదన్తములస్వరూపమును క్రియాజన్యవిశేషణముల స్వరూపమును ఒకింత గా ముచ్చటించుచు వర్గమును ముగించు చున్నది (ఆం.భా.).

ప్రోవు'—'ప్రోచు'నకు 'వు' వర్ణకము (కృత్తు)-'వువర్ణకంబు మన్వాదుల కగు' 'కాచు-కావు'అని (బాలవ్యా.కృ.17.).

ప్రోచుట:—'ప్రోచు'నకు 'ట' వర్ణకము (కృత్తు) 'ట వర్ణకంబు భావంబునం దగు' (బాలవ్యా. క్రియా.35.).

ప్రోవడము:—'ప్రోచు'నకు 'అడ' ప్రత్యయము (కృత్తు.). తత్సంనియోగమున 'పున రాగమః క్రియాణామ్' (ఆం.చి.క్రియా.41.) సూ.చే చకారమునకు 'వ' కారాదేశము. ఇచ్చట- 'ప్రతి క్రియ మడాన్తత్వం ప్రతీతం న తు గీయతే'అని అథర్వణుఁడు. అహోబలపతి ఇట, అందడము, పొందడము, విడువడము, నిలువడము, విఱుగడము-ఇత్యాదయః అడాన్తాః శబ్దాః ప్రతీయన్తే సర్వత్ర. తథా ఽపి తత్ర గానం న సంభవతి. తేషాం గ్రామ్యత్వా న్న ప్రయోగార్హా తే త్యర్థః' అను చున్నాఁడు (చూ.'బతిమాలడము'.).

ప్రోవఁబడినది:—(ప్రోవఁబడిన+అది) 'ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' (బాలవ్యా.సమా.9.).

ప్రోచువాఁడు:—'తృవర్ణకార్థంబునం 'దెడి యెడు' వన్నియ లగు' (బాలవ్యా.క్రియా.44.)'వాని కి లోపంబు బహులంబు గా నగు' (బాలవ్యా.క్రియా.45.).

గీ. శ్రీలు వెలయంగ నీపేరఁ జేముకతనఁ
బరఁగు శాశ్వతము గఁ 'క్రియావర్గ' మిట్లు;
గైకొనుము దీని భక్తసంఘాభిమాని !
మాతృభూత ! జగత్త్రయీమాతృభూత ! 143

[ వ్యాఖ్యకై చూ. స్వర్గ. 68. ]

ఇది

క్రియావర్గము

---

తే. అశ్రుతగ్రామ్యవిస్మృతవ్యర్థసులభ
శంకితాలస్యనిర్ముక్తశబ్దవితతిఁ
దక్క రచియించునీకృతి దయను గొనుము
మాతృభూత ! జగత్త్రయీమాతృభూత ! 144

ఈకవి శబ్దదోషములఁ గొన్నిటినిఁ బేర్కొని,అవి యిందు లేనందున నిర్దుష్ట మై వెలసినయీకృతిని దయతోఁ బరిగ్రహింపవలసిన దని కృతిపతి యగు మాతృభూతేశ్వరస్వామిని వేఁడుకొను చున్నాఁడు.

అర్థ:—'జగత్త్రయీమాతృభూత, మాతృభూత !' (సంబోధనములు). అశ్రుత, గ్రామ్య, విస్మృత, వ్యర్థ, సులభశంకిత, ఆలస్య- నిర్ముక్తశబ్దవితతిన్ - (అశ్రుతములు)-ప్రయోగములందు వినఁబడనివి; అప్రయుక్తములు; అనుశాసనాదు లున్నను గవిప్రయోగప్రచురములు గానివి. (గ్రామ్యములు) - (జనవ్యవహారమాత్రప్రసిద్ధము లైనవి). (విస్మృతములు)-అన్యార్థములు; ఏమఱుపులు; ఏమఱుపాటువలనఁ గలిగినవి; రూఢ్యర్థమును గమనింపక యౌగికార్థమునఁ గవులచేఁ బ్రయుక్తము లైనవి (రూఢ్యర్థమును విస్మరించినవి) (లేదా) ఘటాదిశబ్దములు ప్రమాదమున 'పటాదిపరములు' గాఁ బ్రయోగింపఁబడినవి (చూ.వామనుఁడు. కావ్యాలం.). (వ్యర్థ

ములు) - నిరర్థకములు; ప్రకృతోపయోగులు గాక (పద్య) పాదపూరణమునకే (పద్యమునందలి ఛందస్సును సరిపుచ్చుటకే) కేవల ముపయోగపడునవి. (సులభ శంకితములు)- సందిగ్ధములు; సందియములు గలవి; విన్నమాత్రనే అదియా ఇదియా యని సందేహము గలిగించునవి. (అలస్యములు) ప్రాలుమాలికలు; శ్లేషాదిసంఘటనకై కక్కుఱితి పడినవి. (నిరుక్తములు)-వదలఁబడినవి; వదలఁబడిన ప్రసిద్ధార్థము గలవి; గూఢార్థములు; మఱుఁగులు; ఒకశబ్దము ప్రసిద్ధార్థము అప్రసిద్ధార్థము గలిగి యుండ, నప్రసిద్ధార్థమందుఁ బ్రయోగింపఁబడినపదములు. (ఇట్టివి) ఐనశబ్ద వితతిన్-పదసమూహమును, తక్కన్-వదలి (మాని). రచియించునీకృతిన్-చేసిన యీ కావ్యమును (ఈపద్యనిఘంటురాజము ననుట). దయన్-కృపతో; నన్నుఁ గేవల మనుగ్రహింపవలయు ననెడికోరికతో, కొనుము-పరిగ్రహింపుము; ఈకృతికి భర్తవై స్వీయఁగా దీనినిఁ జేకొనుము ('నన్ను అస్మద్వంశ్యులను ఉద్ధరింపు' మని కృతికర్త వేఁడికోలు.).

విశే:—గణపవరపువేంకటకవి కావ్యదోషముల నిట్లు పరిగణించినాఁడు ('అతుకుఁబలుకులును బునరుక్తములును వట్టిపూఁదెలుఁ గాకుదెనుంగులుఁ గటువు లీచ। లును బ్రాలుమాలికలును సందియము లేమఱుపులు మఱుఁగులు వ్యర్థపదములు ర। వణ మీఱుపదునైదు వాక్యదోషములు దనక...' (ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము 16ప.). గ్రామ్యమునుగూర్చి వామనుఁ డి ట్లను చున్నాఁడు-'లోకమాత్రప్రయుక్తం గ్రామ్యమ్' (వ్యాఖ్య-)-'గ్రామే భవం గ్రామ్య మితి వ్యుత్పత్తిః। లోకమాత్రసిద్ధ మిత్యర్థః. అత్ర 'ఫూ'త్కృతేతిపదం గ్రామ్యమ్। తస్య కావ్యే ప్రాచుర్యేణ ప్రయోగాదర్శనాత్। 'తామ్బూలభృతగల్లో உయం తల్లం జల్పతి మానవః'-ఇత్యాదౌ యత్ తల్లగల్లాదిపదం ప్రయుజ్యతే తదపి గ్రామ్యం ద్రష్టవ్యమ్ (అని.). చ్యుతసంస్కారమును వేఱుగాఁ బేర్కొననియీకవి యీలక్షణమునే యిచ్చట ననుసరించినాఁడని తోఁచును.

ఈకవి తా నాయాకావ్యములనుండి పదములు పరిగ్రహించునప్పుడు, వాని కరము నిర్ణయించునప్పుడు, కవుల కైనప్రమప్రమాదాదులఁ ప్రోసిరా జని కడుజాగరూకత వహించినా నను

చున్నాఁడు. ఈపద్యమును దృష్టియం దుంచుకొని యీకృతిని ససాకల్యము గాఁ బరిశీలించి చూచితిమేని, యీతఁ డీచెప్పిన దంతయుఁ జాలవఱకు సత్య మనిపించును. ప్రబంధాదుల యందలివి(యిట్టి)కొన్నిపదము లిందుఁ గానరావు. అవి యీతఁడు కావలయు ననియే(గ్రామ్య దోషభూయిష్ఠములు గా భావించియే) వదలె నేమో! చెప్పలేము. 'ఆమె, యేమె'వంటి వీతఁడు గ్రహింపలేదు. ప్రయోగములందు దృష్టములుగాక వ్యవహారమాత్రప్రసిద్ధము లగువాని నీతఁడు గ్రహింప లే దనుటకు 'అగత్యము, ఆగాయిత్యము'-వంటి వెన్నో యిందుఁ గానరా కుండుట సాక్షి. అశ్లీలార్థకము లగునవియుఁ గొన్ని యిందుఁ గానరావు. అవి జుగుప్సాది కరము లగుటయే నిరాకరణకారణ మేమో! (సాంబ.) ఇట్లను చున్నది-'పాపలఁ గనుతావు పత్తి బుయ్య। మరునిల్లు దు బ్బన మదనమందిర మొప్పుఁ, బిల్లలఁ గలిగించువేరు చుల్లి। బుల్ల బెల్ల మనఁగఁ బొసఁగు శేఫముగాఁడు, గుద్ద పిఱ్ఱ యనంగ గుదము దనరు' (మాన.19.). ఈతఁ డీరహస్యాంగములపే ర్లేవియు నిట్లు (బట్టబయలు గా) వచింపలేదు. 'పిఱుఁదు' గ్రహించినాఁడుగాని 'పిఱ్ఱ'గ్రహింప లేదు. ప్రయోగములు లేక గ్రామ్యములు గా నుండుటయే యిందులకుఁ గారణ మేమో! 'ఏరుగు' గ్రహించినాఁడు. ప్రయోగ మెచ్చట నైన నున్న దేమో! అప్రయుక్తముల గ్రహింప నను చున్నాఁడు, ప్రచురప్రయోగములే యిందుల కుండవలయును. 'ఒగిన్,తగన్' గ్రహించినాఁడుగాని, అవి పాదపూరణమునకైనవి గాక, ప్రకృతోపయోగులు గా ఉపయోగపడినవానికే యభిధాయకములు గా నుండియుండును! ఇఁక నర్థనిర్ణయ మొనర్చుకొనినప్పు డాయాపదములకడ కవులకక్కఱతియుఁ గల దని యట్టివి స్పృశింప లే దను చున్నాఁడు. కా దన లేము. పై నీతఁడు పేర్కొనినదోషములకుఁ జాలవ ఱకు ఆలంకారికుల లక్షణము లి ట్లున్నవి- (అశ్రుతము) ('య దప్రయుక్తం కవిభి రప్ర యుక్తం త దుచ్యతే'. (అన్యార్థము) 'య ద్రూఢిప్రచ్యుతం నామ త దన్యార్థ ముదాహృతమ్'. (నిరర్థకము) 'పాదపూరణమాత్రం య త్త న్నిరర్థక ముచ్యతే.' (సందిగ్ధము) 'సందిగ్ధం త న్మతం య త్స్యాత్ సందిగ్ధార్థప్రతీతికృత్'. (గూఢార్థము) ప్రయుక్త మప్రసిద్ధార్థే గూఢార్థం త న్నిగద్యతే' (ప్రతా. దోష.) ఉదాహరణాదులకై (చూ.ప్రతా.). (సులభశంకితములు) శఙ్కా యేషు సంజాతా (తాని) శఙ్కితాని. సులభం యథా తథా శఙ్కితాని- (తారకాదిత్వా దితచ్), అన్యార్థములగుఱించి వామనుఁ డి ట్లను చున్నాఁడు-'రూఢిచ్యుత మన్యార్థమ్'(కావ్యా.

2అధి.12సూ.)-'రూఢి మనపేక్ష్య యౌగికార్థమాత్రోపాదానాత్ అన్యార్థం పదమ్। స్థూలత్వా త్స్వామాన్యేన 'ఘటశబ్దః పటశబ్దార్థః' ఇత్యాదిక మన్యార్థం నోక్తమ్' ఇతి (టీక)- 'ఆఙ్ పూర్వకో వహిధాతుః కరోత్యర్థే రూఢః। ... స చ రూఢి మనాదృత్య ధారణే యౌగికార్థే ప్రయుక్త ఇ త్యన్యార్థత్వమ్' (అని.). కవులకు భ్రమప్రమాదము లుండు నని కవులే యను చున్నారు (చూ. నాపాణినీయము-కావ్యవాఙ్మయము). 'ఛన్దోవ త్కవయః కుర్వన్తి న హ్యేషా ఇష్టిః' అని మహాభాష్యకర్త. 'అ హేతి భూతే ఽస్య బలన్త్ర్భమా ద్భువోలటి' అని వామనుఁడు- (చూ.కావ్యాలం 5అధి. 44సూ.).

చ. చరణనమజ్జనావనవిశారద ! శారదచంద్రరుక్తిర
స్కరణచణాయిమానముఖసారస ! సారసమంచితోక్తిని
ర్భరకవితారసైకసులభాయితరూపక ! రూపకంఁరసుం
దరలతికాసమానదయితాభరణాంగ ! రణాంగణప్రియా ! 145

కవి యీపద్యముతోను పైపద్యముతోను గృతినాయకుని సంబోధించి వర్ణించుచు ఈ'తృతీయ'కాండముతో నైనగ్రంథపరిసమాప్తినిఁ బరమేశ్వరునికి నివేదించుకొను చున్నాఁడు.

అర్థ:—చరణనమత్-జన+అవనవిశారద - (నీ)పాదములకు ప్రణతులైనవారిని రక్షించుటయందు నేర్పరి యైనవాఁడా (భక్తరక్షణమునందు దక్షుఁడా !- యనుట). శారదచంద్రరుక్ తిరస్కరణచణాయమాన ముఖసారస-శరత్కాలపువెన్నెలను ధిక్కరించుటచే ప్రసిద్ధి చెందిన దగు చున్నముఖచంద్రుఁడు గలవాఁడా ! (పరమేశ్వరుని ముఖము శారదచంద్రికయట్లు సంతోషపఱచు చున్నది తనప్రసన్నతాదిగుణములచే ననుట), సారసమంచిత+ఉక్తి నిర్భర కవితారస+ఏక సులభాయిత రూపక - (శ్రేష్ఠము లై (రసవంతము లై)ఒప్పు చున్నవాక్కులతో నిండిన కవితామృతముచే ముఖ్యముగా అశ్రమముతోఁ బొందఁ దగినయాకారము గలవాఁడా (నీరూపవర్ణనము కాళిదాసాదులవంటి మహాకవిజనములకే కాని, తదితరులకు సులభము గాఁ

బొందరాని దనుట.). రూపకంఠసుందరలతికాసమానదయితా + ఆభరణ + అంగ-
రూపవంతము; సౌందర్యవంతము (కాంతిమంతము) ఐనకంఠము, అందమైన లేఁత
తీఁగతో సమాన యగుప్రియురాలు (పరమేశ్వరి) అలంకారము గాఁ గల శరీరము
గలవాఁడా ! (పరమేశ్వరునిశరీరమును, గరళభక్షణమున నల్లనై నిగనిగ లాడు
చున్న శ్రీకంఠమును; సౌందర్యమునకు శేవధి యై వామాంగమం దున్న సర్వమంగల
(పార్వతి)యును ప్రధానము గాఁ ప్రకాశింపఁ జేయు చున్న వనుట). రణ+అంగణ
ప్రియా-యుద్ధముయొక్క ముంగిలియందు(ముందుభాగమునందు) ప్రీతి కలవాఁడా!;
శత్రువుల కెదు రై యుద్ధము చేయుతలఁపు గలవాఁడా! (మహావీరుఁడా! యనుట).

విశే:—తిరస్క..చణాయమాన - 'భృశాదిక్యజ్జన్తము'నకంటె 'శానచ్' ప్రత్యయము. 'భృశా దిభ్యో భు వ్యచ్వే ర్లోప శ్చ హలః' (3.1.12.). 'భృశాదిగణ' పాఠము లే కున్నను గొన్ని శబ్దముల నేతద్గణపఠితములఁ గాఁ ప్రామాణికవ్యాఖ్యాతలు సాధించు చున్నారు 'య స్యోత్సు కాయమానా త్వం న ప్రతీపాయసే ఽ న్తికే' అని (భట్టి) (చూ.5 స.74 శ్లో.). ఇట మల్లి నాథుఁడు-'ఉభయత్రా ఽపి భృశాదిత్వాత్ క్యఙ్' అను చున్నాఁడు. జయమంగలవ్యాఖ్యయు నిట్లే యనినది. భద్రాయిత (మూర్తి) మొద లగుచోటులందుఁగూడ 'భృశాదిపాఠముననే' 'క్యఙ్ప్రత్యయ' మని గణరత్నమహోదధి. 'కర్తుః క్యఙ్ సలోప శ్చ' (3.1.11.) సూత్ర మున నిట 'క్యఙ్' ప్రత్యయ మని అప్పకవి. ఎట్లైనను నివి సాధువులే; 'వామనుఁడు కావ్యాలంకారసూత్రవృత్తియందు 'విరలాయమా' నాదిషు క్యఙ్ నిరూప్యః' (5. అధి. 29సూ.) 'విరలాయమానే మలయమారుతే' ఇత్యాదిషు క్యఙ్ నిరూప్యః। భృశాది ష్వ పాఠాత్, నా ఽపి క్యష్, లోహితాది ష్వపాఠాత్-అను చున్నాఁడు. కాశిక లోహితాదిగణ మాకృతిగణ మను చున్నది (పరిశీలనీయము.).(తిరస్కరణచణ)-'తేన వి త్త శ్చుఞ్చు ప్చణ పౌ' (5.2.26.) 'చణప్' ప్రత్యయము.

(రూపకంఠ.) రూపశబ్ద మిట 'అర్శఆద్యజంతము' (రూపము కలది). 'శ్రీకణ్ఠః' అనుచో (సుధ) 'శ్రీః శోభా కణ్ఠే ఽస్య' అని వ్యాఖ్యానించినది. కాలకూటభరణజా శ్రీః (శ్యామ)

శోభా కర్త్రే యస్య సః' అని (గురు) 'రూపం స్వభావే సౌన్దర్యే నాణకే పశుశబ్దయోః। గ్రన్థావృత్తౌ నాటకాదా వాకారశ్లోకయో రపి' అని (విశ్వ)

'లతికా'-అల్పార్థమునఁ గాని, స్వార్థమునఁగాని 'క' ప్రత్యయము. చంద్రురుక్-చంద్రకాంతి: వెన్నెల. 'స్యుః ప్రభా రు గ్రుచి స్త్విడ్భా భా శ్ఛవి ద్యుతి దీప్తయః' (అమ.).

(నమజ్జన)-'నమతి రకర్మకః, వన్దనార్థ స్తు సకర్మకః- ఇతి ప్రపఞ్చితం రసబిన్దౌ'-'నమజ్జన పరివృతే' అని (చమ్పూ రా.) 'నమస్కుర్వాణైః జనైః పరివృతే' అని (వ్యాఖ్య.). ఇట-క్రియానిఘంటు వొకటి యిట్లను చున్నది. 'భజతే భజతి శ్రయతి శ్రయతే ప్రణిపతతి సేవతే నమతి' (అని). దీనినిబట్టి, భజించెడిజనము-'భక్తజన'మని యర్థము.

రణాంగణ :—'అంగన' శబ్దము గా దీనిని నకారాంతపదములందుఁ బఠించినది విశ్వము. ఐనను 'అఙ్గణ' శబ్ద మసాధువు కాదు- 'అధ్యాస్య సౌరభేయం మౌక్తికరుచిరఙ్గణేషు విహితమతిః' అని రసికరఞ్జనాదికావ్యములు. ('.. రుచిరంగణేషు' అనియు నిట నర్థాంతరమున ఛేదము. ఈకవి కిట - 'అఙ్గణ' శబ్దమే యభిప్రేత మనుటకు ఈప్రయోగము నిర్ధారకము. (దీని సాధుత్వమునకై (చూ.సుధాటిప్పణము).

అలం:—యమకము-(శబ్దా.) 'పద మనేకార్థ మక్షరం చాఽఽవృత్తం స్థాననియమే యమకమ్. 'పాదాః పాద స్యానేకస్య చాదిమధ్యాన్త భాగాః స్థానాని' అని (వామనుఁడు) (చూ.కావ్యాలం. 4 అధి.1.2 సూ.). [ఇది సమస్తపదాంతయమక మనఁదగినది. సమస్తపదాంతాదియమకము లను వామనుఁడు వచించినాఁడు (చూ.కావ్యాలం.)]

మాలిని. సకలభువననాథా ! సంతతస్వావబోధా !
మకుటఘటితసోమా ! మంగలాధారనామా !
సుకవిహృదయ గేహా ! సుందరస్వచ్ఛదేహా !
యకలుషనిజచర్యా ! యాశ్రితామోదకార్యా ! 146

అర్థ:—సకలభువననాథా-అన్నిలోకములకు ప్రభు వైనవాఁడా ! (సర్వేశ్వరుఁడా:-యనుట). సంతతస్వ + అవబోధా-ఎడతెగనిది, ప్రకృతిసంగతి చేయని ఎల్లప్పుడు

ప్రకాశించు చున్నది ఐన, ఆత్మజ్ఞానము (సచ్చిదానందరూప మగుపరబ్రహ్మము 'నేను' అనెడి 'ఆత్మసాక్షాత్కారము') గలవాఁడా (ఆత్మారాముఁడా ! యనుట). మకుటఘటితసోమా-కిరీటము గా అమర్పఁబడిన (బాల) చంద్రుఁడు గలవాఁడా-(చంద్రశేఖరా ! - యనుట). మఙ్గల+ఆధారనామా-శుభములకు ఆశ్రయ మైన (నిజ) నామములు (శివ, శంభు, శంకర-మొద లగునవి) గలవాఁడా !. సుకవి హృదయగేహా-మహాకవులహృదయపుండరీకములు గృహములు (వాసస్థానములు) గా కలవాఁడా. (మహాకవు లందఱు జాలవఱకు శివభాగవతు లగుట యిందుమూలమునఁ దెలుపఁబడి, యీకవి కిష్టదైవము శివుఁ డని తదారాధనముననే మహాకవి గానీతఁ డైనాఁ డనుట సూచిత మగు చున్నది.). సుందర స్వచ్ఛ (సు+అచ్ఛ) దేహా !-అంద మైనది మిక్కిలి తెల్ల నైనది ఐనశరీరము గలవాఁడా !. అకలుష (న+కలుష) నిజచర్యా-పాపములేని (పాపమునకు తావు లేని పాపహేతువు కాని యనుట) స్వీయప్రవర్తనము గలవాఁడా ! (పుణ్యసంపాదకము లగుపనులే యెప్పుడును జరపువాఁడా ! యనుట). ఆశ్రిత+ఆమోదకార్యా-(నిన్ను)ఆశ్రయించినవారికి (సేవకులకు) సంతోషము కలిగించెడిపనులు(దుష్టశిక్షణాదులు)గలవాఁడా! ('మాతృభూతస్వామీ !' అని అధ్యాహార్యము (దీనికి 'వేంకనార్యప్రణీతం బైనయాంధ్రభాషార్ణవంబునందు సర్వంబును తృతీయకాండము ఇది సంపూర్ణము' అను పైవచనముతో అన్వయము.).

విశే:—(భువన) నాథా-(అపపా.) నాధా-(సాధుపా.). 'నాధృ, నాథృ' యాచ్ఞోపతాపైశ్వర్యాశీష్షు' అని ధాతుపాఠము. 'నాథా....బోధా' అని యమకము 'ఇట మాత్రము ఇది చతుర్థపర్ణసమేతమే'యనుటకు నిర్ధారకము.

ప్రత్యాశ్వాసముచివర 'మాలినీ' వృత్తము నుపయోగించి, యాయాయాశ్వాసముల ముగించుట తిక్కన సంప్రదాయము. 'యమకమునుగూడ నాతఁ డీ'మాలిని'యందుఁ జాలవఱకిట్లే యుపయోగించినాఁడు- 'మునిసముదయహృద్యా ! మూలవిద్యానవద్యా ! వినమదమృతవృష్టీ ! విశ్వలోకైకదృష్టీ ! మననసుగమమూర్తీ ! మంత్రరూపప్రకీర్తీ ! జనిమృతిభిషగాత్మా !

శశ్వదాహ్లాదవర్త్మా ॥' (ద్రోణ. 2ఆ.383మొ.). ఆసంప్రదాయమునే యీతఁడు గ్రంథాంతము నం దనుసరించినాఁడు. 'ననమయయయుతం బై నాగవిశ్రాంత మై యి । ట్లనుపమగుణ మాలి న్యాహ్వాయం బయ్యె ధాత్రిన్' అని మాలినికి లక్షణము. సంస్కృతలక్షణమును నిట్టిదే-'నన మయయయు తేయం మాలినీ భోగిలోకైః' (అని).

అలం:—పాదమధ్యయమకము (శబ్దా.).

## గ ద్య ము

ఇది శ్రీమత్పరమేశ్వరకరుణాకటాక్షసంప్రాప్త సర్వజ్ఞత్వాదికలిపయగుణ స్వసామ్య తదితరసకలగుణనిరౌప మ్యాసేతుహిమాచలఖ్యాత మహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్యవర్యతనూజాత, శౌర్యధైర్యస్థైర్యాదిసకలగుణచిరత్న రత్నరత్నాక రాశ్రితజనశ్రీకర కోటిసమాఖ్యవంశసుధాపయోధిరాకాశశాంక 'ఘం టికాతురగ నీలాతపత్ర హనుమద్ధ్వజ మకరకేతన దివాదీప నవవిధభేరి' కాదినిఖిల బిరుదాంక బృహదంబికాకటాక్షసంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాటచోళపాండ్యమహీపాలాదిసంస్తూయమాన శ్రీరాయరఘునాధమహీనాధ సభాంగణబిరుదాయమా నార్యనుతచర్య వేంకనార్యప్రణీతం బైన యాంధ్రభాషార్ణవంబునందు సర్వంబును

**తృతీయకాండము**

**సంపూర్ణము**

---

(తృతీయ)కాండము ముగించుచు స్వవృత్తాంతకథనముతోఁ గవి(తృతీయ) కాండసమాప్తితోపాటు గ్రంథపరిసమాప్తినిఁగూడఁ గృతిభర్తకు నివేదించుకొను చున్నాఁడు.

అర్థ:—సర్వంబును తృతీయకాండము ఇది సంపూర్ణము-అని అన్వయము. సర్వంబును-అంతయును (మిగు లేమియు లే కుండఁ గా). ఇది-సంపూర్ణము(సమాప్తము; ముగిసినది). ('సర్వంబును' అనుట(తృతీయ)కాండముతోపాటు గ్రంధ మంతయు ముగియుటను దెలుపు చున్నది.) (చూ. మిగిలినపై గద్య వ్యాఖ్యకై 1కాం. 197-201పు.).

ఇది

శ్రీవేంకటప్పార్యపుత్త్రి వేంకటసుబ్బమాంబాగర్భశుక్తిముక్తాఫల, 'కావ్యకలానిధి'
'మహీశూరమహారాజాస్థానమహావిద్వత్కవి' శ్రీచిదంబరకవీంద్రభాగినేయ,
శ్రీపరమేశ్వరీకృపాసముపలబ్ధశాస్త్రసాహితీవైదుష్య, మధురావిజయ
కాశీఖండాది సంస్కృతాంధ్రమహాకావ్యవ్యాఖ్యాన సత్కావ్య
రచనాసువిదితప్రజ్ఞావిశేష, 'సాహిత్యాలఙ్కార'
'సహస్రావధాని' 'విద్వత్కవివతంస'
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి
విరచితం బైన
చంద్రికావ్యాఖ్యానమున
సర్వంబును
తృతీయకాండము
సంపూర్ణము



# అ ను బం ధ ము

(తొలిపలుకు 12పు. 6పం. లో) వేంక. దేవ. 15. అనుదానికిఁ దరువాత 'అబ్బురపుఁదియ్యవిలు కానినిబ్బరంపు । దెబ్బపోరుల నలయిక ప్రబ్బుబోంట్ల । గబ్బిగుబ్బలచెమటలయు బ్బడంచు । గబ్బి నాఁ జను మారుతాఖ్యలు' (ఆం. సం. దేవ. 22.)' అని చేరవలయును.

(ఆం. భా. పీఠిక 22ప. లో) 40పు. 24పం. గా 'ఈపద్యమునకు మూల మనఁ దగినయొకశ్లోక మి ట్లున్నది-'ఉత్సృజ్యే సిన్ధుభర్తు ర్వసతి మధురిపు ర్గాఢ మాశ్లిష్య లక్ష్మీ । మధ్యాస్తే విత్త నాథో నిధినివహ ముపాదాయ కైలాసశైలమ్ । శక్రః కల్పద్రుమాదీన్ కనకశిఖరిణో ఽధి త్యకాసు న్యధాసీత్ । ధూర్తైఖ్య స్త్రాస మిత్థం దధతి దివిషదో మానవాః కే వరాకాః' (కర్పూర చరితము 6శ్లో.) [కవి వత్సరాజుకాలము-12 A.D. చివరిభాగమువాఁడు]'అని చేరవలయును.

(1.41ప. లో) 142పు. 17 పం. తరువాత 'తందర:—'తన్ద్రీ నిద్రాప్రమీలయోః' (అమ.). ఇట సుధ-'ప్రమీలా-అత్యన్తశ్రమాదినా మోహప్రాయా'అనినది'అని చేరవలయును.

(1.45ప. లో) 12పు. 10పం. తరువాత 'చౌవంచతూఁపులజోదు:—(శ. ర. సూ. ని.) 'తూఁపు' నిరనుస్వార మను చున్నవి. (సూ.ని.) ఇందులకు ప్రమాణము గా కొన్నిప్రయోగముల నిచ్చి ఇ ట్లను చున్నది 'అప్పకవి తిమ్మకవి మొద లగులాక్షణికులు దీనిని సానుస్వారముఁ గా గ్రహించినారు. కాని యది నిరాకరం బని యెఱుఁగునది- చి ని.' (అని.). కూచిమంచి తిమ్మకవి, (సూ.ని.) నిరనుస్వార మిది యనుటకు నిర్ధారకము గా ఇచ్చిన 'అపార్థుఁడు.... అ। త్తూపులగమి నేర్చిజముని । ప్రోపు గుడువఁ బుచ్చె. .' (భార ద్రో. 1.253.) ప్రయోగ మునే (తానును) ఇచ్చి, 'సానుస్వార మిది' అనినాఁడు. అర్ధబిందుప్రాసమునకు లక్షణము చెప్పి, అందులకు లక్ష్యము పై (భార.ప్ర.) అనినాఁడు (చూ. సర్వ. 2.29. మొ.). ఆనంద రంగరాట్ఛందము-'నన్నయభట్టులక్షణసారము'నుండి ఈ ప్రాసమునకు లక్షణము చూపినది- 'ఒకటి కరసున్న గలిగి మూఁటి కవి లేక । ప్రాసములు లఘుపదము లై పై నిఁ జెల్లుఁ । గృతుల నొక్కొ-కచో....' (అని). ఈలక్షణమునకు వివరణముగూడ ఇ ట్లిచ్చిన దిది-'కచటతప వర్గాక్షరములలో అరసున్న గలయక్షరములు మూఁడు, సున్న లేనియక్షర మొకటిగాని, ఉన్నట్లయితే ప్రాసము చెల్లును' (అని.). ఇందులకు (భార.ప్ర ) లే లక్ష్యములు గా ఈయఁ

బడినవి. అప్పకవి దీనినే 'ఖండాఖండప్రాస' మని వ్యవహరించి, లక్ష్యములఁ గా (భార. ప్ర.) లను ఉదాహరించినాఁడు. ఈతఁడు 'తూఁపు' సానుస్వార మని కంఠోక్తము గా వచించినాఁడుగూడ-'కంపుతూఁపులు గల వన్నెకానిఁ గాంచెఁ। గంబమునఁ బుట్టెఁ దాఁబేటి కరణి నొప్పె। నౌర హరి యనఁ బూర్ణంబు లర్థములును। బరుషసరళాములను గనుపట్టు నిట్లు' (2ఆ.32ప.) (అని). ఈ ప్రాసమునకు లక్ష్యములు గా భార.ప్ర.లు ఇచ్చి (భార. ప్ర.) ప్రామాణ్యమునుబట్టియే 'చీఁకటి, తీఁగ, వీఁపు'-మొ. 'సానుస్వారము'లని లక్షణకర్త లంద ఱును ఏకముఖము గా అంగీకరించినారు. (శ.ర.)గూడ, 'తూపు' నిరనుస్వార మనినదేకాని 'చీఁకటి, వీఁపు'-మొ. సానుస్వారము లనియే అంగీకరించినది. దీనిఁబట్టి ఈప్రాసము నిది కా దనలే దనిపించును. 'చీఁకు' కడ ' ..ఇట్లు దీనిని సబిందుకముగాఁ జెప్పుట 'చీఁకటి' శబ్దమునకు వ్యుత్పత్తిని కల్పించుటకు అనుకూలము గా నున్నది. ఇట్లు చెప్పుటచే ప్రయోగ ములకు విరోధము కనఁబడదు' అనియు (శ. ర.) అనినది. 'తూఁపు'నుగూర్చి (తాళపత్త్ర గ్రంథపరిశోధకులు) కొంద ఱి ట్లను చున్నారు-'భారతములో ఈయెడ తాటాకుపుస్తకములలో స్పష్టము గా బిందువు కనఁబడు చున్నది'- (అని). బాగుగా పరిశోధించి చూచిన 'ఖండాఖండ' ప్రాసము త్రోసిరా జనరానిది గా తోఁచు చున్నది. ఇంకను ఇది సమ్యక్పరిశీలనీయము గావ లసి యున్నది. అందులకే ఇట 'సానుస్వార' మిది అని అనినను, (చి.ని.) మొ. వానిని గా దనక నిరనుస్వార మనికూడ (మతభేదసూచకముగా) నేను వచించినాను (చూ. 2.212 తూపు.). (ఇట్లే 'చీఁకటి, తీఁగ, పరఁగు- మొ. కూడ అచ్చటచ్చట రెండువిధములు గాను గ్రహింపఁబడినవి)' అని చేరవలయును.

(1. 72ప.లో) 38 పు. 11 పం.గా. 'మెఱుపునకు నిర్ధారకప్రయోగ మి ట్లున్నది-' . .దన। రును మెఱుఁ గన మెఱుపునకు జిగికి' (వేంక.నానా.124ప.)' అని చేరవలయును.

(1.77ప, లో) 42పు.20ప.తరువాత 'జాబిలి:— జాబిల్లి (రూపాం.). 'జాను+బిల్లిక = జాను = ఆహ్లాదకరము. బిల్లిక=బింబము (శ.ర.) - 'ఆజాబిల్లివెలుంగువెల్లికల డాయన్ లేక రాకా నిశా। రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యె గ్గెత్తి యా। రాజీవానన యేడ్చె....' (వసు. 4.52.)' అని చేరవలయును.

(1.99 ప.లో) 65పు.7పం తరువాత- 'చేట్పాటు' అని (వావి.పా.). సూ ని. 'చేడ్పాటు' గా ఇట (ఆం.భా.పా.)ను ఉదాహరించినది. (ఆం.భా.) 'బాధ' అను-అర్థమున 'చేడ్పాటు' వేఱు గా ఒసఁగినది (చూ.2.211.). ఆం.సం. ఇ ట్లనినది- 'బెడఁద దెస చేటు చేడ్పా। డ్గొడ వాత్రం బంగలార్పు గోరంబు దొసం। గిడుమ వెత కష్తి యంగద। కడగం డ్లనఁ జను విపత్తు' (మాన.59.)'అని చేరవలయును.

(1.103ప.లో)69పు. 23పం చివర- 'బస' అనియే ఇట ఆం.భా.పారము. బస(వసతి,నివాసము)- అనుదానినుండి ఏర్పడినదానినిఁ గానే(సూ.ని.)దీనినిగుఱించి అభిప్రాయపడిన దనవచ్చును. 'పస' కు 'వలపు' మొ. అనేకార్థములు ప్రయోగదృష్టములు (చూ.సూ.ని.). 'వలపున' కైన సంకేతముగూడ లాక్షణికము గా 'పస' అనఁబడి, కేవలసంకేతముగూడ ఆతరువాత దీనిచేత వచింపఁబడిన దనుట ఉచిత మని నా కనిపించినది, ఇంకను విచార్యము-అని చేరవలయును.

(1.105ప. లో) 71పు. 11పం.గా 'ఆం. భా. ఈపద్యమున రసనామము లని 'చవి, చవురు' అను వానినిఁ బేర్కొనినది. (సూ. ని.) ఈశబ్దములకుఁ గలప్రసిద్ధినిఁబట్టి కాఁబోలు। 'చవురు- చౌరు(వి.) రసము, రుచి'-అనినది. (సూ. ని.)ని అనుసరించి నేనును వీని నిట్లే వ్యాఖ్యా నించితిని. నానా. మొ. నిఘంటువులు 'రసము, రుచి' వే అను మన్నవి - 'శృఙ్గారముఖ్య మధురాది సువర్ణ రేతో నిర్యాస రాగ గరల ద్రవ పారదేషు। ఆస్వాదన ధ్వని సుధా ఉమ్బు రసాఖ్యధాతు ష్విష్టో రసః'(అని). కావున (ఆం.భా.) వీనికి 'తిక్తాదిరసము'లనే అర్థముఁ గా ఎచించిన దనవలయును' అని చేరవలయును.

(1.114ప.లో) 87పు. చిట్టచివర- 'బొబ్బెట్టు' (వావి. పా.). 'పోఁబెట్టు' అనునది (శ.ర.బ్రౌ.ల) పారము. 'పోట+బెట్టు' అని (వ్యు.) (చూ. శ. ర.)' అని చేరవలయును.

(1.116ప. లో) 92పు. 14పం. చివర-'బతిమాలడము.—'ముట్టడము' మొ. ఎఱ్ఱాప్రెగ్గడ ప్రయో గించినాఁడు '....దానును గోట ముట్టడము దక్కి వెసం జనుదెంచుమాబడిన్' (హరి.ఉ.భా. 1. 24 మొ.)' అని చేరవలయును.

(1.118ప. లో) 98పు. 22పం. చివర 'కొతుకు':—ఇది (వావి. అంభా.పా.). శ.ర. ఈపారమునే ఇచ్చినది 'గ్రచ్చు కొతుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు' (ఆం. భా. ప్ర. వాగ్వ.)' (అని).

ఇ ట్లిచ్చియు 'గచ్చు' కడ 'గచ్చు కొదుకు నాఁగ గ్రస్తాఖ్య విలసిల్లు' అని (అం.భా.పా.) గా (పూర్వాపరవిరోధము గమనింపక) ఇచ్చు చున్నది (శ.ర.). బ్రౌ. కూడ ఒకచో 'కొదుకు' అనియే ఇచ్చటి (అం.భా.పా.) అను చున్నది (చూ. అను. 'గచ్చు' .). (సూ.ని.) 'కొతుకు' అనియే (అం. భా. పా.) ఇచ్చినను 'కొదుకు' నకును ఈ-అర్థము ఇచ్చి నిర్ధారకప్రయోగ మి ట్లిచ్చినది-'బ్రదికినబలిదైత్యేంద్రుం।డెదఁ దనయపజయముఁ దలఁచి యెంతయు వెతచేఁ। గొదుకుచు ని ట్లని పలికెం। ద్రిదశాహితుని న్యాయనిష్ఠురపణితిన్' (దశా.5.5.). 'కొదుగు' గ్రహించి, (అం. భా. పా.) 'కొదుగు' అనియు (బ్రౌ.) అనినది (చూ.అను.). ప్రయోగ మొకటి ఇ ట్లున్నది- 'అల్లనల్లన హరి హరి హరి యటంచుఁ।గోలయును బోలె నొదుఁగుచుఁ గొదికికొనుచు। విష్ణుపదభక్తి మూర్తిభవించె ననఁగఁ। జకితహరిణాక్షి దాసరిసాని యయ్యె' (విప్ర.3.3.). ఇచ్చటి-అనుప్రాసమునుబట్టి, ఇచ్చటిపాఠము ఒకప్పుడు 'కొదిగి' కావచ్చును ; అప్పుడు(బ్రౌ.)ఒకచో ఇచ్చిన 'కొదుగు' అను (అం. భా. పా.)కు ఇది మూల మనవచ్చును- 'కొతుకు' నకు ఐన (రూపాం.) 'కొదుకు, కొదుగు' అనునవి. ఇవి (పారాం.). 'కొతుకు' (అం.భా.పా.) గా (బ్రౌ.) ఉదాహరించుట లేదు. ఐనను పదగ్రహణ మొనర్చి 'కొతుకుట' కు ఈయర్థమును ఇచ్చు చున్నది (చూ.అను.)' అని చేరవలయును.

(1,135ప.లో) 130పు. 3పం. తరువాత-'.. .గను పనఁ గినుక. ..'అని (వావి.అపపా.). 'అని సామంతులపంతపుఁ। బెనుగాడ్పులఁ దరతరంబు పెరిఁగెడుసురే। ఈనికినుపుఁ గడలి మొరసెనొ। యనఁ దగి ప్రస్థానభేరి యంతట మ్రోసెన్' (కవిక.2.143.). 'కిన్వడు' ఇత్యాదులు ప్రయోగదృష్టములు-'జనకునిఁ గన్నఁ గిన్వడుదు సభ్యుల బంధులఁ గాంచినం గడుం। గన లుదు .. ' (హరి.పూ.9.81మొ.) (చూ.సూ.ని.).

(1.150ప.లో) 160పు. చిట్టచివర-'వెతారము' :—కామమదమువలనిబాధ (మదపిచ్చి) అనెడి-అర్థము దీనికి వ్యవహారదృష్టము. అది (అర్థాం.) అనఁ దగినది. 'వెతారముపడి తిరుగు చున్నాఁడు'అని (వ్యవ.)'అని చేరవలయును.

(1.165ప. లో) 190పు. 8పం. తరువాత-'రేకు-ఇది సంవర్తికకు (లేఁతతామరపూవుఱేకునకు) పేరు. 'దుద్దు, ముద్దె-ఇవి కర్ణికకు (పద్మబీజకోశమునకు) పేర్లు' అని చేరవలయును.

(2.9ప. లో) 219పు. 5పం. చివర-'తత్పుర స్యోపనిష్కరమ్' అని (అమ.). ఇట (గురు.) 'త త్పురస్యోపనిష్కరమ్' అని (పారాం.) అను చున్నది'అని చేరవలయును.

(2.12ప. లో) 224పు. 25పం. తరువాత- [ 'కల్లి' వావి.అపముద్రి. 'కల్ల'అనియే (ఆం.భా.పా.) (చూ.(బ్రౌ.).'] అని చేరవలయును.

(2.21ప.లో) 237పు. 10పం. తరువాత-'దారబందము:—(సం.ద్వారమ్. ప్రా.దారం. సం. ద్వారబంధః. క. దారబందవు.) '.... ఒరఁగం ద్రోచినదారబందములును......' (ఉ. హరి .1.53.) (చూ.సూ.ని.).' అని చేరవలయును.

(2.39ప. లో) 260పు. 11పం. తరువాత-'పూఁబిందె, పూప—ఇవి అత్యంతబాలశలాటువునకు (చాలలేఁతపిందెకు; పిందె యగుటకు ముందటిదానికి)పేరు. వట్టి, వరుగు—ఇవి శుష్కశలాటువునకు (ఎండినకాయకు) పేర్లు విత్తు, వి త్తనము, గింజ, గిజరు-ఇవి బీజమునకు పేర్లు' అని చేరవలయును.

(2.45.ప. లో) 269పు. 18పం. తరువాత-'లకుచమున కగు।గంగరే గ్గమ్మరేఁ గన .. ' (వేంక. స్థా. 83). ఒకపద్య మి ట్లున్నది— 'అశిరుచి కొప్పు కొప్పు శశియందు రమం దిర మోము మోము చం। చలసమమేను మేను లకుచమ్ములలీలఁ గుచమ్ము లింపు ' (ముకుంద. 1. 46పొ. 4పం.) (చూ. సూ. ని. 'ఏ' అవధారణార్థముకడ). దీనినిఁబట్టి 'గజనిమ్మ' కూడ దీనికి అర్థ మనవలయును. ((బ్రౌ.) 'లకుచము, లికుచము' అనువానికి నిమ్మపండు, కమ్మరేఁగుపండు(D)'-అని రెండర్థములను ఇచ్చినది' అని చేరవలయును.

(2.54ప.) 283పు. 9పం. తరువాత- 'తిప్పదీఁగె' అని (వావి. ముద్రి.). (సూ ని శ ర.(బ్రౌ.లు) 'తిప్పతీఁగె' అనియే అను చున్నవి' అని చేరవలయును.

(2.55ప.లో) 284పు. 7పం. తరువాత-పసపు, పసుపు-ఇవి హరిద్రకు (పసుపుమొక్కకు,పసుపుఁగొమ్మునకు) పేర్లు' అని చేరవలయును.

(2.61ప. లో) 293పు. 10పం. తరువాత- 'రేణుకలు:— దేశ్యమునందు 'రేణుకలు' అనఁగా 'నూఁగుదోస' యని ఒకానొకనిఘంటువునందు వ్రాయఁబడి యున్నది-అని (శ. ర.). ఇది

(ఆం. భా.)ను లక్ష్యీకరించి అనినమాటయే అనిపించును. 'నూఁగుదోస' కైన (రూపాం.) 'నూదోస'. ('నూదోస యన రేణుక లగు.... ') (ఆం. పద. అచర. 73.) (చూ. సూ. ని.)' అని చేరవలయును.

(2.63ప. లో) 297పు. 19పం. తరువాత-'కసివెంద' :— 'కసింద' అనియు దీనికే పేరు' అని చేరవలయును.

(2.72ప. లో) 312పు. 14పం. లో ' . . జాతిదుంప' అను చున్నది-అనుదానితరువాత-'చిరుగడము-గెనుసుగడ్డజాతిదుంప'అని (బ్రౌ.) అభిప్రాయపడిన దని వీ రనుట సరి యనిపింపదు.(బ్రౌ.) చిరగడము, చిలగడదుంప-వేఱుగా గ్రహించినది. 'చిరుగడము' వేఱుగా గ్రహించి 'మధుర కందము'అనియే దీనికి అర్థ మిచ్చినది (చూ.అను.).

(2.75.ప. లో) 319పు 22పం. చివర 'కస్వు' (రూపాం.) 'సద సట్ర నలి నట్ర సరి గస్వు గట్ర।వెదకియుఁ గానక మది విచారించి' (బస.పు. 3.532 పం.చూ.సూ.ని.)'అని చేరవలయును. దీనికి తరువాత వేఱుగా ['కుస్సె'ద బ్బన . 'అని(వావి.పా.) (సం.కుశః). పైనాగ్రహించిన పారము వ్రాఁతప్రాఁతప్రతులపారము- (చూ. సూ. ని. 'కొస్సె')'] అని ఉండవలయును

(2.85ప. లో) 336పు. 25పం. తరువాత-['కేసరి'—(బ్రౌ.శ.ర.పా.). 'కిసరి' ప్రాఁత వ్రాఁత ప్రతులపారము (చూ.సూ.ని.)] అని చేరవలయును.

(2.88ప. లో) 341పు. 25పం. తరువాత-['కొండె'అని వావి.అపపా.]' అని చేరవలయును.

(2.89ప.లో) 343 పు. 14పం. తరువాత- 'నాగ్రహించినపారము (వ్రాఁత ప్ర.పా.) (చూ. సూ. ని.)'అని చేరవలయును.

(2.95.) 354పు. 4పం.గా 'కందుఱీఁగలు:—బహువచననిర్దేశము అవివక్షితము. ఏకవచనాన్తముఁగా దీనిని(సూ.ని.) గ్రహించినది. ఇట్లే 'మిణుఁగుఱుఁబుర్వు'అను-ఏకవచననిర్దేశముగూడ'. ప్రయోగ మి ట్లున్నది- 'మిడుఁగు అని తలఁచు బాలుఁడు। మిడుఁగుఱుఁబుర్వుఁ గని....' (నృసిం. 4.159) (చూ.సూ.ని.)'అని చేరవలయును.

(2. 96 ప. లో) 355పు. 16పం. చివర '(సం. ప్రా. కేకా. క. కేకె). ప్రాకృతసమము గా ఏర్పడిన-అచ్చతెలుఁగుపద మిది. 'పెద్దకూఁత' అనునది (అర్థాం.). అది వేఱు. సుప్రసిద్ధ మగుటను దానిని వచింపక వదలినది (ఆం. భా.). (శ. ర.) 'నెమలికూఁత' -అను-అర్థమున దీనిని(సం.) అనియే అను చున్నది' అని చేరవలయును.

(2.106. ప. లో) 370 పు. 9పం. గా 'అనద:—దీనికి (3. 30)లో 'దిక్కు- లేనివాఁడు' అనెడి అర్థము వచింపఁబడు చున్నది. ఇచ్చట దీనికి ప్రకరణమునుబట్టి 'అనాథ-విధవ' అను-అర్థమే సముచితము. ఈసందర్భమున (అమ.) గూడ 'విశ్వస్తా విధవా సమే' అను చున్నది (బ్రౌ.) 'అనద' శబ్దమునకు 'దిక్కు- లేనిది, దక్షత లేనిది, మగఁడు లేనిది' అని అర్థ మిచ్చి 'నీరద హితవంశ ! నీదేవి నన్ను । ననదచందంబున నక్కటా ' యిపుడు' అనుద్విపదరామాయణ ప్రయోగమును ఉదాహరించినది' అని చేరవలయును.

(2. 108ప. లో) 373పు. 12పం. చివర- 'ఎఱుకత-దైవజ్ఞురాలు; సోదె చెప్పునది-ఇది వేఱు. 'కిరాతి' అను-అర్థమున 'ఎఱుకెత' అనియే సాధువు' అని చేరవలయును ఇచ్చటనే 'ఎఱుకెత'కు తరువాత-'బోయత' (రూపాం.) 'తనుప్ర జు మ్మన బోయతను బిట్టు గదిసి । కనుక నిఁ దమకించి కౌఁగిటఁ జేర్చె' (విష్ణు. పూ. 3ఆ) (సూ.శ ర.). (సూ ని.) (అమ.క.143పొ. 7పం.) అని మఱియొకప్రయోగమును గూడఁ జూపినది' అని చేరవలయును.

(2.123ప. లో) 395పు. 22పం. తరువాత- 'గిటక.— 'గిటర'అని (వావి. అపపా.). 'రింగణా' (వావి.పా.)'అని చేరవలయును

(2.124ప. లో) 397పు. 20పం. తరువాత- 'మొంతి — 'మొంపి మొ ట్టిన' అని (వావి.పా.). (బ్రౌ.పా.) 'మొండి మొం డన'అని అగపడు చున్నది (చూ.అను.). ఇట'మొండు+అనన్' అని ఛేదము. ఇది (పారాం.). (ఆం.భా.పా.) ఇదియే బనను రావచ్చును ! 'మొం డొడ్డి'అని ఒకచో (ఆం.భా.) (చూ. 3.108ప.)' అని చేరవలయును.

(2.105ప. లో) 367పు. 18పం.లో 'ద్రోపది'కి (రూపాం.) 'ద్రోవది'. ప్రయోగములందు

‘ద్రోవది’అనియే నిర్ధారకము గా వాడఁబడు చున్నది ‘ఏపురయందును ద్రోవది ప్రీతితో, నొక్కొక్కయింటఁ దా నొక్కయేఁడు’ (భార ఆది 8.115.). ‘భూవరు లెల్లరు నొక్కట। ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం। జేవ సెడి .’ (భార. విరా.4 211 ) మొ. (సం ద్రౌపదీ. ప్రా. ద్రోవఇ.) (సూ.సూ ని ). ‘ద్రోవది’ కైన (రూపాం ) ‘ద్రోపది’ అన వచ్చును ప్రయోగము అన్వేషణీయము. ప్రయుక్తము లైనవానినే (ఆం.భా.) గ్రహించితి ననుచున్నది’ అని చేరవలయును.

(2.126ప. లో) 400పు. 19పం. తరువాత- ‘తుమ్ము:— ఇది ఇదివఱకు వచింపఁబడినది (చూ. 1.141ప ). ఇది రోగప్రకరణ మగుటనుబట్టి ఇచ్చటితుమ్ము ‘పడిసె (రోగ)ము’వలన ఏర్పడినతుమ్మును వచించును. పునరుక్తి లేదు’అని చేరవలయును. దీనికి తరువాత [‘ఉక్కిస మన’అని (వావి పా.)’]అని చేరవలయును.

(2 128ప.లో) 403పు. 12పం, తరువాత-‘కుట్టుసూల:—ఏకపదము గా దీనిని (శ.ర.) గ్రహింపక ‘కుట్టు,సూల’అని (రెండుపదములు గా) గ్రహించి, వేఱు వేఱు గా అర్థ మొసఁగినది. (సూ.ని.) ఏకపదముఁ గా దీనిని ఇచ్చినది (చూ.కుట్టు). ‘కుట్టుతేలు’ వంటిది ‘కుట్టుసూల’అన వచ్చును ‘శూల’ శబ్దమునకు ‘రోగము, రోగవిశేషము’-అర్థ మను చున్నవి నిఘంటువులు. ‘శూల-రుజాయామ్’అని ధాతుపాఠము. ‘అస్త్రీ శూలం రు గాయుధమ్’అని(అమ.) ‘రోగభేదే ఖభే చ్ఛూలం పృత్యోః ప్రాసురాస్త్రతే। యోగభేదే ధ్వజే శూలః శూలా పణ్యస్త్రియాం మతా॥ శూలం విక్రయనే ఽపి స్యాత్’ ఇతి ప్రతాపః’అని (గురు.)’అని చేరవలయును

(2.133ప. లో) 410పు. 6పం. తరువాత- ‘కోలెముక’—ఇట ‘క్రోవెముక’ అనియే (బ్రౌ వావి. పా.). (సూ.ని.శ బ్దా.లు) ‘కోలెముక’ అనియే గ్రహించినవి. ప్రయోగములు ‘కోలెముక’ అనియే దీనిని అను చున్నవి- ‘కొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టుల। య్యన్నిటి నయ్యులూకమురయం బెనఁగన్ వధియించె భూవరా!’ (‘భార. సౌ. 1.18.). నిర్ధారకప్రయోగముగూడ ఒకటి ఇట్లున్నది- ‘నేలఁ బెట్టి వానిఁ గోలెమ్ము బ ల్లన। విఱిచి నడుము ద్రుంచి వీచి వైచె’ (భార. ఆది 6. 215.). ‘కోలెముక’కు రూపాంతరములే ‘కోలెమ్ము, కోలెమ్ముక’ అనునవి. బ్రౌ.వావి. పారమునందు (క్రోవి+ఎముక) అని (వ్యు.)

ఆనవలయును. పరిశీలించిన, 'క్రోఁచముక' కైన ప్రాయోగికాంధ్రప్రమాణము 'క్రోఁచముక'యైన దేమో ! అనిపించును అప్పుడు 'క్రోల్పులి' మొ. వానివంటిది 'క్రొంచము' అనవలయును. ఇది అంత సముచిత మనిపించుట లేదు. (సూ.ని శ.ర.మొ) 'క్రోఁచముక' గ్రహింప కుండు టనుబట్టి దీనియునికియు శంకింపవలసినదిగానే ఉన్నది' అని చేరవలయును.

(2.138ప లో)418పు. 20పం. తరువాత-'మోఁచేయి నాఁ బ్రగండంబు' (ఆం భా 2 138.) అని (సూ.ని.) (చూ. మోఁచేయి) (ఈ సూ.ని.పా.అపపా.).' అని చేరవలయును

(2.139ప. లో) 9పం. గా 'అంగుటము —దీనికి (సూ.ని.బ్రౌ.) 'అంగుష్ఠమే' అర్థ మనినవి. (సూ ని.)ప్రయోగమునుగూడ ఇట్లిచ్చినది-'వారిఘుర్ పుడిసిలింతునె మందర మంగుటంబునం జిఱునుదునే. '(భా రా.అర 2.104.) (సం. అఙ్గుష్ఠః. ప్రా. అంగుట్ఠో క. తు. అంగుట, ఉంగుట.) (చూ.సూ.ని.). (రూపాం. ఉంగుటము) (క. ఉంగుట, ఉంగుట్ట) 'మ్రొక్కి-నిలిచి యతనిముందట మేదిని। నుంగుటము నొఱయుచు నున్నఁ జూచి। యెచటినుండి రాక యెవ్వనిసుత వేమి । పనికి వచ్చి తనిన నదియు.' (నిర్వ.3.49). 'చిఱుము' నకు (ఆం భా.) కోరాడుట- అర్థ మను చున్నది. (సూ ని) దానిని దీనికి (అర్థాం.) అనినది. పై ప్రయోగము కడఁగూడ ఆం.భా.కు 'కోరాడు' అనెడి-అర్థమే అభిప్రేత మేమో ! (వంచినబొటనవ్రేలితో) మందరమును బొడిచి బొడిచి బొడిబొడి చేసి దుమ్ము లేఁగఁ జేయుదునా? అనుట (ఆం.భా) ఇచ్చట వచించెడి-అర్థ మనుకొనవచ్చును. బొడుచుట కైన 'అంగుష్ఠసంనివేశవిశేషమునే' (వంచినబొటనవ్రేలినే) 'అఙ్గుష్ఠవిశేష' మని (ఆం.భా.) ఇట వ్యవహరించిన దనిపించును. 'బొటనవ్రేలు' అనునది దీనికి (అర్థాం.). ప్రసిద్ధార్థములందు విశేషశ్రద్ధ వహింప కుండుట (ఆం.భా.) పద్ధతి. అందుల కిదియు ఒక నిదర్శనము. (శ ర) 'తనయంగుటంబు వ్రేలం గీఱిన' (భార.శల్య.)అని,ప్రమాణము గా 'అఙ్గుళ్యగ్రేణ రాజేన్ద్ర స్వాఙ్గుష్ఠ స్తాడితో ఽభవత్' అని (సం. భార. శల్య.) ఉదాహరించినది' అని చేరవలయును.

(2.144ప. లో) 429పు. చివర వేఱు గా 'క్రేఁగన్ను:—దీనిని (శ.ర) నిరనుస్వారముఁ గానే ఇచ్చినది. ఒకప్రయోగముగూడ ఇట్లున్నది- 'క్రేకంటిలింగంబుదాకన్ను సూచి' (బస. 3ఆ. 80).ఐనను(సూ.ని.)దీనిని నిరనుస్వారముఁ గా గ్రహించి (నిర్ధారకములు గా లే కున్నను)

ప్రదర్శించు చున్నబహుల ప్రయోగములనుబట్టి, బాలవ్యా.సారస్యమునుబట్టి, ఆం. భా. ప్రతిపాఠయథాస్థితినిఁబట్టి 'క్రేఁగన్ను' అని (సానుస్వారముఁ గానే) నేను (దీని నిట) గ్రహించితిని.(బ.స.)ప్రయోగము పరిశీలించిన అంతప్రబలప్రమాణమును గాదు' అని చేరవలయును.

(2.156ప. లో) 455పు. 22పం.చివర-'ఇది (అర్థాం.) అనఁ దగినది'అని చేరవలయును. దీనికి తరువాత వేఱుగా 'హసావళి.—(బ్రౌ.) దుప్పటి (O. G.) అనినది. మఱియేనిఘంటువులు (శ.ర.మొ.) దీనిని స్పృశింప లేదు నాచూచినంతలో.'అనియు చేరవలయును. ఇదిగాక, ఈ పుటలోనే 11పం. చివర- 'హురుముంజిముత్యాలయరచట్టపై గొప్ప,పతకంపుహారముల్ పరిఢవిల్ల' (విజ. వి. పీఠి. 36.) (చూ.సూ.ని.) అని చేరవలయును.

(2.164 ప. ) లో 469పు. 16 పం.గా 'ఒరగు'నకు ప్రయోగ మి ట్లున్నది- 'ఒక్కకే లొరగుపై నునిచి యేకాంతంబుఁ, దెలుపుచుఁ గూర్మి నెచ్చెలులు సనఁగ' (శుక.1.321.) (చూ.సూ.ని.)' అని చేరవలయును,

(2.175. ప. లో) 490పు. 18పం. తరువాత-'జోదిళ్లు:—ఇది (వ్రాఁతప.పా.). 'జోబిళు'అనునది (ముద్రి.పా.). 'ఘనత నహోబలగరుడాద్రిహిర,ణ్యాసురవధునకు నతి జోది ళ్లని' (హంస. 4.213.). 'జోబిళ్లు'అని (శ.ర.ముద్రి.) ' ఇట (నతి-నమ్రత-అని శ.ర.) (చూ.సూ.ని)'అని చేరవలయును.

(2.186ప. లో) 510పు. 6పం. తరువాత-'క్రిక్కలు:—ఇట బహువచననిర్దేశము అవివక్షితము. వివక్షిత మగుచో 'బహుతఁ దనరు' అనురీతిని (ఆం.భా.) వచించును. కనుక నే క్రిందిరీతిని ఏకవచనాన్తము గా ప్రయోగము ఇ ట్లున్నది-'..అభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ।క్షమతం బేర్చుచశుక్యవిశ్వవిభుశశ్వద్దానధారాజలౌ । ఘముతో సాటికిఁ బాటి సేసెదవు క్రిక్కా । చక్కఁ దర్కింపుమా।' (కావ్యా.7. 63మొ.) (చూ.సూ.ని.). వేంకనార్యుఁడు తన మల్లుపురాణమున దీనిని బహువచనాంతముఁ గా ప్రయోగించినాఁడు- 'పసిఁడిజీరాపట్టైపనికీలుటండియ, లడుగుఁ దమ్మిలఁ గ్రిక్కలట్ల తనర' (4.57.) (చూ. సూ.ని.). ఇంతమాత్రమున ఏకవచనాంత ప్రయోగము ఈతనికి ఇష్టము గా దన వీలు గాదు'అని చేరవలయును. (ఇది గాక) ఈపుటలోనే

19పం. తరువాత వేఱుగా-'పగ:_ ఇదివఱకును 'వైర' పర్యాయములు వచింపఁబడినవి) చూ' 1.134). (ఆం.సం.) శత్రుత్వపర్యాయము లనుచు కొన్నిటిని ఇట్లు వచించినది- 'వైరము నకును ధర సమాహ్వాయము లమరుఁ। గంటు పగ మచ్చరంబు సూ డొంటమి యన' (మాన. 47.). (సాంబ) గూడ వీనిని ఇ ట్లుదాహరించినది-' వేరము కంటు । సూడు పగ దేస మనఁగఁ బొల్చును విరోధ । నామములు . ' (మాన. 31.). (ఆం. భా.) ఇట 'విద్వేష' మని, అట-'వైరము'అని అర్థనిర్దేశ మొనర్చినది. 'విద్వేషము, వైరము' సాధారణము గా పర్యాయము లనఁ దగినవే ఐనను, పునరుక్తిపరిహారమునకై విశేషవివక్షతో 'విద్వేషము-సహజశత్రుత్వము, 'వైరము-కృత్రిమశత్రుత్వము'అని (ఆం.భా.) అభిప్రాయపడిన దనవలయును. (బ్రౌ.) 'కంటు'-సహజశత్రుత్వము-అని వచించినది. 'కంటు' నకు రెండర్థములును (కృత్రిమశత్రుత్వము,సహజశత్రుత్వము-అనునవి) కల వనవలయును (ఆం.భా ) రెండుచోట్లను 'కంటు' గ్రహించి యుండుటనుబట్టి. లేదా , (సూ.ని.)'వైరము' అనుదానికి మొదటియర్థము గా శత్రుత్వము, పగ, విరోధము-ఇచ్చి, రెండవయర్థముఁ గా 'ద్వేషము, కసి' అనుదానిని ఇచ్చినది. ఈరెండర్థములనే వేఱు వేఱుగా (ఆం భా.) వచించిన దనవలయును. (భార.ప్ర.) ఒకటి 'ఒంటమి'కి ఇ ట్లున్నది- 'ఒంటమిని లేనియొంటర।మింటరములు వలుకు టుచితమే యర్ధరథుం । డంటి నను నేమితక్కువ।గంటి చెపుమ....' (భార. (ఉద్యో. 4. 237.), ఇచ్చట (సం. భార.) ఇ ట్లున్నది-'పితామహ । యద్యేష్టం మాం వాక్యైరుపకృన్తసి । అనాగసం సదా ద్వేషా దేవమేవ పదేపదే' (సం. భార. ఉద్యో.168.11.) (చూ. సూ. ని.). ఇట-'అనాగసమ్' సదా, ద్వేషాత్' అనునవి 'సహజవైరము'నే వచించిన వన వచ్చును. దానినే (తెలుఁగు) భార. లోని 'ఒంటమి' అనునది వచించిన దనుట సముచితమే' అని చేరవలయును.

(2. 189ప. లో) 518పు. 3పం చివర- (బౌ. పా. కూడ) 'ఒండన' అనియే ' (చూ. అను.). రెంట-ద్వైధీభావము. అము. ప్రయోగము ఇ ట్లున్నది-'తా రె ట్లట్లు గఁ దమ్ముం । జేరిన ముత్తెంపుసరులఁ జేడియచన్నుల్।లోరెంట టుడిపె ఘన మగు । వారు నిజార్జవము చేరువారికి నీరే ?' (5.23.') అని చేరవలయును.

(2. 196ప. లో) 533పు. 5పం. తరువాత-'.. .పాగ లాయ మన నొప్పు వాజిశాలకును' (సాంబ. తిర్య. 73.). ఇది (అర్థాం ) అనఁ దగినది-'యవనాధిపతి యుపాయనము గా నొసఁగిన,పాగా హయంబులు వాగె వచ్చు' (కాశీ. 1. 34.).ఆం.భా. అర్థమునకుఁగూడ (ఆము.) ప్రయోగము ఇ ట్లున్నది-'క్రేపు దలఁచి పసి మేయుచుఁ। జేపినపా గ్గలయ నెండచేఁ బాంధజనుల్ । దూ పింపమి కజుఁ డంపిన । యాపాగా యనఁగ నదుల నంచలు మెఱసెన్' (4 168.) (చూ. సూ. ని.). ఇట-(ఆము.వేద.వ్యా.) ఇ ట్లర్థ మిచ్చినది-'అజుఁడు=బ్రహ్మ. అంపినఆపాగా= పంపినట్టితనగుఱ్ఱపుఁదబేలా (అనఁగా తనతబేలాలోనిగుఱ్ఱము లన్నియు) అనఁగన్=అను నట్లు గా .' (అని). (ఆంభా ) ఇచ్చిన-అర్థమే ఇట 'పాగా' కు సముచిత మని వేఱు గా వచింప నక్కఱ లేదు. (సాంబ.) ఇచ్చిన-అరమునుగూడ (ఆం.భా.) గా దన లేదు 'మందు రోష్ణీషము ల్మనును బాగా యన ...' (3. 47.). పూర్వము చెప్పనియరములఁగూడ (నానా. వర్గ ) సంగ్రహించును (చూ. నానా. వర్గ. నావ్యాఖ్యారంభము.).

(2. 205ప. లో) 553పు. 10పం. చివర 'ఆయిత్తపాటు' నకు (శ. ర.) నిర్ధారకప్రయోగ మి ట్లిచ్చినది- 'సేవకులకు విష్ణుసారూప్యసౌభాగ్యవిలసనంబు । లెప్పు డపుడె సృజింప నాయిత్తపాటు । వెలయ నున్నది. .' (పర. 2.) (చూ.సూ ని.)' అని చేరవలయును.

(2.2।4ప. లో) 570పు. 18పం. తరువాత వేఱు గా-'నరాజి:— 'నరాబు'అనుదానిని ఖడ్గపర్యా యముఁ గా (బ్రౌ.) ఇచ్చు చున్నది (చూ.అను.). దీనినిఁబట్టి ఇట బ్రౌ. (ఆం. భా. పా.) 'నరాబు' అగునా ? అనుసందేహమునకు అవకాశ మున్నది. 'నరాజి'కి 'నరాజీ' 'నారాజి' (రూపాం.). ప్రయోగము లి ట్లున్నవి-'ఒక్కొక్క-కెందలి రుదయించెఁ దరురాజిఁ, దోర మై తనరెఁ గంతునినరాజి' (కృష్ణ.4.42.). 'తననరాజీచిల్వకును మార్తురాతేండ్లయుసురుగాడుపు లింపు లొసఁగు చుండ' (యయా,1.57.) (చూ.సూ.ని.). పై ప్రయోగములు నిర్ధారకములు గా లే కున్నను, 'నారాచః (సం.)నుండి ఏర్పడిన 'నారాజి'కి (రూపాం.) 'నరాజీ, నరాజి' అనఁ దగి ఉండుటనుబట్టి (బ్రౌ.) పరిగ్రాహ్యము కా దనియే తోఁచు చున్నది-'నారాజి'కి నిర్ధారక ప్రయోగములను ఇచ్చినది (సూ.ని.)-'ఘోరాజిం దనతేజిఁ దోలి విమతక్షోణీతలాధీశులన్ । నారాజిం దెగటార్చి వీరభటసన్నాహంబుతోఁ జేరు....'(బహు.1.51.). 'నేజాలు నా । రాజుల్ గైకొని కోటలోఁ గొలుచునారాజుల్ తదంగంబు లు । గ్రాజిం జెక్కఁలు సేయుచో మరలె గంధానేకపం బార్భటిన్' (రా.వి.5.21.).' అని చేరవలయును.

(2 223ప లో) 592పు 9పంక్తి-'బాధకు' అనుదానికి తరువాత-'దేశోపద్రవాలవలన 'ముంచుకొని వచ్చినమహాబాధకు)' అని చేరవలయును. (ఇదిగాక) ఈపద్యములోనే 593పు. 13పం. గా 'ఉపద్రవము -కేవలముబాధ దీనికి అర్థము కాదు. (ఆం. భా) బాధకు పేర్లను వేఱు గా ఇచ్చినది (చూ 1 150). (అమ.) కూడ 'పీడా బాధా వ్యధా దుఃఖమ్' అని చెప్పి 'స్యాదత్యయ ఉపద్రవః' అని వేఱుగా (తరువాత) వచించినది. దీనినిఁబట్టి ఏకార్థకము లివి కావు-అనుట స్పష్టము' అని చేరవలయును

(2 224ప లో) 595పు 5పం. తరువాత- 'చంపుట'-'చంపుడు దునుముట ' అని (బ్రౌ. ప్రాఁతప్రతులపా.) (చూ.సూ ని.)' అని చేరవలయును

(2. 235ప. లో) 617పు. 16పం గా-'కాకిపెసర' అనునది పూర్వము 'కాకముద్గ' కు పేరు గా (ఆం భా చే) వచింపఁబడినది. ఇప్పు డిట 'క్షుద్రముద్గ' కు పేరు గా చెప్పఁబడు చున్నది. 'ఇది అవి వేఱు' ఏకము గాదు ' అని చేరవలయును.

(2. 261ప. లో) 676పు. 26పం. తరువాత 'గంగెద్దు:-గంగిరెద్దు (రూపాం.) 'గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్, కలిమి గలదెవారకామినులకు' (రామలిం.10ప.).

(2 247ప లో) 643పు 6పం. తరువాత-('సం. గళన్తికా క. గళలిగె) 'గలఁతియ'(రూపాం.)-'అలికులంబేటి యో ప్రాతనిహస్తములన్ ముఖమజ్జనాంబువున్ । గలఁతియ మెత్తి పోయ నవి గార్చుచు నుండె నతండు దోయిటన్' (నైష.6 112.)' అని చేరవలయును.

(2. 267ప. లో) 688పు. చిట్టచివర - 'బందాలము'- 'వానిబందాలము బయటఁ బడినది' -అని (వ్యవ), అది దీనినుండి ఏర్పడినదే అనవచ్చును' అని చేరవలయును.

(2.270ప. లో) 694పు. 16పం. తరువాత-'అద్ద'—(సం.అర్ధమ్ ప్రా. అద్ధమ్ క అడ్డ. త. అద్దం) సగము-అనునర్థమున ప్రాచీనప్రయోగము (దీనికి) లేదు (అద్దకూపాయ-మొ)-అని (సూ.ని.) (సూ.ని.) 2. అరణ్యం 'వనవాసు యచ్చ యం చనఁగఁ చదర్ధ మొప్పు' (ఆం. భా.2 270)అనినది. ఇట-'చదర్ధము' అనుట ప్రమాద మనిపించును ఆం భా. అర్ధమునకు (బ్రౌ.) ప్రయోగ మిట్లిచ్చినది-'తెగి గంటిపోటు గనొల్లయద్దల గిద్దలఁ బొడుచు వేఁగినవిగాది' (వేంక.పం.763). అద్ద=రెండుకూనికలకొలఁది-అనునది (అర్థాం.). అవి వేఱు. (సాంబ.)

ధాన్యము గొలుచువానిని క్రిందిరీతినిఁ బేర్కొనినది '. ..దూము ముంత ముకునంబు।బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ । గరిసె పుట్టి సెలగ మెడా కల మనంగ । ధాన్యములఁ గొల్చు వానికిఁ దగును' (మాన.52.)' అని చేరవలయును.

(2.275ప. లో) 706పు. 16పం.గా- 'సంకటము:-ఇది 'ఇఱుకు' అనెడి-అర్థమున సం.పదము గా కనఁబడు చున్నది' అని చేరవలయును.

(2.285ప. లో) 725పు. 4పం. తరువాత-'గానుఁగవాఁడు:-'గాండ్లవాఁడు' అనికూడ (వావి.ప్రతి) అధస్సూచికయందు పాఠ మున్నట్లు చూపు చున్నది. అది(పారాం.) అనవలయును' అని చేరవలయును. (ఇదిగాక)ఈ పుటలోనే (5పం.గా) 'వంటపూఁటవాఁడు' అని సానుస్వారము గా (సూ.ని.) గ్రహించినది. 'వూటము' అనుదేశ్య మొకటి 'భారము' అను-అర్థమున కానవచ్చు చున్నది. దానినుండి ఏర్పడినదే ఈ 'పూట' అనినప్పుడు నిరనుస్వారమేఇది అగును' అని కూడ చేరవలయును.

(3.1.118ప. లో) 930పు. 3పం. తరువాత వేఱు గా-'బోసేసెన్.- (బోనము+చేయు). (సాంబ.) కూడ దీనిని ఇ ట్లిచ్చినది-'బువ్వ మెతుకు కూడు బోన మోరెము ప్రసాదము వంటకము పసదనము బాతు।సాద మోగిర మన జరుగు నన్నముపేళ్లు, కుడిచె బోసేసె సాపడియె నమలె। నారోగిఁ మొనర్చె నారగించె మెసవెఁ, దినె మెక్కె నన భుక్తి గొనుట కలరు' (మాన. 22.) ఇట్లే (వేంక.44.). 'తెచ్చి సుఖమతి యనునామధేయమునను । బరఁగుప్రియురాలిచేతి కేర్పడఁగ నీయ । నాబి డన్నంబు సంకటి యంబలియును।జేయ సవరేయివేళ బోసేసి బోవు' (హంస.4.32.) (చూ.సూ.ని.)' అని చేరవలయును.

(3.119ప. లో) 932పు. 3పం. లో 'ఆవహించు'నకు 'ధరించు' అను-అర్థము ప్రయోగప్రసిద్ధమే- 'వరాహరూపం బావహించి రసాతలంబున సలిలనిమగ్న యగుపృథివి నుద్ధరించిన' (శివరా. 1.62.) (చూ.సూ.ని.).' అని చేరవలయును.

(3.83ప.లో) 898పు. 13పం. గా 'పండుండెను:-ఇది 'పరుండెను' అనుదానికి (రూపాం)అనఁదగినది. (సూ.ని.శ.ర.బ్రౌ.లు) ఈ-అర్థమున దీనిని గ్రహించినట్లు కానరా లేదు.(ఆం.భా.)

'పఱిగ'కు (రూపాం.) 'పడిగ' గ్రహించినది (చూ 3 62.). అది దీనిని 'కాదనదు' అని చేరవలయును.

(968పు.6పం.) తరువాత-'విశే.చిరత్నరత్నములు:-ఇది ఇదివఱకు వ్యాఖ్యాతము లచ్చట(200పు. 17 పం. చివర) 'సారం. ప్రయోగ మొకటి యి ట్లున్నది-'అన విని మందహాస మొలయం దమితోడ విభుండు పొండు మీ। వెనుకన వత్తు నన్నియును వేఁటకు నాయితపెట్టుఁ డిప్పుడే। యనియ చిరత్నరత్నఖచితాభరణంబులు పట్టుకోక యిచ్చినఁ గొని చెంచుతేం డ్రప్పుడు సింగఁడు బూరఁడు నై ముదంబునన్' (1ఆ.76ఉ.) (అని) ఇట 'లచిరత్న' అని పదచ్ఛేద మొనర్చి 'అచిరత్న=నూతనము లైన' అని వ్యాఖ్యానించు చున్నారు కొందఱు పరిశీలింపఁగా 'అనియ, చిరత్న' అనుటయే (పరిశోధనమునుబట్టి)నాకు ఉచిత మనిపించు చున్నది 'అనియు-' అనియే: చెప్పినదేడవు గా-చెప్పుచునే-అనుట. ఈకవి మఱియొకచో ఇందే 'ప్రామానికపు విగ్గుఁ బ్రామానికపుఱిలా, పట్టభంగంబులు పరిఢవిల్ల' (1ఆ. 112వ.) అని వర్ణించినాఁడు.(బ్రౌ.) ప్రాఁతశబ్దలు ప్తశేష మగు 'ప్రా' కు 'పురాతన మైనది. D. శ్రేష్ఠ మైనది-అని అర్థ మిచ్చి 'కళుకుప్రాఁగెంపుఁజెక్కడపుసొమ్ము ల టుండ, తెలిముత్తియంపుసొమ్ములు ధరించి' (N. 9. 329) మొ. ప్రయోగములను ఉదాహరింపవలెను' అని చేర్చవలయును.



# ఉన్నది - జరగవలసినమార్పు

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| | [ తొలిపలుకులో ] | | |
| సంపుటములు | భాగములు | 2 | 18 |
| సంపుట మిది | భాగ మిది | 2 | 18 |
| సంపుట మిఁక | భాగ మిఁక | 2 | 19 |
| ప్రథమసంపుటము | ప్రథమభాగము | 3 | 2 |
| బలున | బయిన | 4 | 10 |
| తూపరాణము | తూపరము | 6 | 23 |
| యటంచు | యటంచుఁ | 8 | 20 |
| వన్నియు | నన్నియు | 10 | 26 |
| వకు | నకు | 11 | 3 |
| యిచ్చి | ఇచ్చి | 16 | 12 |
| ఛోఁడి | బోఁడి | 26 | 4 |
| | [ ఆం.భా. పీఠికలో ] | | |
| వారి, కం | వారి కం | 1 | 16 |
| తూడ | కూడ | 4 | 25 |
| ఈతడు | ఈతఁడు | 5 | 13 |
| భా 'వోత్పత్తేః | 'భావోత్పత్తేః | 8 | 10 |
| భావ | భావా | 8 | 24 |
| సూర్యుడు | సూర్యుఁడు | 8 | 28 |
| ఏర్ప | ఏర్ప | 10 | 7 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| వలయ | వలయు | 12 | 25 |
| ముకవి | సుకవి | 12 | 25 |
| విర్వ | సిర్వి | 14 | 13 |
| తెలుఁప | తెలుపఁ | 14 | 21 |
| రజ్ఞ | రజ్ఞ | 16 | 14 |
| భూ | చూ | 16 | 9 |
| కవి : | కవి | 20 | 21 |
| తిక్కన్న | తిక్కన్న | 21 | 26 |
| కననంబు | కవనంబు | 22 | 20 |
| ఐనను | ఐనను | 24 | 13 |
| రీతిన్ | రీతిన్ | 25 | 17 |
| తెలిపిన | తెలిపిన | 25 | 20 |
| కొను చున్నాఁడు | కొనినాఁడు | 28 | 17 |
| దెలపి | వెలపి | 43 | 25 |
| పడి | వడి | 48 | 11 |
| అగ్రుధ్నుః | అగృధ్నుః | 48 | 22 |
| నంబో | సంబో | 50 | 23 |
| గాపల | గావల | 52 | 19 |
| బీజంబుతో | బీజంబులో | 55 | 5 |
| జ్ఞాన | జ్ఞాన | 56 | 17 |
| పంనిధాన | సంనిధాన | 64 | 7 |

[ ప్రథమ కాండములో ]

| | | | |
|---|---|---|---|
| కలువలచెలి | కలుములచెలి | 8 | 21 |

| ఉన్నది | జరగవలసిన మార్పు | పుట | పంక్తి |
| --- | --- | --- | --- |
| వేగంటి, | వేగంటి | 13 | 7 |
| జక్కులతేఁడు | జక్కులకు తేఁడు | 16 | 16 |
| లచ్చిచొర,బూరగొమ్మ | లచ్చిదొరబూరగొమ్మ | 17 | 8 |
| లచ్చిదొర,బూరగొమ్మ | లచ్చిదొరబూరగొమ్మ | 17 | 12 |
| అరము | అర్థము | 29 | 9 |
| కర్త | కర్మము | 31 | 11 |
| 6 855 | 6.98 | 38 | 22 |
| ౘాల | బాలా | 44 | 23 |
| నాటి | నాఁటి | 55 | 3 |
| యనంగ, | యనంగ; | 57 | 14 |
| క్రియావి | క్రియాజన్యవి | 58 | 27 |
| వంచాది | పంచాది | 60 | 15 |
| పమంబు | సమంబు | 65 | 5 |
| వేదవ్యా. | వేద. వ్యా. | 68 | 13 |
| లవణమునకు | లవణమునకు; షడ్రసములలో ఒకదానికి | 70 | 16 |
| అడ్డ | ఉడ్డ | 76 | 15 |
| వాకు | వాక్కు | 77 | 20 |
| దుస్థితి | స్థితి | 91 | 24 |
| ఋషయో | ఋషయో | 94 | 17 |
| సూనృతత | సూనృత | 94 | 22 |
| వఱగొడ్డము | వఱగొడ్డము | 98 | 7 |
| వోట | నోట | 98 | 22 |
| హుళికి | హుళిక్కి:-హుళికి | 99 | 26 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| మీదంఁ | మీఁదం | 103 | 23 |
| సంజ్ఞ, | సంజ్ఞ | 107 | 11 |
| వీరణంబు; | వీరణంబు, | 114 | 14 |
| విల్లసిల్లు | విలసిల్లు | 133 | 12 |
| మోనము | మెూసము | 134 | 16 |
| కొలువు | కొలుపు | 147 | 4 |
| తినుక | తినుకు | 160 | 7 |
| పుటమ్మ | పుటమ్ము | 165 | 12 |
| సంజ్ఞ; | సంజ్ఞ, పీ | 183 | 14 |
| దము | రము | 184 | 13 |
| వెల్లని | తెల్లని | 190 | 14 |
| వెల్లదమ్మి | తెల్లదమ్మి | 190 | 14 |

[ ద్వితీయకాండములో ]

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| పట్టడ, | పట్టడ | 242 | 8 |
| బరుడు | బరడు | 257 | 20 |
| గట్టి | గట్టె | 258 | 7 |
| ఏరండమునకు | ఏరండమునకు (ఆముదపుచెట్టునకు) | 272 | 20 |
| సుగంధపాల | సుగంధిపాల | 288 | 8 |
| వాటక మ్మగు | వాటక మ్మని | 292 | 6 |
| కోష్ఠికా | క్రోష్ఠికా | 292 | 20 |
| వ్రాఁకుడు | వాఁకుడు | 292 | 23 |
| తలపోటయ | తలపోటమ | 293 | 22 |
| ,జోతి | జ్యోతి | 293 | 8 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పం_క్తి |
|---|---|---|---|
| సంజ్ఞ | సంజ్ఞ | 300 | 16 |
| యనఁగను, | యనఁగను: | 305 | 20 |
| ఎక్కుడుదీగ | ఎక్కుడుఁదీగె | 307 | 9 |
| చిఱుగడ్డ | చిరుగడము | 312 | 12 |
| భేరము | భేదము | 313 | 10 |
| దర్మ | దర్శ | 327 | 19 |
| చిఱుతపులికి; పివంగికి | చిఱుతపులికి | 329 | 2 |
| చైన | బైన | 330 | 20 |
| తోడేలు | తోఁడేలు | 332 | 21 |
| బెబ్బులి | బె। బ్బులి | 333 | 9 |
| దగు: పెం | దగుఁ, బెం | 333 | 21 |
| పలె | వలె | 337 | 18 |
| బకదారులు, | బక, దారులు | 343 | 3 |
| గోరవంక:—— | గోరువంక:—— | 343 | 10 |
| 'గోరువంక' | గొరువంక . గోరువంక | 343 | 10 |
| పక్షికి, | పక్షికి, | 346 | 20 |
| బొచె | బొట్టె | 348 | 22 |
| బొచె | బొట్టె | 349 | 6 |
| రబించిన | రచించిన | 366 | 9 |
| సాగ | సొగ | 367 | 20 |
| అంకులాడి | అంకులాఁడి | 369 | 2 |
| అంకులాడి | అంకులాఁడి | 369 | 15 |
| (దిక్కు లేనిదానికి) | (నాధుఁడు(భర్త)లేనిదానికి; విధవకు) | 369 | 17 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| ప్రసూత-ఇది బాలెంతకు | బాలెంత—ఇది ప్రసూతకు | 374 | 12 |
| సోదిక త్తె | సోదెక త్తె | 375 | 21 |
| చెలియ | చెలియలు | 385 | 5 |
| మేనమఱఁద | మేనమఱఁద, | 382 | 24 |
| మేనమఱఁదలు— ఇది మేనవదినెకె పేరు | మేనమఱఁదలు—ఇది తనకంటె చిన్నదైన మేనమామమేన త్తలకొమార్తెకు పేరు మేనవదినె—ఇది తనకంటె పెద్దదైన మేనమామమేన త్తల కొమార్తెకు పేరు. | 383 | 13 |
| మేలువాఁ | మేలువా, | 383 | 8 |
| అసతి | ఆసతి | 384 | 7 |
| వంపు | వంపు | 393 | 8 |
| నసు | నను | 394 | 25 |
| గురుకు | గుఱుకు | 398 | 14 |
| తిమిర | తిమిరి | 399 | 5 |
| తిమిర | తిమిరి | 399 | 18 |
| కందనగాయ మన | కందనగాయ యన | 407 | 13 |
| గు రు | గురు. | 408 | 18 |
| ్రగను | గను | 409 | 6 |
| కింది | క్రింది | 409 | 19 |
| ్రనేత | నేత్ర | 411 | 2 |
| మోచెయి | మోఁచెయి | 417 | 11 |
| హ్వాయంబు | హ్వాయంబు: | 417 | 17 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| మోచెయి | మోఁచెయి | 418 | 2 |
| ఎలుగు | ఎలుఁగు | 414 | 6 |
| నితమ్బస్త్రీ | నితమ్బో ఒస్త్రీ | 414 | 20 |
| మిగులు: | మిగులుఁ: | 419 | 3 |
| పిడి, తక్కువ | పిడి తక్కువ | 422 | 14 |
| కబరికి | కబరి | 432 | 2 |
| నూగారు | నూఁగారు | 432 | 19 |
| దశాప | దశావ | 440 | 7 |
| సరిసెన | సరిపెన | 440 | 5 |
| పయంట | పయ్యంట | 452 | 7 |
| బురుసా ! | బురుసా | 453 | 7 |
| చున్నది | చున్నది (ఁబౌ ) | 453 | 1 7 |
| ప్రాఁజౌత | ప్రాఁజౌతు | 453 | 18 |
| దుప్పట్టి, దువ్వల్వ, వీణము, దుప్పటము— ఇవి హసావళికి | హసావళి, దువ్వల్వ, వీణము, దుప్పటము— ఇవి దుప్పటికి | 454 | 16 |
| అనఁగను:.... ఛిధతడు, | అనఁగను . ఛిధ, లడు, | 456 | 3, 4 |
| గంధ | గంధ | 457 | 17 |
| కంబలి | కంబళి | 458 | 6 |
| ఉల్లాప | ఉల్లడ | 458 | 10 |
| ప్రాముఁడు | ప్రాముడు | 460 | 10 |
| నమ్మ | నము | 472 | 4 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| ఒస్త్రీ | స్త్రీ | 474 | 13 |
| సేవనుండి ఏర్పడిన (వికృ.) 'సెవ' ఇది అగు ననిపించు చున్నది | ఇది ఇచ్చటిది కాదు, (487పు. 4పం. చివర చేరవలసినది) | 487 | 2 |
| ఔంకనాలు | ఔంకణాలు | 489 | 12 |
| ఔంకనాలు | ఔంకణాలు | 490 | 2 |
| కాలత్ | కాలాత్ | 492 | 9 |
| కళవపము | కళవసము | 493 | 21 |
| గవలియు | గవలియును | 496 | 26 |
| క్షత్త్రియునకు; | క్షత్త్రియునకు | 501 | 15 |
| పగతుఁడు, పగవాఁడు | పగతుఁడు, పగఱు. పగవాఁడు | 508 | 14 |
| ఆని | అని | 510 | 9 |
| ౖపత్య | ౖపత్య | 512 | 13 |
| వౖటు | వౖటువ | 513 | 2 |
| బొలు; | బొలు | 513 | 8 |
| కర్మను | కర్మసు | 519 | 16 |
| అరిబడి | అరి, బడి | 521 | 12 |
| దీనారమునకు | దీనారముఖభాగధేయమునకు | 522 | 11 |
| జజ్ఝా | జజ్ఝా | 536 | 22 |
| జి.కా.శి. | జి. కాశి. | 537 | 7 |
| యనఁగ | మనఁగ | 538 | 28 |
| పల్ల | పల్లము | 539 | 14 |
| స్యా ద్వేసరో వేటసరః' | పునః స్యా ద్వేసరో వేగసరః' | 543 | 16 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| (సూ.ని.). | (సూ.ని.) | 549 | 16 |
| సన్నాహ | సన్నాహనా | 552 | 2 |
| సంగడయు | సంగడము | 557 | 3 |
| బాలసంగడ | బాలసంగడము | 557 | 4 |
| ముపకు | మునకు | 557 | 15 |
| వదియె | నడియె | 571 | 12 |
| నిది | నది | 572 | 14 |
| ఇట్టి | ఇట్టి | 573 | 2 |
| ఆయుధము. | ఆయుధము | 578 | 23 |
| బజాయి | జజాయి | 519 | 25 |
| ఆని | అని | 581 | 4 |
| దంత।పు | దం । తపు | 581 | 12 |
| పెక్కండు | పెక్కెంబు | 586 | 2 |
| పెక్కండు | పెక్కెంబు | 587 | 6 |
| శుష్మ | శుష్మం | 588 | 7 |
| దంట, పోరు | దంటపోరు | 589 | 17 |
| పరి | పఱి | 592 | 10 |
| దెళ్లట | ద్రెళ్లట | 595 | 8 |
| పీనుం; | పీనుం, | 595 | 13 |
| వైశ్వ | వైశ్య | 600 | 18 |
| కమ్మతీడు | కమ్మతీఁడు | 602 | 18 |
| గద్దము | గడ్డము | 605 | 21 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| గడ్డము | గడ్డము | 605 | 22 |
| (రూపాం.) గా | (రూపాం.) అనునట్లు గా | 605 | 22 |
| బాపటము | • బాపటము | 612 | 9 |
| బౌ. | బ్రౌ. | 615 | 4 |
| (సూ అని). | (సూ.ని.). | 617 | 15 |
| గుంట | గంట | 620 | 9 |
| నూఁకలు | నూకలు | 624 | 21 |
| అం.భా. | ఆం.భా. | 626 | 9 |
| కొఱలు | కొఱలుబొగ్గు | 631 | 13 |
| స్థాలికి; | స్థాలికి | 639 | 9 |
| షడ్రసములలో ఒకటికి; కూర లో నగువానిలో | కూర లో నగువానిలో | 646 | 13 |
| గజుట్టి | గఁజుట్టి | 647 | 19 |
| 'దాల్చి' | దాల్చి | 647 | 21 |
| మిశ్ర ని. | మిశ్రని. | 648 | 26 |
| నూనె | మానె | 650 | 21 |
| లెత్తి, చల్లిన | లెత్తి చ, ల్లిన | 658 | 10 |
| యుప్పి | యుప్పి, | 659 | 5 |
| జవ్మ | జన్మ | 686 | 9 |
| (అని.) | (అని) | 686 | 14 |
| ఒకండు. | ఒకండు, ఒండు, | 689 | 14 |
| తెలుగు | తెలుఁగు | 692 | 2 |
| కుడవ'ః | కుడవః' | 694 | 7 |

| ఉన్నది | జరగవలసిన మార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| పణము-ఇది రూకకు | రూక—ఇది పణమునకు | 698 | 8 |
| క్త్రై | క్తై | 700 | 16 |
| దమ్మ్ర య | దమ్మ్ర, మ | 701 | 20 |
| పటికయం | పటికమం | 711 | 8 |
| తుట్ట | తుట్టె | 714 | 18 |
| దర్జీనివాకి | దర్జీవానికి | 718 | 3 |
| కభిప్రేత | కనభిప్రేత | 727 | 15 |
| వరవుఁడు | వరవుడు | 730 | 2 |
| వరవుఁడు | వరవుడు | 730 | 14 |
| చీలకు | చీలకు; | 740 | 22 |
| తలి | తతి | 744 | 4 |
| తోఁడుఁడు | తోఁడుడు | 746 | 22 |
| రాణి | రాణ | 748 | 18 |
| పావాలు పావకో | పావాలు పావలు పావకో | 752 | 24 |
| నారుగ | నారగ | 753 | 13 |
| తరాను | తరాసు | 755 | 25 |
| పూట | పూఁట | 763 | 7 |
| | [ తృతీయకాండములో ] | | |
| బేరుగా, | బేరుగా, | 779 | 7 |
| పరతంత్రునకు | అస్వతంత్రునకు | 779 | 25 |
| మనిపించుచు | మనిపించు | 781 | 15 |
| డుజ్ఞు | డుజ్జు | 783 | 13 |
| ఆమ. | అమ. | 785 | 13 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| బొ. | ౹బొ. | 787 | 11 |
| దోషము) | దోషము. | 792 | 11 |
| ౹శేష్ఠతకు | ౹శేష్ఠతకు; | 797 | 13 |
| లేదు. | లేదు | 797 | 18 |
| నాగఁ; | నాఁగఁ, | 798 | 8 |
| డొడ్డ | దొడ్డ | 800 | 12 |
| హొొమ్మ। | హొొమ్మ, | 800 | 12 |
| 71 | 49 | 800 | 13 |
| డగ్దఱ | డగ్గఱ | 803 | 12 |
| | ) | 805 | 17 |
| దాఱుమాఱు, | దాఱుమాఱు | 812 | 11 |
| గద్దింపు, | గద్దింపు | 814 | 3 |
| హీస | హీన | 816 | 14 |
| దిస | దిన | 816 | 24 |
| విశేష్యనిష్న | సంకీర్ణ | 919 | 1 |
| విశేష్యనిష్న | నంకీర్ణ | 821 | 1 |
| ..యీఁటెకు) | ..యీఁటెకు), | 825 | 3 |
| కార్ధ | కార్థ | 825 | 26 |
| వరము | వర్గము | 826 | 7 |
| శ్మిఖా | శ్మిఖా | 826 | 12 |
| చిన్నిపువ్వు:— | చిన్నిపూవు;— | | |
| చిన్నిపూవు (రూపాం.). | చిన్నిపువ్వు (రూపాం.). | 827 | 2 |
| చిన్నిపువు). | చిన్నిపూవు). | 828 | 3 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| ముండ్లున్న-అని | ముండ్లున్న O.g' అనినది | 832 | 20 |
| (ప్రాంతప్ర.పా.) | (ప్రాంతప్ర.పా 'కుట్టుతేళ్లు') | 832 | 21 |
| టెక్కెము: | టెక్కెము | 832 | 25 |
| నెమ్మి:— | నెమ్ములు.— | 833 | 25 |
| 'నెమ్మి'అను | 'నెమ్మి' (నెమిలి) | 833 | 25 |
| అనవచ్చును | అనిపించును | 833 | 26 |
| (ఎమికె) | (ఎముక) | 834 | 2 |
| ఎమ్ములు] | ఎమ్ములు] పరిశీలించిన (నెమ్మి-(నెమిలి) బ. నెమ్ములు. నెమ్మ (ఎముక) బ. నెమ్ములు-అనుటయే యుక్త మనిపించినది 'హోదులయు నీలుగు లో నగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు' (బాలవ్యా.ప్రకీ 10సూ.). | 834 | 2 |
| కోరికకు). | కోరికకు), (అక్కర) | 839 | 9 |
| షధ్యా | మధ్యా | 840 | 2 |
| గాదమునకు; | గాదమునకు ( | 841 | 3 |
| 13.). | 13.) | 842 | 2 |
| 'ఏవకు' కు | 'ఏవ' కు | 844 | 19 |
| ఖొల్చు. | ఖొల్చు | 855 | 7 |
| ఆను | అను | 855 | 24 |
| పిడె | పిడె | 866 | 4 |
| (ఆం.భా.).పటిగకే | (ఆం.భా.), వటిగకే 'ల-డయో రభేదః' అనునట్లు | 866 | 12 |

| ఉన్నది | జరగవలసినమార్పు | పుట | పంక్తి |
|---|---|---|---|
| భూమిలున్న' D | భూములున్నD' | 866 | 21 |
| గూఢ | గూడ | 866 | 21 |
| రుచికి); - | రుచికి), | 868 | 14 |
| (ఆం.భా.) | (ఆం.భా.). | 869 | 3 |
| అవి | అని | 869 | 7 |
| అర్ధ | అర్థ | 870 | 25 |
| కొప్పు' । | కొప్పు' | 871 | 5 |
| లబ్దము | లబ్ధము | 874 | 6 |
| మొక్కుడు | మెక్కుడ | 878 | 2 |
| ...నెంతేనియు । | .నెంతేనియు. | | |
| ....భృశము గా । | . భృశము గా. | 878 | 2, 3 |
| నెట్టకేలకు | నెట్టకేలకు, | 882 | 14 |
| ద్వర్థ | ద్వ్యర్ధ | 882 | 19 |
| త్వర్ధ | త్వర్థ | 882 | 3 |
| భేళ్లు | బేళ్లు | 884 | 18 |
| సాచ్యర్థ:మొప్పును | సాచ్యర్ధ మొప్పును: | 884 | 26 |
| కుండ,గ | కుండఁగ | 885 | 16 |
| (బాల.పా.)కు | (బాల.పా.) నకు | 886 | 13 |
| డర్థము | దర్థము | 888 | 13 |
| ఇవి సర్వమునకు: | ఇవి (ఏకార్థకములు-ఒకేయర్థము కలవి) (సర్వమునకు: | 889 | 17 |
| అంగీ....సమ్మతికి | (అంగీ ...సమ్మతికి) | 890 | 9 |
| (ఆం.భా.9 | (ఆం.భా.) | 893 | 27 |

